అపరాధ పరిశోధన అనుబంధం— 58

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## పారగన్ సర్కస్

రచన : 'సికిందర్'

## చిత్రమైన ఖైదు

రచన : వసుంధర

## మిస్. శోభాసింగ్

రచన : సంపత్

## నకిలీ భర్తలు

రచన : ఏ. వీ. మోహన్రావ్

'అంగారక'-నాలుగవ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్—58
అక్టోబర్, 1978
వెల : రు. 3_50
ఏడాది చందా 45 రూపాయలు
జీవితచందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

# పారగన్ సర్కస్

'సికిందర్'

హైదరాబాద్‌లోని అందమైన ప్రదేశాల్లో పబ్లిక్ గార్డెన్స్ ఒకటి.

అతడామెని సరిగ్గా అయిదు గంటలకి అక్కడ కలుసుకుంటానన్నాడు. కానీ పది నిముషాలు దాటి పోయినా అతని జాడలేదు. గేటు దగ్గర ఆమె అసహనంగా ఎదురు చూస్తోంది.

సాయంత్రం కావడంవల్ల, అందులోనూ వేసవికాలం కావడంవల్ల గార్డెన్స్ అంతా జనంతో కిటకిటలాడి పోతోంది.

అతడు గేటు దగ్గర కలుసుకుంటానని చెప్పాడు కాబట్టి ఆమె అక్కడే నిలబడి ఎదురు చూస్తోంది. లోనికి వచ్చే ప్రతి వ్యక్తినీ చూపులతో వెదికేస్తోంది. తనక్కావలసిన మనిషి అతను కాకపోవడంతో భారంగా నిట్టూర్చి తిట్టుకుంటోంది.

నిరీక్షణ!

ఒకరి కోసం నిరీక్షించడమంటే ఆమెకు చిరాకు. ఈ గార్డెన్‌లో ప్రవేశించినవారంతా ఆనందంగా, సంతోషంగా గడుపుతున్నారు. మరి తనేమిటి, ఈ పది నిముషాలూ ఇంత నరకయాతన అనుభవిస్తోంది! ఓహ్, మగాళ్ళని నమ్మకూడదు!

అందుకే ఆమె పాతికేళ్ళ కన్యగా మిగిలిపోయింది. ఆమె ఇంతవరకూ ఎవర్నీ ప్రేమించలేదు. ప్రేమించకూడదని నిశ్చయించుకుంది. కారణం: తను యవ్వనంలో ప్రవేశించినప్పుడు చూసిన ఒకానొక జుగుప్స కల్గించే సంఘటన.

మగవాళ్ళు! దేవుడు వీళ్ళని ఎందుకు సృష్టించాడూ?

"జయా!"

ఆమె ఒళ్ళు జలదరించింది. స్థాణువై నిలబడిపోయింది. అదే కఠినమైన గొంతు! ఆ గొంతు వింటే ఆమె ప్రాణాలు గడగడలాడతాయి. కానీ, ఆ పెద్దమనిషి వలలో తనెలా పడింది!

ఛటుక్కున వెనక్కి తిరిగి చూసింది.

నవ్వుతూ చూస్తున్నాడతను. దృఢమైన శరీరం, పొడవాటి చేతులు, పల్చటి పెదవులు, నల్లటి పాము కళ్ళు- ఆ కళ్ళే తనని వశపర్చుకున్నాయని జయ భావిస్తోంది- మొనదేలిన ముక్కు, వెడల్పాటి ఛాతీ. జయకు అతనిలో నచ్చని అంశాలు కళ్ళు, కంఠస్వరం.

సుమారు ఆరవై ఏళ్ళ వయసువున్న ఆ పెద్దమనిషితో వారం క్రితం మొదటిసారి పరిచయమైనప్పుడు తనపేరు నందకిషోర్ కౌషిక్ అనీ, బొంబాయిలో ఓ పేరుపొందిన మాసపత్రికకు ప్రత్యేక విలేఖరిననీ, వారం రోజులక్రితం ఈ సిటీకి వచ్చాననీ, 'పారగన్ సర్కస్' మీద ఒక

వ్యాసం వ్రాసేందుకు నిశ్చయించుకున్నాననీ చెప్తు న్నాడు.

జయ తేరుకుని అతనివేపు చకచకా అడుగులేసింది.

"కమాన్ డియర్, నిరీక్షించడంలో ఎంతో ఆనందం వుంది కదూ?"

జయ అసహ్యంగా చూసిందతన్ని. ఏమీ మాటాడ లేదు.

"ఇరవై ఏళ్ళ అమ్మాయి అరవై ఏళ్ళ ముసలాడి కోసం ఎదురు చూపులు చూడ్డం ఏమిటి? నాన్సెన్స్!" మళ్ళీ అన్నాడతను. "వెల్, ఈరోజు మన చివరి కలయిక. నువ్వు నాకు చాలా సహాయం చేస్తున్నావు బేబీ. అందుకో అందమైన బహుమతి ఇవ్వాలనుకుంటు న్నాను."

ఇద్దరూ నడుస్తున్నారు. అతని మాటలకామె ఏలాంటి రెస్పాన్స్ ఇవ్వడం లేదు. ఆలోచిస్తోంది...

అందమైన బహుమతి! పదేళ్ళ తన సర్కస్ జీవితంలో ఆమె ఎవరినుంచీ ఎలాంటి బహుమతీ అందుకోలేదు. ప్రాణాలకి తెగించి ఆమె చేసే ఫీట్లు ఎవరినీ ఆకట్టుకోడం లేదా? యాంత్రిక జీవనం! ఎంత కాలం సహించడం!

సర్కస్ జీవితం నుంచి దూరంగా పారిపోవాలని ఆమె చాలాకాలం క్రితం అనుకుంది. కానీ ఎక్కడికి వెళ్ళాలో, ఏం చేయాలో ఆలోచించుకోలేదు. చివరికి ఆ విషయం మర్చిపోయింది కూడా.

కానీ, వారం రోజుల క్రితం తిరిగి ఆమెలో ఆశ చిగు రించింది. కౌషిక్‌తో పరిచయం రకరకాల వూహాలు రేకత్తించింది. భవిష్యత్ గురించి ఎన్నో కలలు కంది. కానీ, రాను రాను కౌషిక్ మీద గౌరవం నశించి, అసహ్యం ఏర్పడసాగింది.

# 6

మొదటిసారి పరిచయమైనప్పుడు కౌశిక్ జయని పొగడ్తల్లో ముంచి ఆకాశాని కెత్తేశాడు. ఆమె ఫీట్లు అద్భుతం అన్నాడు. అలాంటి ఫీట్లు ఎక్కడా చూడలేదన్నాడు. ఆమె ఫీట్లకోసం పదిసార్లు సర్కస్ చూశానన్నాడు.

ఆ తర్వాత తనొక పత్రికకి రిపోర్టర్ అని చెప్పాడు. పారగన్ సర్కస్ మీద, ముఖ్యంగా జయమీద బ్రహ్మాండమైన వ్యాసం వ్రాయాలన్నాడు. సర్కస్ గురించి వివరాల కోసం మేనేజర్ని కలుసుకున్నానన్నాడు. ఆ మేనేజర్ కోపిష్టి అనీ, కసిరికొట్టాడనీ అన్నాడు.

ఒకరోజు మధ్యాహ్నంపూట టెంట్లో జొరబడి జయను కలుసుకున్నాడు. అదృష్టవశాత్తూ జయకు హిందీ వచ్చుకాబట్టి, అతనితో మాటలు కష్టం కాలేదు. అదే రోజు సాయంత్రం ఇదే గార్డెన్లో కలుసుకున్నాడు.

సర్కస్ గురించి వివరాలు అందజేస్తే, తన ఎడిటర్ జయకి అయిదువేలు చెల్లించడానికి సిద్ధంగా వున్నాడని చెప్పాడు.

జయకు నమ్మశక్యం కాలేదు. అయిదువేలు! అంత డబ్బు ఒకేసారి ఆమె ఎక్కడా చూడలేదు. అంతడబ్బు సంపాదించగలనని కూడా అనుకోలేదు. అదృష్టం చెప్పిరాదు. కాబట్టి జారవిడుచుకోకూడదు. ఈ అయిదువేలూ తన స్వంతమయ్యాయంటే యీ వెధవ జీవితానికి స్వస్తి చెప్పవచ్చు. కౌశిక్ సహాయంతో బొంబాయి వెళ్ళిపోయి ఏదేనా వుద్యోగం చూసుకోవచ్చు. అవును, తను బొంబాయి చూడాలని ఎన్నిసార్లు అనుకుంది!

రోజూ సాయంత్రం అయిదు గంటలకి ఏదో సాకు చెప్పి తప్పించుకు వస్తోందామె. ఎవరూ వెంటాడకుండా జాగ్రత్తపడుతోంది.

సర్కస్‌లో ఆమె కార్యక్రమం 7-30కి మొదలవుతుంది. అయిదు గంటలకు కౌశిక్‌ను కలుసుకుని, ఆరు గంటలవరకు గడిపి తిరిగి వెళ్ళిపోతోంది. ఇలా సాగుతోంది వారంరోజులనుంచీ. ఈ విషయం రహస్యంగా వుంచాలని కౌశిక్ చెప్పాడు. అతన్ని రహస్యంగా కలుసుకోడం ఆమెకెంతో థ్రిల్‌గా వుంది.

ఈ వారంలో అయిదు రోజులు వుత్సాహంగా గడిపిందామె అతనితో. అతనడిగిన ప్రశ్నలకు చకచకా సమాధానాలు చెప్పింది.

మొదటిరోజు సర్కస్‌లోని జంతువులమీద జరిగింది: ఎన్ని ఏనుగులున్నాయి? ఒంటెలెన్ని వున్నాయి? సింహాల్నీ, పులుల్నీ వేర్వేరుగా బంధిస్తారా? అవి రోజుకి ఎన్ని కిలోల మాంసం అరగిస్తాయి? గుర్రాలు ప్రదర్శించే ఐటమ్స్ ఏమిటి? రింగ్ మాస్టర్ పేరేమిటి?

ఆ తర్వాత రెండురోజులూ చర్చ సర్కస్‌లో చేసే ఫీట్లమీద సాగింది. ఆ తర్వాతి రెండురోజులూ సర్కస్ సిబ్బంది సాధకబాధకాల గురించి సాగింది.

కానీ, నిన్న వూహించని మలుపు తిరిగింది. ఈ వూహించని పరిణామమే ఆమె అతడ్ని అసహ్యించుకోడానికి కారణం.

నిన్నటి చర్చ సర్కస్ సెక్యూరిటీ ఏర్పాట్ల గురించి సాగింది. ఆమె సమాధానాలు చెప్పడానికి జంకింది. అతను పారితోషికం మరో వెయ్యి పెంచడంతో ఆమె అతడికి పూర్తిగా లొంగిపోయింది.

ఏ సర్కస్‌కీ లేని సెక్యూరిటీ ఏర్పాట్లు పారగన్ సర్కస్‌కి వున్నాయని చెప్పింది. ప్రొప్రయిటరు గోవిందన్ నాయరుకి డబ్బంటే చాలా ప్రీతి. అతను బ్యాంకుల్ని

ఆశ్రయించడు. అతని కేబిన్‌లో అధునాతన సేఫ్ ఏర్పరచి, తగిన రక్షణ ఏర్పాట్లు కల్పించాడు. ప్రతిరోజూ కలెక్షన్ డబ్బు అందులో చేరుతుంది...ఇలా యింకా ఎన్నో చెప్పకూడని విషయాలు అతని చెవిలో వేసింది జయ.

అంతటితో అతను వూరుకోలేదు. అప్పుడే అతని రంగు బయటపడింది...

"ఆ సేఫ్ తాళంచెవి నాక్కావాలి" అన్నాడతను.

"నో!" అరిచిందామె హిస్టరికల్‌గా.

"బేబీ, నేను తెరవబోయేది సేఫ్‌తలుపు—నీకోసం స్వర్గానికి తలుపుకాదు." మృదువుగా అన్నాడతను.ఆమె వూపిరి పీల్చడం మర్చిపోయింది.

"వెల్, సేఫ్ తలుపు తెరవడానికి సహకరించక పోతే, నీకోసం స్వర్గానికి తలుపులు తెరిచేస్తాను." మళ్ళీ అన్నాడతను. "ఆలోచించు బేబీ. నీలాంటి అందమైన కన్యలు అనవసరంగా చావటం నాకిష్టంలేదు."

జయ మంత్రముగ్ధలా కూచుండిపోయింది.

"ఆరురోజుల్లో ఆరువేలుగాక మరో అందమయిన బహుమతి సంపాదించబోతున్నావు." చిరునవ్వు ప్రదర్శిస్తూ చెప్పాడతను మళ్ళీ. "మేరానామ్ జోకర్‌లో 'జీనా యహాఁ మర్నాయహాఁ' అని రాజ్‌కపూర్ పాడతాడు. నువ్వు నాతో సహకరిస్తే ఈ విసుగు పుట్టించే సర్కస్ జీవితంనుంచి విముక్తి కలిగిస్తాను. లేదా, నువ్వు జీవితాంతం ఈ బ్రతుకే భరించవలసి వుంటుంది. నువ్వు ప్రదర్శించే ఫీట్సులో నే నీచావు దాగివుందని మర్చిపోక"

"పదేళ్ళు పోషించిన నా యజమానిని నేను మోసం చేయను?"

నవ్వాడతను. "మోసం చేయకుండా నువ్వు క్షణం కూడా బ్రతకలేవు. నీకు బయటి ప్రపంచం ఇంకా తెలియదు. ఆల్‌రైట్ బేబీ. నీకిప్పుడు రెండే మార్గాలు వున్నాయి. ఒకటి: సర్కస్ జీవితానికి స్వస్తి చెప్పడం. రెండు: ఈ ప్రపంచంనుంచి శాశ్వతంగా సెలవు తీసుకోవడం."

"అమాయకంగా నమ్మాను. నువ్వు మోసగాడివి! దుర్మార్గుడివి! సర్కస్ డబ్బు కాజేయటానికి పథకాలు వేస్తున్నావు!"

"ష్‌ష్! ... అరవక!" కర్కశంగా అన్నాడతను, ఆమె చేతిలో ఒక మైనపుముక్క పెట్టి, "ఆసేఫ్ తాళం చెవి ముద్ర ఈ మైనపు ముక్కమీద తీసుకో. రేపిదే సమయానికి నన్నిక్కడ కలుసుకో. నేను నీకు డబ్బిస్తాను, నువ్వు నాకాముద్ర ఇచ్చేయ్. ఎలాటి పొరపాటూ చేయకు. పోలీసుల్ని పిలుచుకురాకు. అలాచేస్తే ఏం జరుగుతుందో తెలుసా? నేను జెయిల్లో విశ్రాంతి తీసుకుంటాను. అది నా కలవాటే. కానీ నువ్వు—" మాటలాపేసి ఫకాలున నవ్వాడతను. "కలలురాని గాఢ నిద్రలో శాశ్వత విశ్రాంతి పుచ్చుకుంటావు. రిమెంబరిట్, నో మిస్టేక్."

ఆ తర్వాత అతను వెనక్కి తిరిగి జనంలో కలిసిపోయాడు.

ఆ జనంలో జయకి గట్టిగా ఏడ్చేయాలనిపించింది. ఆ రోజు సర్కస్‌లో ప్రోగ్రాం కాన్సిల్ చేసుకుంది. టెంట్‌లో రాత్రంతా ఏడ్చింది. జ్వరంతో బాధపడింది.

ప్రొప్రయిటర్ గోవిందన్‌నాయరు ఆమెకి ట్రీట్‌మెంటు ఇప్పించాడు.

ఉదయానికల్లా జ్వరం తగ్గింది. ఆమె జ్వరంతో కంటే మనోవ్యథతో ఎక్కువ బాధపడింది. కౌషిక్ మాటలు చెవుల్లో మార్మోగుతున్నాయి. ఆ కళ్ళు, ఆ కంఠస్వరం గుర్తుకువచ్చాయి. చావుభయం పూర్తిగా ఆవహించుకుంది.

జరిగిందంతా నాయరుతో చెప్పేయాలనుకుంది. మళ్ళీ కౌషిక్ జ్ఞాపకమొచ్చాడు. ఆమె చావుకి భయపడుతోంది, మోసం చేయడానికీ భయపడుతోంది.

ఆరు వేలు!

నిట్టూర్చిందామె. ఎన్ని కలలు కన్నాను! కౌషిక్‌ని ఎంతగా నమ్మాను? కలలుకన్న డబ్బు అతని చేతిలో వుంది. ఆలోచిస్తేనే ఒళ్ళు జలదరించే చావూ అతనిచేతిలోనే వుంది. తనకేం కావాలి? డబ్బా, చావా?

మధ్యాహ్నం మూడుగంటలవుతోండగా డబ్బుకావాలని నిశ్చయించుకుంది. డబ్బును మించింది ప్రపంచంలో ఏదీ లేదు!

"వెల్, బేబీ. నువ్వుచాలా అలసిపోయావనుకుంటాను" అన్నాడు కౌషిక్, తన మాటలకి రెస్పాన్స్ ఇవ్వకుండా మౌనంగా నడుస్తున్న జయతో, "నీలాంటి అందమయిన అమ్మాయిలకి చావుభయం ఎలావుంటుందో నాలాంటి అనుభవజ్ఞుడికి తెలుసు. ఆల్ రైట్, నీ బ్యాగులో తాళంచెవి ముద్రవుంది, నా జేబులో డబ్బుంది. మనపని త్వరగా కానిచ్చేద్దాం—"

"నువ్వంటే నా కసహ్యాం!" కసిరిందామె.

అతను చిన్నగా నవ్వాడు. పాముకళ్ళు మెరిసాయి. "ప్రతి మనిషికీ ఎదుటి వ్యక్తిమీద ఎప్పుడోకప్పుడు అసహ్యాం తప్పక ఏర్పడుతుంది. ఎందుకంటే అతను జంతువు కాదు కాబట్టి."

జయ అతడ్ని చురచుర చూసింది, "నువ్వు ఫిలాసఫీ చెప్పడం ఏమిటి? దుర్మార్గుడివి!" బ్యాగులోంచి మైనం ముక్క తీసి అతని ఛాతీమీద విసిరికొట్టింది. "డబ్బిలా ఇవ్వు. మళ్ళీ నా ఛాయలకి రాక! నీ సహాయం నాకవసరంలేదు. వెళ్ళి డబ్బుదోచుకో!"

ఆమె కళ్ళలో నీళ్ళుచూసి జాలిగానవ్వి, అంతలోనే కర్కశంగా అన్నాడు కౌషిక్, "నీలాంటి అందగత్తెలతో ప్రపంచానికి చాలా ఉపయోగంవుంది. ఇప్పటికయినా సర్కస్ జీవితానికి స్వస్తి చెప్తున్నందుకు సంతోషం. నన్ను జీవితాంతం జ్ఞాపకముంచుకుంటావు బేబీ!"

ఆ తర్వాత జేబులోంచి ఒక కవరుతీసి అందించాడు. భుజానికి వేలాడుతోన్న బ్యాగులోంచి ఎర్రటి కాయితంలో రిబ్బన్ చుట్టివున్న ఒకప్యాకెట్ తీసి అందిస్తూ, "ఇది నా కానుక. విలువ కట్టలేనిది" అన్నాడు. "నీ సహాయం నేనెన్నటికీ మరువలేను. అలాగే నన్నూ నువ్వు మరువలేవు. నువ్వు కొత్తజీవితాన్ని చూడబోతున్నావు. విష్యూగుడ్ లక్! గుడ్ బై బేబీ!"

## 2

జగన్నాథ్ టీపాయ్ పైన కాళ్ళుజాపి, సిగరెట్ పొగ వదిలి, "ఎవరీ నందకిషోర్ కౌషిక్?" అని అడిగాడు.

అతని పక్కన కూర్చున్న రాంచందర్ భావగర్భితంగా నవ్వి జగన్నాథ్ ని చూశాడు.

జగన్నాథ్ కు ముప్పైతొమ్మిదేళ్ళు. నల్లటి బలిష్టమైన శరీరం. ఎప్పుడూ నల్లటి కళ్ళద్దాలు, బూట్స్ ధరిస్తాడు. విజయవాడలో అతను తాళాలు పగలగొట్టటంలో ఎక్స్ పర్ట్ గా పేరు పొందాడు. పలుసార్లు పోలీసుల ఆతిథ్యం పొందాడు.

అతనింతవరకు ఇళ్ళల్లో తాళాలు బద్దలు చేశాడుగానీ, బ్యాంక్స్‌లో తన ప్రావీణ్యత ప్రదర్శించలేకపోయాడు. అదే అతనికి చిన్నతనంగా వుంది. తన అనుచరులతో బ్యాంకులు దోచుకోడానికి ఎన్నో పథకాలు వేశాడుగానీ అవేమీ పారలేదు.

"తినబోతూ రుచి అడగడం దేనికి?" అన్నాడు రాంచందర్, జగన్నాథ్ ప్రశ్నకు జవాబుగా.

రాంచందర్‌ని అతని మిత్రులు చందర్ అని పిలుస్తారు. చందర్‌కు నలభై రెండేళ్ళు. తెల్లటి రంగు. ముఖం చూస్తే అమాయకుడిలా కన్పిస్తాడు. చిన్నప్పటినుంచీ అతనికి డబ్బంటే చాలా ఇష్టం. కాబట్టి రైల్వేస్టేషన్‌లో బస్‌స్టాండ్స్‌లో ప్రయాణీకుల జేబులు సవరించడం అతని సరదా. కొందరు పోలీసులు కూడా అతనిచేత తమ జేబులు సవరించుకున్నారు. కానీ ఆ విషయం వాళ్ళకు తెలియదు. వైజాగ్ పోలీసులకు రాంచందర్ ఒక సమస్య అయి కూచున్నాడు.

"రుచి అడక్కుండా నేను ఏదీ తినను" అన్నాడు జగన్నాథ్.

"నేరాలు చేసేవాడు ముందు జాగ్రత్తలు తీసుకోకుండా రంగంలోకి దిగడు. ఏమంటావు రాబర్ట్?"

చందర్‌కీ, జగన్నాథ్‌కీ ఎదురుగా కూచున్న రాబర్టు మాట్లాడలేదు.

కాకినాడలో అతను ఆంగ్రీమాన్‌గా ప్రసిద్ధిపొందాడు. అతని వయసు ముప్పైఅయిదు సంవత్సరాలు. పదేళ్ళక్రితం అతను హైదరాబాద్‌లో మెడికల్ షాపు నడుపుతుండేవాడు. ప్రత్యేక తెలంగాణా ఉద్యమంలో అతని షాపు దోచుకుని, భార్యాపిల్లల్ని హత్యచేసి తరిమేశారు. అతను

తిరిగి తన స్వస్థలం కాకినాడకి వచ్చి ప్రాణాలు దక్కించుకున్నాడు. అప్పుడే అతనిలో సమాజం మీద పగ, ద్వేషం రగిలాయి.

చందర్‌తో రాబర్టుకు మూడేళ్ళ పరిచయముంది. అలాగే జగన్నాథ్‌కీ చందర్‌తో పరిచయముంది.

మూడు రోజుల క్రితం హైదరాబాదులో వున్న చందర్ నుంచి విజయవాడలో వున్న జగన్నాథ్‌కీ, కాకినాడలో వున్న రాబర్టుకీ ఉత్తరాలు అందాయి. ఆ ఉత్తరాల్లోని సారాంశం: 'తక్కువ శ్రమతో, తక్కువ కాలంలో, ఎక్కువ డబ్బు సంపాదించే మార్గం ఒకటి వుంది. తక్షణం బయలుదేరివస్తే వివరాలు తెలుస్తాయి.'

వెంటనే హైదరాబాద్‌కి ప్రయాణమై వచ్చేశారిద్దరూ. ఈరోజే చందర్ వాళ్ళిద్దర్నీ రిసీవ్ చేసుకున్నాడు.

"ఆర్‌రైట్, కాషిక్ ఎవరో వివరిస్తాను" అన్నాడు చందర్ ఒక నిర్ణయానికి వచ్చి.

"ఇతను ఒరిజినల్ హైడ్రోజన్ బాంబులాంటివాడు. ఇతనితో చెలగాటం ప్రాణాలకు అపాయకరం. 59 ఏళ్ళు వచ్చినా అతని ఆరోగ్యం చెక్కు చెదరలేదు. కానీ అరవైలో పడ్డాక హార్టు ట్రబుల్ ప్రారంభమైంది.

డియర్ ఫ్రెండ్స్, ఈ కాషిక్ అసలు పేరు వినాయకరావు. మూడేళ్ళ క్రితం వైజాగ్ నుంచి బొంబాయికి తరలి వెళ్ళినప్పుడు కాషిక్ అని పేరు మార్చుకున్నాడు.

వైజాగ్‌లో వున్నప్పుడతనికి ఒక ముఠా వుండేది. అందులో నేనొకడిని. అతని ముఠా చేసే నేరాలు విపరీతంగా పెరిగిపోయి పోలీసులకు అసలు విశ్రాంతి దొరికేది కాదు. అప్పుడే వినాయక్ లేతగుండె కరిగింది. పోలీసుల పైన జాలి ఏర్పడింది.

తనలాటి ఘరానా నేరస్థుడు విశాఖలాటి చిన్న సెంటరులో వుండటం చిన్నతనంగా తోచింది. ఆత్మ విమర్శ చేసుకుని తన అదృష్టాన్ని బొంబాయిలో పరీక్షించుకుందామని వెళ్ళిపోయాడు విశాఖ విడిచి. అప్పుడే మేం పీధినపడ్డాం.

బొంబాయిలో అతనికి అదృష్టం బాగా కలిసివచ్చింది. అతనికి తోడు ఒక కిరాయి హంతకుడు కలిశాడు. పేరు బాషా.

ఇద్దరూ కలిసి ఎన్నో పథకాలు వేశారు. అన్నీ విజయవంతం చేశారు. ఈ మూడేళ్ళలో కనీసం మూడు వేలమంది ఆడవాళ్ళను పట్టుకుని నగలు కాజేశారు. అందులో ఎదురు తిరిగిన ఏడుగురిని నిర్దాక్షిణ్యంగా కాల్చేశాడు బాషా.

కానీ నెల రోజుల క్రితం వినాయక్ జాతకం తిరగబడింది.

బాగా డబ్బు వున్న సినీనటుడు కామేష్‌ని కిడ్నాప్ చేయాలని పథకం వేశాడు. పథకం ప్రకారం ఇద్దరూ కలసి కిడ్నాప్ చేసి భాండాలాలో ఒక పాడుబడ్డ ఇంట్లో బంధించి బెదిరించారు. కథ అడ్డం తిరిగింది. తీర్చలేని అప్పుల్లో కామేష్ మునిగివున్నాడని వీళ్ళకు తెలీదు! ఆ కసికొద్దీ కామేష్‌ని కాల్చేసి ఇక్కడికి పారిపోయి వచ్చేశారు. స్థూలంగా ఇదీ కథ.''

చందర్ చెప్పడం ఆపి, ఇద్దరి ముఖాల్నీ చూశాడు. ఇద్దరూ భయపడుతున్నట్టు అతనికి తోచింది.

''కాబట్టి, డియర్ ఫ్రెండ్స్'' మళ్ళీ ప్రారంభించాడు చందర్ ''మీ ట్రిక్స్ వాళ్ళ దగ్గర ప్రయోగించడం మంచిది కాదు' ఏదో ఆత్మాశపడిపోయి మీరు మీ ట్రిక్స్

ప్రయోగిస్తే దాని పర్యవసానం బాషా ట్రిగ్గర్ లాగడమే నని మరువకండి. వినాయక్ కి సమిష్టి కృషిలో విశ్వాస ముంది. అందుకే మనమంతా ఇక్కడ వున్నాం."

జగన్నాథ్ నిట్టూర్చాడు, "సరే, యేం చెయ్య డానికి?" అనడిగాడు.

"అది వినాయక్ వివరిస్తాడు" చెప్పాడు చందర్. "కొన్ని నిముషాల్లో అతనిక్కడ వుంటాడు."

జగన్నాథ్, రాబర్టులు గాభరాగా చూశారు చందర్ ని.

"వినాయక్ నుంచివారంక్రితం నాకో ఉత్తరంవచ్చింది. తను హైద్రాబాదుకి వచ్చివున్నట్టూ నన్ను కలుసుకో మనీను. కాబట్టి నేనిక్కడికివచ్చి అతన్ని కలుసుకు న్నాను. ఒక ప్లాను వివరించి అందుకు మనుషులు కావా లన్నాడతను. నేను మీ పేర్లు సూచించాను. అందుకే మీరిక్కడ వున్నారు—"

ధడాలున తలుపు తెరుచుకుంది. ముగ్గురూ భయపడి గతుక్కుమన్నారు.

"ఇప్పుడు నేనూ ఇక్కడ వున్నాను" అన్నాడు వినాయకరావు నవ్వుతూ.

జగన్నాథ్, రాబర్టు ఛటుక్కునలేచి నిలబడ్డారు. వినాయక్ వెనుక బాషానిచూసి భయంతో అరిచేందుకు నోళ్ళు తెరిచారు.

"వెల్ బాయ్స్" వినాయక్ మృదువుగా అన్నాడు లోనికి వస్తూ, "మనలో మనకి భయంలేదు! మనము మిత్రులం. మనలో యెవరయినా యెదురు తిరిగినప్పుడే శత్రువు అవుతాడు. ఒప్పుకుంటారా?"

జగన్నాథ్, రాబర్టులు తలూపారు.

"వెరీగుడ్," వినాయక్ అన్నాడు "బి సీటెడ్.

డోంట్ ఫియర్, చందర్! బీరువా తెరిచి బీరుబాటిల్సు తీసుకరా.

"డియర్ ఫ్రెండ్స్, మీరు విస్కీ రుచి మరిగివుంటారని నాకు తెలుసు. సంవత్సరం క్రితం నేనూ తాగేవాడిని. కానీ డాక్టర్ సలహా ప్రకారం మానేసి బీరు ప్రారంభించాను. అఫ్‌కోర్స్, నాకు హార్ట్ ట్రబుల్ వుందని మీకు చందర్ చెప్పేవుంటాడు. ఏమిటి చందర్?"

చందర్ తలవూపి, బీరువాకేసి సాగిపోయాడు.

వినాయక్ నవ్వి, బాషాని అతిథులకి పరిచయం చేశాడు. "మిస్టర్ బాషా. ఇతను నా అసిస్టెంట్. నేను నిజాన్ని నిజాయితీగా ఒప్పుకుంటాను. రివాల్వర్ ఉపయోగించటం నాకు నేర్పింది ఇతనే."

బాషా గర్వంగా నవ్వి వూరుకున్నాడు. జగన్నాథ్, రాబర్టులు అతన్ని బెదురుతూ చూశారు.

బాషాకి 49 ఏళ్ళు. దాహమేసినప్పుడల్లా మద్యం సేవించడం అతనికి అలవాటు. ఎర్రబడ్డ కళ్ళతో, క్షణ క్షణానికి మారిపోయే ముఖకవళికలతో ఎప్పుడూ కర్కశంగా వుండటానికి ప్రయత్నిస్తుంటాడు.

బొంబాయి పోలీసులకి అతను పాతచుట్టం. కానీ వినాయక్‌తో సాంగత్యం ఏర్పడినప్పటినించీ అతను పోలీసు వలలో చిక్కలేదు. అందుక్కారణం, వినాయక్ తయారుచేసే పథకాలు పటిష్టంగా వుండటమే.

చందర్ బాటిల్, గ్లాసులు తెచ్చి టేబిలుపై పెట్టాడు. ఆ తర్వాత గ్లాసులన్నీ నింపి అందరికీ అందించాడు. కానీ రాబర్టు అందుకోలేదు. వినాయక్ బిత్తరపోయి, "అదేమిటి?" అన్నాడు.

రాబర్టు అడ్డంగా తలూపాడు.

వినాయక్ గుండెలమీద చేతులు వేసుకుని, "యీ

రోజుల్లో మద్యం రుచి మరగని నేరస్తులున్నారా!'' అన్నాడు. ''ఆల్ రైట్. రాబర్టు, నీ గురించి చందర్ చెప్పాడు. యాంగ్రీమాన్ ఆఫ్ కాకినాడవట! వెల్, నిన్ను అర్థంచేసుకోగలను. జీవితంలో చితికిపోయిన వారంటే నాకు జాలి. ఇక మనం గడిచిన బాధాకరమైన రోజుల్ని మరిచిపోవచ్చు. డబ్బు అన్నిటినీ మరిపిస్తుంది. ఆ డబ్బు మీకందబోతోంది.''

''ఎలా?'' ధైర్యం చేసుకుని అడిగాడు జగన్నాథ్.

''వెల్, మీతో విషయం చెప్పాలి. పథకాలు పారాలంటే ముఖ్యంగా తెలివికంటే సహనం కావాలి.'' అన్నాడు వినాయక్. ''నేనొక పోలీస్ ఫ్రీ-ప్లాను తయారుచేశాను. కానీ మీలో సహనంలేకపోతే ఆ ఆ ప్లాను ఆచరణలో పెట్టటం మంచిదికాదు. మీలో సహనంతోబాటు గుండెనిబ్బరం కూడా వుంటే చెప్పండి, సుమారు పదిలక్షల్ని అనుభవించే మార్గం చెప్తాను.''

జగన్నాథ్, రాబర్టు ఉలిక్కిపడ్డారు. ''పదిలక్షలు!'' అరిచారిద్దరూ.

వాళ్ళ ఆశ్చర్యాన్ని లెక్కచేయక వినాయక్ మళ్ళీ అన్నాడు:

''పథకాన్ని ఆచరణలో పెట్టేవరకేగాదు, ఆ తర్వాత ఫలితం అనుభవిస్తున్నప్పుడుకూడా సహనం వహించాలి. ఈ రెండు నియమాలను పాటిస్తామని మీరు ప్రమాణం చేస్తే నేను ప్లాను వివరిస్తాను.''

రాబర్టు కళ్ళు మెరిసాయి. జగన్నాథ్ పూర్తిగా చెమటలో తడిసిపోయాడు.

వాళ్ళిద్దరూ చాలా అప్ సెట్ అయ్యారని గ్రహించి, వినాయక్ విషయాన్ని మార్చేస్తూ, ''బొంబాయి అను

భవాలమీద నేనో పుస్తకం వ్రాయాలనుకుంటున్నాను'' అన్నాడు.

"కానీ ఇప్పుడు కాదు. నా ఈ చివరి పథకాన్ని అమలు పరచి, ఈ క్రిమినల్ లైఫ్‌కి స్వస్తిచెప్పి, ప్రశాంత జీవితము గడుపుతూ రచనలు ప్రారంభిస్తాను.

"గత జీవితంలో నేరస్తుడిగా నా అనుభవాలను కళ్ళకి కట్టినట్టు వ్రాస్తాను. దేశంలో నేరస్తుల్ని తయారుచేయడానికి పాటుబడతాను. నేరస్తుల సాధక బాధకాలను తెలుసుకుని ప్రపంచానికి తెలియజేస్తాను. నేరాలు చేయదల్చుకున్నవారికి సలహాలిస్తాను. పథకాలు తయారుచేసి ఇస్తాను.

"మీకు తెలిసేవుంటుంది. నా వయసు ఇప్పుడు అరవై. హార్టు ట్రబుల్ ఇస్తోంది. గుప్పెడంత గుండె నా బలిష్ఠమయిన శరీరాన్ని ఏక్షణాన్నయినా నేలకూల్చేయవచ్చు. అందుకే నేను దేహానికి శ్రమకల్గించే పనులు మానుకోదల్చాను. వృద్ధాప్యంలో ప్రశాంత జీవితం గడపటమే నా ధ్యేయం."

"వృద్ధాప్యంలో వినాయక్‌ని పోషించే బాధ్యత నేను తీసుకున్నాను," అన్నాడు బాషా.

వినాయక్, బాషా భుజంపైన తడుతూ, "ఈ యిడియట్‌కి నేనంటే చాలా ప్రేమ" అన్నాడు.

చందర్, జగన్నాథ్, రాబర్టులు తేలిగ్గా వూపిరిపీల్చసాగారు. వినాయక్ అందర్నీ ఓసారిచూసి, చిన్నగా నవ్వుకున్నాడు. బదులుగా అందరూ బలవంతపు నవ్వు విసిరారు. వినాయక్ ఛటుక్కున నవ్వాపేసి. "ఇక ప్రారంభించనా?" అనడిగాడు.

అందరి తలలూ వూగాయి.

వినాయక్ అన్నాడు, "మీరెప్పుడేనా సర్కస్ చూశారా?"

"చూశాం!" అన్నారంతా.

"నిజం చెప్పండి, పారగన్ సర్కస్ చూశారా?"

"లేదు!" అన్నారందరూ తిరిగి.

"నాకు తెలుసు" అన్నాడు వినాయక్ సిగరెట్ వెలిగించి, "పారగన్ సర్కస్ చిన్న సెంటర్సులో ప్రదర్శింపబడదు. బొంబాయి, కలకత్తా, బెంగుళూరు, హైద్రాబాదు, మద్రాస్ వంటి పెద్ద నగరాల్లోనే ప్రదర్శిస్తారు.

ఆసియాలోకెల్లా పెద్ద సర్కస్ అని ప్రకటించుకున్నారు. ఇదెంతవరకు నిజమోనని నేను వెళ్ళి చూశాను. ఆ ప్రకటన సబబేనన్పించింది.

గోషామహాల్ గ్రౌండ్స్‌లో నెల రోజుల్నుంచీ ప్రదర్శింపబడుతోంది. నేనీ సిటీకి వచ్చిన కొత్తలో నన్ను ఆకర్షించింది ఈ సర్కస్ ప్రకటనే. పత్రికలలో బ్రహ్మాండమైన పబ్లిసిటీతోబాటు కలెక్షన్ వివరాలు కూడా ప్రకటించారు. ఆ కలెక్షన్స్ చూసి నా రక్తం వేడెక్కింది.

నాకు తెలియకుండానే నా మెదడులో యేదో ఆలోచన రూపు దిద్దుకుంటోంది. వరుసగా కలెక్షన్స్ గమనిస్తూ వచ్చాను. ఏరోజూ నలభై వేలకు తక్కువ లేదు. వారం రోజుల కలెక్షన్సు కూడితే మూడు లక్షలు! నెల రోజులకు పన్నెండు లక్షలు!"

గదిలో ఉద్రిక్తత అలుముకుంది.

జగన్నాథ్ కాయితం అందుకుని పన్నెండు అంకె వేసి దానిపక్కన ఎన్ని సున్నాలు చేర్చాలో ఆలోచిస్తు

న్నాడు. చందర్ ఎవరికెంత భాగం వస్తుందో ఆలోచిస్తు న్నాడు. రాబర్టు ఆ డబ్బంతా తన స్వంతమైతే ఎంత బావుంటుందని అనుకుంటున్నాడు.

"కలలు కంటున్నారా?" అన్నాడు వినాయక్ నవ్వుతూ, "అది చాలా చెడ్డ అలవాటు. స్వప్నజగత్తులో విహరించేది రచయితలు. అది వాళ్ళకు వుపయోగకరం. మనకు నిరుపయోగం. మనలాటి దోపిడీగాళ్ళకు కావల సింది సమర్థవంతమైన ఆలోచనా శక్తి. ఈ పథకంలో మనకు పది లక్షలకు తక్కువకాకుండా ముడతాయి. అయితే అందులో సగభాగం మాత్రం నాది."

చందర్ ముఖం పాలిపోయింది. "ఎందుకు?"

"ఈ పథకం మీద నేను చాలా ఖర్చుపెట్టాను. ఈ బంగళా, ఒక సెకండ్ హాండ్ జీపు కొన్నాను. అంతే కాదు, ఐడియా నాది, ప్లాను నాది, ఖర్చులన్నీ నావి. కాబట్టి నాది మేజర్ షేరు సగభాగం నాది."

అందరూ అంగీకారంగా తలలూపారు.

"మంచిది, ఇక చెప్పండి. మీకు ధైర్యం, నిగ్రహం వున్నాయా?" వినాయక్ అడిగాడు.

"నాకు ధైర్యం లేకపోతే పట్టపగలు బ్యాంకుల్ని సందర్శించేవాడిని కాను, నిగ్రహం కావలసినంత వుంది" అన్నాడు జగన్నాథ్.

వినాయక్ చందర్ వైపు తిరిగాడు.

"పోలీసుల జేబులు నవరిస్తున్నానంటే యిక నా ధైర్యాన్ని అంచనా వేయవచ్చు. మా నాన్న ఆస్తితో బాటు నాకు నిగ్రహంకూడా సంక్రమించింది" అన్నాడు చందర్.

ఆ తర్వాత వినాయక్ రాబర్టువేపు తిరిగాడు.

"చెక్కులు ఫోర్జరీచేసి బాగానే సంపాదించాను. నిగ్రహం లేదు, ఇకనించి అలవర్చుకుంటాను" అన్నాడు రాబర్టు.

వినాయక్ బాధగా మూల్గాడు.

బాషా ఛటుక్కున అతనివేపు తిరిగాడు. వినాయక్ వూపిరి బిగబట్టి ఛాతీపట్టుకుని కళ్ళుతేలేసాడు.

"వినాయక్!" బాషా అర్చాడు భయంగా.

"బాషా, నా గుండెలో సు త్తిపోట్లు... ఎవరో... నన్ను...అబ్బా!...బాషా, నన్ను కాల్చేయ్!" వినాయక్ కుర్చీలోనుండి క్రింద నేలమీదపడి దొర్లుతూ అరుస్తున్నాడు.

బాషా తటాలున వినాయక్ పక్కన దూకి గుండె నిమరసాగాడు.

వినాయక్ మెలికలు తిరుగుతూ బాధగా మూల్గుతూ, మధ్య మధ్యలో పిచ్చిగా అరుస్తోన్నాడు. బాషా చటుక్కున లేచి గ్లాసుతో మంచినీళ్ళందుకున్నాడు.

"వినాయక్, లేచి కూచో!"

జగన్నాథ్, చందర్, రాబర్టులు గాభరాగా చూడసాగారు.

వినాయక్ వగరుస్తూ యేదో అనబోగా బాషా నోరు మూసి, "రిలాక్స్, వినాయక్ రిలాక్స్!" అన్నాడు అతని ఛాతీ నిమురుతూ.

రెండు నిముషాల తర్వాత తిరిగి శ్వాస పీల్చసాగాడు వినాయక్.

అతని అనుచరులు ముగ్గురూ నిలబడి భయంగా అతడినే చూస్తున్నారు.

# 4

బాషా ఆ ముగ్గురివేపు తిరిగి, "రెండు నెలల క్రితం మొదటి స్ట్రోక్ వచ్చింది. ఇది రెండవది...ఆపరేషన్ చేయించుకోమన్నాను, వినలేదు. సిగరెట్లు మానుకోమన్నాను, మానుకోలేదు. కార్బిసాన్ పిల్స్ వాడుతున్నాడు. నాకేమీ అర్థం గావడంలేదు. నేను వూరుకోను. వీలయినంత త్వరలో అతని తెలివి పోగొట్టి ఆపరేషన్ చేయించకపోతే..." అని అంటుండగా వినాయక్ అడ్డు తగిలి, "నో పర్సనల్ మాటర్స్!" అన్నాడు.

"ఫ్రెండ్స్! ఇప్పుడు నాకేమీ కాదు! నా ప్లాను ఆపరేట్ చేశాక గుండె ఆపరేషన్ చేయించుకుంటాను. ఇక బిజినెస్ మాట్లాడుకుందాం."

ఆ ముగ్గురూ తేలికపడి తిరిగి కూచున్నారు. వినాయక్ అందర్నీ ఒకసారి చూసి భుజాలెగరేశాడు.

"సరే, ముందు ప్లాను వివరిస్తాను," వినాయక్ ప్రారంభించాడు. "పారగన్ సర్కస్‌కి అధునాతన సెక్యూరిటీ ఏర్పాట్లున్నాయి. అసలు ఏ సర్కస్‌కీ సెక్యూరిటీ ఏర్పాట్లుండవు. మరి ఈ సర్కస్‌కు వుండటంలో అర్థమేమిటి?"

"నువ్వర్థాలు అడిగి కాలం వ్యర్థం చేయకు. చెప్పేదేదో సూటిగా చెప్పు" అన్నాడు చందర్.

'తెలివిగల బాస్టర్డ్' వినాయక్ అనుకున్నాడు. ఆ తర్వాత అన్నాడు, "ప్రొప్రయిటర్ నాయర్‌కి బ్యాంకుల మీద నమ్మకం లేదు. అతను మూఢవిశ్వాసాల మనిషి. అతనికో కూతురు నళిని వుంది. ఆమె వయసు ఇరవై. తల్లి చనిపోయింది.

నళినికి అందం వుంది, కానీ తెలివి తేటలూ, చదువూ లేవు. ఆమె కుడికాలుకి పోలియో వుంది. ఫ్రెండ్స్,

ఆమె చదువుకోలేదు. స్కూల్లో ఆమె కాలు చూసి అందరూ హేళన చేస్తోంటే ఆమెకు స్కూల్స్ అంటే అసహ్యమేర్పడింది. ఆమెకు మలయాళం తప్ప మరేభాషా రాదు.

ఆమె తండ్రికి ఇంగ్లీషు, మళయాళం, హిందీ వచ్చు. అతనికి డబ్బంటే చాలా ప్రీతి. వయసు యాభై. ఇరవై ఏళ్ళ క్రితం సర్కస్ స్థాపించాడు. ఈ ఇరవైయేళ్ళుగా సర్కస్ కలెక్షన్ డబ్బు అతని కేబిన్‌లోని సేఫ్‌లోకే చేరుతోంది. సంవత్సరానికొకసారి సేఫ్స్ మార్చేస్తుంటారు. ఇంతవరకు ఆ సేఫ్స్‌లో ఎవరూ చీపురు కొట్టలేదు. కానీ, మనం— డియర్ ఫ్రెండ్స్, మనం కొట్టబోతున్నాం."

"ఎలా?" చందర్ అడిగాడు.

వినాయక్ నవ్వి, "నువ్వు మధ్యలో అడ్డు తగలకు!" అన్నాడు. "ముందు సెక్యూరిటీ ఏర్పాట్ల గురించి చెప్తాను."

జేబులోంచి ఒక మడత పెట్టిన కాయితం తీసి విప్పి టేబిల్ పైన పరిచాడు. "అందరూ ఒకసారి ఈ సర్కస్ ప్లాను మ్యాపు చూడండి."

అందరూ తలకాయలు ముందుకు చాచి చూశారు. "చాలా బావుంది!" అన్నారు.

"సర్కస్ సరిగ్గా ఒంటిగంటకు వదిలిపెడతారు" తిరిగి చెప్పడం ప్రారంభించాడు వినాయక్. "రెండు గంటలకల్లా ఆ ప్రాంతమంతా నిర్మానుష్యమవుతుంది. కాబట్టి సరిగ్గా మనం రెండు గంటలకు రంగంలోకి దూకాలి. నా జీపులో ఇక్కడనుంచి బయలుదేరతాం. ఇప్పుడు మనం ఖైరతాబాదులో వున్నాం. ఇక్కడనుంచి

గోషామహల్ గ్రౌండ్స్ చేరడానికి ఇరవై నిముషాలు పట్టవచ్చు.

గేటు ముందు ఇద్దరు గార్డ్సు వుంటారు. వాళ్ళ దగ్గర పిస్టల్స్, రైఫిల్స్, టియర్ గ్యాస్ వుంటాయి సర్కస్ లోపలి ఆవరణలో పదిమంది గార్డ్స్ తిరుగుతుంటారు. కేబిన్ ముందు ఇద్దరు గార్డ్సు వుంటారు. వాళ్ళంతా ఖాకీ డ్రెస్ ధరించి వుంటారు.

సర్కస్ ఆవరణలో మనం బ్లాకవుట్ చేస్తే గార్డ్సు మన బుట్టలో పడతారు. అదెలాగో చెప్తాను. రేపురాత్రి సరిగ్గా 2-20కి మనం గోషామహల్ చేరుకుంటాం. శ్రద్ధగా చూడండి—ఈ మ్యాపులో సర్కస్‌కి కరెంటు సప్లయిచేసే పోల్ ఇక్కడ వుంది. ఇక్కడ నుంచి కనెక్షన్ ఇవ్వబడింది. మనం డిస్కనెక్ట్ చేయాలి. సర్కస్ గ్రౌండ్ అంతా చీకటైపోతుంది."

"ఆ తర్వాత?" చందర్ అడిగాడు.

"మనం జీపులో సర్కస్ గేటు దగ్గర దిగుతాం. మనం ధరించిన దుస్తుల మీద ఎ. పి. యస్. ఇ. బి. బ్యాడ్జిలుంటాయి. అఫ్‌కోర్స్, ఆ అక్షరాలు జీప్ మీద కూడా వుంటాయి."

జీపు దిగాక నేను గార్డ్సుదగ్గరకి వెళతాను. మన చేతుల్లో టూల్ బాక్స్‌లుంటాయి. వాటిమీదకూడా A.P.S.E.B. అని పెయింట్ చేసివుంటుంది. మనం ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటునించి ప్రొప్రయిటర్ ఫోన్ అందుకుని వచ్చినట్టు గార్డ్సుతో చెప్తాను.

ఇంతవరకూ సర్కస్‌లో రాబరీ జరగలేదు కాబట్టి వాళ్ళు మనం దోచుకోడానికి వచ్చినట్టు ఊహించడం కష్టం. అంతేగాదు, పెద్దపెద్ద నగరాల్లో జరగని దోపిడీ

ఈ నగరంలో జరుగుతుందా అన్న నిర్లక్ష్యంకూడా వాళ్ళకి వుంటుంది.

సులువుగా మనల్ని లోనికి అనుమతిస్తారు. మనం చకచక కేబిన్ చేరుకుంటాం. అక్కడ ఇద్దరు గార్డ్సు వుంటారుగానీ, అనుమానించరు. సప్లయి బ్రేక్ డౌన్ అయిందని, ఫ్యూజు లెక్కడ కాలిపోయాయో చూడాలని వాళ్ళతో మనం చెప్తాం.

పవర్రూం కేబిన్ వెనకవుంది. దానికీ కేబిన్‌కీ మధ్య తలుపువుంది. గార్డ్సు మనల్ని పవర్రూంకి దారి చూపిస్తారు. అక్కడే వాళ్ళని స్మెల్లింగ్ సాల్టుచూపించి స్పృహపోగొట్టాలి.''

''పవర్రూంలో ఏం చేస్తాం?'' జగన్నాథ్ అడిగాడు.

''పవర్రూంలోంచి కేబిన్‌లోకి ప్రవేశిస్తాం. నేను తలుపు తడతాను. కేబిన్‌లో నిద్రపోతున్న నాయరుకు ఆశ్చర్యం కలగవచ్చు. పవర్రూం తలుపు నెవరు తడతారు? నేనతని అనుమానం తీరుస్తూ ''సర్, నేను సింగ్‌ని. మెయిన్స్ కాలిపోయాయి. ఏం చేయ మంటారు?' అంటాను.''

''సింగ్ ఎవరు?'' చందర్ అడిగాడు.

''సర్కస్ ఎలక్ట్రిషియన్.''

''అప్పుడతనెక్కడ వుంటాడు?''

''ఈ బంగళాలో. రేపురాత్రి తొమ్మిదిగంటలకు అతన్ని కిడ్నాప్ చేసి ఇక్కడ బంధిస్తాం.''

''చాలా రిస్క్ వుంది.''

వినాయక్ నవ్వాడు. ''వెల్, నాయరు తలుపు తెరుస్తాడు. నేను రివాల్వరు చూపించి అరవొద్దంటాను. ఆ తర్వాత మనం కేబిన్‌లోకి జొరబడతాం. ఎటువంటి

గొడవలేకుండా అతన్నీ, అతని కూతుర్నీ తెలివి పోగొడతాం. ఆ తర్వాత సేఫ్ తెరుస్తాం."

"బాగుంది" చందర్ అన్నాడు ఉషారుగా.

"మినిమం పదిలక్షలకి అంచనా వేశాను. కానీ ఎక్కువే వుండవచ్చు. వాటిని మనం టూలుబాక్సుల్లో నింపుకుంటాం. ఆ తర్వాత చకచక బయటికి నడిచి, ఎంట్రెన్సు గార్డుతో పదినిముషాల్లో లైట్లు వెలుగుతాయని చెప్పి, జీపెక్కుతాం."

చందర్, జగన్నాథ్, రాబర్టు బరువుగా వూపిరి వదిలారు. వినాయక్ గర్వంగా చూసి నవ్వాడు.

జగన్నాథ్ అడిగాడు. "సేఫ్ ఎలా తెరుస్తాం?"

వినాయక్ తేలిగ్గా నవ్వేసి జేబులోంచి తాళంచెవి తీసి టీపాయ్ పైన పెట్టాడు. జగన్నాథ్ అనుమానంగా చూశాడు.

"దీనితోనా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"అవును" నిర్లక్ష్యంగా అని వూరుకున్నాడు వినాయక్.

జగన్నాథ్ వున్నట్టుండి పకపకమని నవ్వడం ప్రారంభించాడు.

వినాయక్ కోపంగా చూసి, "మెంటలు కేసా?" అనడిగాడు.

"నువ్వే!" నవ్వాపుకుంటూ అన్నాడు జగన్నాథ్. "ఏ సేఫ్ కూ ఒకే తాళంచెవి వుండదని నీకు తెలుసా?"

"ఏమిటి నువ్వనేది?" గర్జించాడు వినాయక్.

మిగతావాళ్ళు జగన్నాథ్ ని చిత్రంగా చూడసాగారు.

"ఆ సేఫ్ కి రెండు తాళం చెవులుంటాయి, నీ దగ్గర

ఒక చేవుంది. మరో తాళంచెవి ఎక్కడ?" అన్నాడు జగన్నాథ్.

వినాయక్ కోపం మాయమయింది. జగన్నాథ్ తెలివి తేటలకి ఆశ్చర్యపోంది, "శభాష్ జగన్! సరిగా జ్ఞాపకం చేసావు" అన్నాడు.

"బ్యాంకు సేఫ్సుతో నా కనుభవం వుంది" అన్నాడు జగన్నాథ్.

వినాయక్ ఆలోచనలో పడ్డాడు. అతనిముఖం పాలి పోయింది.

"ముసలి పథకాలు!" కసురుకున్నాడు రాబర్టు."వినాయక్, మమ్మల్ని పోలీసుల కప్పగించడానికే యీ ప్లాను తయారు చేశావు! ఒక్క 'క్రీ'తో సేఫ్ యెలా తెరుస్తాననుకున్నావూ? రెండు తాళాలుండవచ్చని ఊహించ లేదా? ఫ్రెండ్స్, ఇకపదండి. ఇక్కడ మనకి పనిలేదు. ఆడవాళ్ళ నగలు తాకట్టుజేసే పెద్దమనిషి సేఫ్ కొల్లగొట్ట డానికి బయలుదేరతాడా? ఓహ్! ఏం కలలుకన్నాను! ఏం జరిగింది! కనీసం లక్ష అయినా దక్కుతుందను కున్నాను—వినాయక్, నాకల చెడగొట్టావు!"

రాబర్టు లేచినిలబడిమళ్ళీ అన్నాడు. "జగన్,చందర్ పదండి. ముసలితనంలో మెంటలు స్టెబిలిటీ వుండదు. పిచ్చి ఆలోచనలతో ఇతరుల ప్రాణాలు తీస్తారు!"

బాషా అతనికేసి తీక్షణంగా చూశాడు.

"వెల్, ఫ్రెండ్స్." వినాయక్ ఆలోచనల్లోంచి తేరుకున్నాడు. "కూర్చొని మరోసారి బీరు తాగండి. మంచి అయిడియా చెప్తాను."

"చూడు వినాయక్, నువ్వు ఇవాళో రేపో గుండెఆగి ఛస్తావు. ఫర్వాలేదు. మేం కుర్రాళ్ళం, మమ్మల్నెందుకు

చంపుతావూ!" అన్నాడు జగన్నాథ్ కూడా లేచి నిల బడుతూ.

వినాయక్ మెదడులో ఏదో తళుక్కున మెరిసింది. "నా పథకంలో మీరు పనిచేయకపోతే చావక యేం చేస్తారు?" అన్నాడు కర్కశంగా. "నా ప్లానులోవున్న రహస్యాలన్నీ చెప్పేశాను. నన్ను కాదని మీరు బయ టికి అడుగువేశారంటే బాషా రంగంలోకి దిగుతాడు."

జగన్నాథ్, రాబర్టు ఛటుక్కున కూచున్నారు.

చందర్ కాస్సేపు ఆలోచించాడు. ఆ తర్వాత కూచోని, "వినాయక్, నీ సమయస్ఫూర్తిని నేను మెచ్చు కోక తప్పదు. ఎప్పుడూ ఆలోచిస్తుంటావు, పథకాలు వేస్తుంటావు, ఎత్తులేస్తుంటావు—అసలు నీ మెదడుకి విశ్రాంతి ఇవ్వవు!" అన్నాడు.

వినాయక్ గర్వంగా నవ్వి, "ఈ మాటలు మరోసారి చెప్పు, బావుంటుంది" అన్నాడు. "డియర్ ఫ్రెండ్స్, బొంబాయి వెళ్ళాక నేను హిందీలో బూతులన్నీ నేర్చాను. నన్ను రెచ్చగొట్టారంటే దండకం చదువు తాను. ప్రాణాలకంటే పరువుముఖ్యం. ఇది గమనిం చండి."

జగన్నాథ్ ఓడిపోయిన ముఖంతో చూసి, "సరే, నీ కొత్త అయిడియా ఏమిటి?" అనడిగాడు.

వినాయక్ నవ్వుకున్నాడు. "జగన్, ఇప్పుడొక్కటే ఒక్క మార్గముంది. కేబిన్‌లో ప్రవేశించాక నాయర్‌ని ఎదిరించి తాళం చెవులు తీసుకోవాలి. ఇది చాలా రిస్క్. అయినా మన చేతిలో రివాల్వర్సు వుండగా నాయర్ బెదిరించడు, గొడవ చెయ్యడు.

అతని బెడ్ పక్కన అలారం మీట వుంటుంది. దానికి ఎలక్ట్రిసిటీతో సంబంధం లేదు. ఎప్పుడయినా మోగు తుంది. దాన్ని మోగకుండా కనెక్షన్స్ పూడగొట్టాలి.

నాయర్ని తాళం చెవులందించాక తెలివి పోగొట్టాలి. ఆ తర్వాత నిర్భయంగా సేఫ్ తెరిచి టూల్ బాక్సుల్లో సొమ్ము నింపుకోవాలి. సమయాన్నిబట్టి సాధ్యమైనంత వరకు దోచుకుని బయటపడాలి."

"నా అనుమానం గార్డ్సుని అంత తేలిగ్గా ఫూల్స్ చేయగలమా అని" జగన్నాథ్ అన్నాడు.

"అది మన నటనమీద ఆధారపడి వుంటుంది. తొమ్మిది గంటలకు నేను సింగ్ను వెంటబెట్టుకుని ఇక్కడికి వస్తాను."

"వెంటబెట్టుకుని వస్తావా?"

"సీకరంగా కాలేదు. కిడ్నాప్ చేసి తీసుక వస్తాను. ఈ రాత్రికి మీరు నలుగురు మొదటి ఆట సర్కస్కు వెళ్ళండి. సాధ్యమైనంతవరకు అక్కడి పరిసితులు, పరిసరాలు పరి శీలించి అవగాహన చేసుకోవచ్చు."

చందర్ ముందుకు వంగి, "అసలు తాళంచెవిని ఎలా సంపాదించావ్?" అనడిగాడు.

వినాయక్ గట్టిగా నవ్వేసి, "సర్కస్లో పనిచేసే అమ్మాయి నుంచి దాని ఇంప్రెషన్ సంపాయించి డూప్లి కేట్ తయారు చేశాను" అన్నాడు.

"ఆ అమ్మాయివల్ల మనకు ప్రమాదం వుండదా?" ఛటుక్కున అడిగాడు జగన్నాథ్.

వినాయక్ అందర్నీ ఒకసారి తన పాము కళ్ళతో ఆపాదమస్తకమూ చూశాడు. అందరూ అతని రూపాన్ని చూసి జడుసుకున్నారు...

వినాయక్ బెడ్ మీద విశ్రాంతి గావాలి అన్నాడు, "ఆ అమ్మాయివల్ల మనకే ప్రమాదమూ వుండదు. ఆమెకో పాకెట్‌లో అందమైన బహుమతి అందించాను. ఆ పాకెట్ తెరిచిన మరుక్షణం ఆమె మృదువైన చేతిని బుసలుకొట్టే త్రాచు కాటేస్తుంది."

# 5

అసిస్టెంట్ కమీషనర్ ఆఫ్ పోలీస్ దేవరాజ్ సర్కస్ ఆవరణలో కారు దిగడం చూసి, 'పారగన్ సర్కస్' ప్రొప్రయిటర్ గోవిందన్‌నాయర్ పరుగెత్తుకుని వెళ్ళి రిసీవ్ చేసుకున్నాడు.

"గుడ్మార్నింగ్ సర్!"

"గుడ్మార్నింగ్ మిస్టర్ నాయర్."

ఇద్దరూ సర్కస్ లోపలికి అడుగు వేశారు.

అసిస్టెంట్ కమీష్నర్ దేవరాజ్‌కి ముప్పై అయిదేళ్ళుంటాయి. అతను చాలా తక్కువ వయసులో ఆ హోదాకి ఎదిగాడంటే అందుక్కారణం అతని ప్రతిభ. ఇంతవరకు అతను బ్రహ్మచారిగా వుండటానికి కారణం ఇంకా పై హోదాకి ఎదగాలన్న కాంక్ష. అప్పుడే పెళ్ళి భార్య-పిల్లలు-అందమైన స్వంత యిల్లు యేర్పడతాయి.

నాయర్, దేవరాజ్ కేబిన్‌లోకి ప్రవేశించాక నళిని నమస్కారం చేసి ఆహ్వానించింది.

దేవరాజ్ కళ్ళు ఆమెని జాలిగా చూసి, అంతలో నే: నవ్వాయి.

"థాంక్స్, సిస్టర్" అన్నాడతను.

నళిని నవ్వి, "కసేరయిల్ ఇరిక్కు" అంది.

దేవరాజ్ అర్ధంగాక నాయర్ ముఖం చూశాడు. నాయర్ నవ్వి, "కుర్చీలో కూచోండి" అన్నాడు హిందీలో.

దేవరాజ్ థాంక్స్ చెప్పి కూచున్నాక నాయరు మళ్ళీ అన్నాడు, "ఆమె నా కూతురు నళిని. ఆమె గురించి ఇన్‌స్పెక్టర్ మీకు చెప్పి వుంటారు."

"చెప్పారు" దేవరాజ్ అన్నాడు. "ఆమెకు పోలియో రావడం బాడ్ లక్" నాయర్ ముఖం విచారంగా మారింది.

దేవరాజ్ నాయర్‌ని సూటిగా చూశాడు. "మిస్టర్ నాయర్. మీకు వార్నింగ్ ఇస్తున్నాను. క్రైం బ్రాంచ్‌తో మీరు చేసుకున్న ఒప్పందం నాకేమీ నచ్చలేదు. వెంటనే మీరు డబ్బు బ్యాంక్‌కి తరలించండి."

దేవరాజ్ గొంతులో హెచ్చరిక నాయర్‌ని భయపెట్టింది.

"సర్, నా డబ్బు ఇక్కడ క్షేమంగా వుంటుంది. ఇరవై ఏళ్ళుగా ఎలాంటి ప్రమాదమూ వాటిల్లలేదు. క్రైం బ్రాంచ్‌తో నేను చేసుకున్న ఒప్పందంలో ఎలాంటి పొరపాటూ లేదు. ఇది ఇరవై ఏళ్ళుగా సాగుతున్న వ్యవహారం."

"మిస్టర్ నాయర్! జయ చావుకు మీరే బాధ్యులని మరవకండి!" కఠినంగా అన్నాడు దేవరాజ్. "అంత డబ్బు మీరు సేఫ్‌లో పెట్టారు. ఈ విషయం దొంగలకి తెలిసిపోయింది. జయకి డబ్బు ఆశపెట్టి సహాయం కోరారు. ఆమె యేం సహాయం చేసిందో మనకు తెలియదు. కానీ ప్రతిఫలంగా ఆమెకు ఆరువేల రూపా

యలతో బాటు చావు కూడా దక్కింది. మిస్టర్ నాయర్, మీ ఇరవై యేళ్ళ విశ్వాసం ఇవాళో రేపో..."

"నెవర్ మైండ్!" నాయర్ అడ్డు తగిలాడు. "ఈ సిటీలో అంత గుండె ధైర్యం వున్న గూండాలుంటారను కోను. జయ చావుకి నేనే బాధ్యుడ్ని. ఆమె చావుకు దుండగులతో సంబంధముందని మీరనుమానిస్తున్నారా? అయితే ఆ దుండగులు వట్టి పిచ్చివాళ్లు! నా మాట వినండి, నా డబ్బు దోచుకుని వాళ్లెక్కడికీ పారిపోలేరు."

"మిస్టర్ నాయర్! మీ మాటలు వినదలచలేదు. మా డ్యూటీ మేం చేస్తాం. దోపిడీ జరగడానికి ఆస్కారం లేకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు ఎన్నో వుండగా, ఇలాటి రిస్క్ ఎందుకు తీసుకోవాలి?"

దేవరాజ్ మాటల్ని నాయర్ పట్టించుకోలేదు.

"జయ హత్య పరిశోధించి దోపిడీ జరిగేలోపున నేరస్తుల్ని పట్టుకుంటాం" దేవరాజ్ మళ్ళీ చెప్పాడు. "ఎంత ప్రియమైనా యే వస్తువుకా స్థానం వుండాలి. ఏమీ అనుకోకపోతే ఒక మాట చెప్తాను: మీకు ప్రియమైన డబ్బును మీ దగ్గరే భద్రంగా దాచుకున్నట్టు, మీరు ప్రేమించే కూతురును బ్యాంకు లాకరులో బంధించగలరా?"

నాయరు చిన్నగా నవ్వాడు భావగర్భితంగా. దేవరాజ్ అతన్ని సూటిగా చూశాడు. నాయరు కళ్లు మెరుస్తున్నాయి.

"సర్, నాకు సంబంధించిన వస్తువుల్ని ముట్టుకునే ధైర్యం ఎవరూ చేయరు. ఈ సేఫ్ ఎవరయినా కొల్లగొట్టాలనుకుంటే ముందుగా ఆరడుగుల గొయ్యి తవ్వుకుని

రావడం మంచిది. లేదా సమాధిత వ్వే వాళ్ళని మాటాడి వుంచుకోవాలి'' అన్నాడతను.

దేవరాజ్ అతనిమాటలువిని, ఒక్క క్షణం మౌనంగా వుండి, లేచి సేఫ్ వేపుకు నడిచాడు.

కేబిన్ కు ఎడమవేపు మూలవుంది సేఫ్. దేవరాజ్ దాన్ని పరీక్షగాచూసి, ''ఎంత మొత్తం వుందిందులో?'' అనడిగాడు.

''ఎనిమిది,'' క్లుప్తంగా సమాధానమిచ్చాడు నాయరు.

''ఆల్ రైట్, ఇక మర్డర్ గురించి మాట్లాడుకుందాం'' దేవరాజ్ తిరిగివచ్చి కూర్చున్నాడు.

ఇంతలో బయటినుంచి కాఫీలు వచ్చాయి. నాయరు రెండు కప్పులందుకుని ఒకటి దేవరాజ్ కిచ్చాడు. ఆ తరువాత నళినిని బయటికి వెళ్ళమని చెప్పారు.

నళిని దేవరాజ్ దగ్గర సెలవుతీసుకుని వెళ్ళిపోయింది. నాయరు కాఫీలు తెచ్చిన వ్యక్తిని వెళ్ళమన్నట్టు సైగ చేశాడు.

''గుడ్, ఇక చెప్పండి'' దేవరాజ్ అడిగాడు.

''ఏమిటి?''

''మర్డర్ గురించి.''

''ఏం చెప్పాలి?''

''జయకు ఒక పాకెట్ లో ఎవరో బహుమతి అందించారు; అందులో వున్నది పాము. ఆ పాకెట్ ఇచ్చిన వ్యక్తి ఆమె నెక్కడ కలుసుకున్నాడు?''

''నాకు తెలియదు, మీకు తెలియదు, ఎవరికీ తెలియదు.''

''జయకు తెలుసు. ఆల్ రైట్, ఆమె చనిపోయింది. చివరిసారిగా ఆమెని మీరెప్పుడు చూశారు?''

"రాత్రి ఒంటిగంటకు."

"అప్పుడామె భావాలెలా వున్నాయి?"

"ఆమె భావాల గురించి చెప్పాలంటే చాలా వుంది. ఆమె కన్య. బ్రహ్మచారిణి! ఆమెకు మగవాళ్ళంటే అసహ్యం! మిస్టర్ దేవరాజ్, నాదొక సందేహం! ఆమెను కలుసుకున్న వ్యక్తి ఎవరో పరాయి వ్యక్తి కాక మా సర్కస్‌లోనే ఎవరో ఒకరు ఎందుకు కాకూడదు?"

"ఎవరు? మీకు తెలుసా?"

"సింగ్, ఎలక్ట్రిషియన్. జయ అంటే అతనికి ఇష్టం" నాయర్ అన్నాడు.

"అయితే ఈ హత్య జరిగింది దోపిడీ కోసం కాదనీ, ప్రేమకోసమనీ మీ అభిప్రాయం. అంతేనా?"

"ఎలా వూహించారు?"

"నేను త్వరలో కమీనషర్ని కాబోతున్నాను" దేవరాజ్ అన్నాడు తాపీగా పొగ పీలుస్తూ, "మిస్టర్ నాయర్, నా సామర్థ్యం మీకు తెలియదు. ప్రేమకోసం హత్య జరిగితే శవం పక్కన కరెన్సీ కాయితా లెందు కుంటాయి?"

నాయర్ ఇంకా ఆశ్చర్యపోయాడు. "సర్, మీ తర్కం నాకు నచ్చింది."

"కాబోయే కమీషనర్ని" దేవరాజ్ అన్నాడు. "అల్ రైట్ నాయర్! ఈ హత్య మీ సర్కస్‌లో మనుషు లెవరూ చేయలేదు. ఎందుకంటే, శవం పక్కన ఆరువేల నోక్కం దొరికింది. అంత డబ్బు ఎక్కడిది?"

"మిస్టర్ నాయర్" ఇంకా అన్నాడు దేవరాజ్. "జయ హత్య ఆ దొంగల పథకంలో ఒక భాగం.

ఆమెకు డబ్బు ముట్టజెప్పి, మీ సేఫ్ రహస్యం తెలుసుకున్నారు."

"ఏమిటా రహస్యం?"

"తాళంచెవి" దేవరాజ్ అన్నాడు.

"ఆల్ రైట్, ఇప్పుడు పరిస్థితి మీ కర్థమయిందనుకుంటాను. అందువల్ల..." దేవరాజ్ ఆగిపోయాడు.

"పూర్తిగా చెప్పండి."

"మీ సర్కస్‌ని మేం గార్డు చేస్తాం."

"నో కమీష్నర్!" గట్టిగా అర్చాడు నాయరు. "సర్కస్‌కి చెడ్డపేరు వస్తుంది. మీరు గార్డుచేయడం కంటే మేం సర్కస్ ఎత్తేయడమే నయం! నేనేం చెప్పాను? నా వస్తువుల్ని ముట్టుకునేవాళ్ళు సమాధి తవ్వుకుని రావాలని—జయ విషయంలో యేం జరిగింది? నా సేఫ్ తాళంచెవి దొంగలకు అందించి పరలోకానికి—"

"ఆల్ రైట్, ఆల్ రైట్! మీ సర్కస్‌ను గార్డు చేసేది మీ సేఫ్‌ని రక్షించడానిక్కాదు. హంతకుల్ని పట్టుకోడానికి" దేవరాజ్ అన్నాడు.

"పట్టుకోండి! వద్దనే దెవరు? నేను వద్దంటే వూరుకుంటారా? వల పన్నండి. మీ పోలీసు బుర్రకు ఏ ఒక్క ఇతర మార్గమూ తట్టదా?"

రెచ్చిపోయాడు దేవరాజ్. "ఇవి కాబోయే కమీష్నరుతో చెప్పే మాటలు కావు! వాచ్ యువర్ లాంగ్వేజ్. హంతకుల్ని పట్టుకునేందు కనేక మార్గాలున్నాయి. కానీ, మీ సేఫ్ దోపిడీ జరిగాక దొంగల్ని పట్టుకునేందుకు ఎటువంటి మార్గాలూ వుండవు!"

"ఏమిటి మీ వార్నింగ్?"

"క్రైంబ్రాంచ్‌తో మీరు చేసుకున్న ఒప్పందం రద్దు చేయిస్తాను" కర్కశంగా వుంది దేవరాజ్ స్వరం. "అప్పుడు మీ సర్కస్ పరిస్థితి ఎడారిలో గుడారంలా తయారవుతుంది. ఎలాటి సహాయమూ అందదు."

దేవరాజ్ విసురుగా లేచి బయటికెళుతుండగా నాయరు అన్నాడు:

"ఫరవాలేదు. నాకెవరి సహాయమూ అవసరంలేదు. ఆత్మవిశ్వాసంతో ఎలాటి ఆపదలనైనా ఎదుర్కొంటాను. సెలవు, మిస్టర్ దేవరాజ్!"

# 6

రాత్రి 2 గంటల 25 నిముషాలు దాటింది. చిమ్మ చీకటి.

సడెన్ బ్రేకువేసి వినాయక్ జీపును సర్కస్ గేటు ముందాపాడు.

గార్డ్సు పరుగెత్తుకొచ్చారు, తుపాకులు పట్టుకుని.

వినాయక్ హెడ్‌లైట్స్ ఆఫ్ చేసి కిందికి దిగాడు.

బాషా ఆపదను ఎదుర్కోడానికి సిద్ధంగా వున్నట్టు జేబులోని రివాల్వరు మీద చెయ్యి వేశాడు. ఏం జరగబోతోందో వూహాకందని చందర్, జగన్నాథ్, రాబర్టులు నిశ్చేష్టులై నిలబడిపోయారు.

"కౌన్ హై?" పొట్టిగా వున్న గార్డు అడిగాడు, టార్చి వెలిగించి.

"ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటు" తడుముకోకుండా జవాబిచ్చాడు వినాయక్.

గార్డు జీపుమీద లైటు ఫోకస్ చేశాడు. ఎదురుగా వచ్చి విండ్‌షీల్డ్ కింద చూశాడు: A. P. S. E. B.

సన్నగా ఈలవేసి, "మిమ్మల్నెవరు పిల్చారు?" అని అడిగాడు.

"ప్రొప్రయిటర్ నాయరు" వినాయక్ చెప్పాడు.

"అలాగా! సప్లయి ఎలా బ్రేక్ డౌనయింది?"

"పవర్ రూంలో మెయిన్స్ కాలిపుండవచ్చు."

రెండవగార్డు బాషా దగ్గిరికి వచ్చి ఎగాదిగా చూశాడు.

"ఎలా కాలుతాయి? హైవోల్టేజి వచ్చిందా?"

వినాయక్‌కి విసుగు పుట్టింది. "చూడు మిస్టర్, నువ్వెవరు నన్నడగడానికి?"

"ఆల్ రైట్, మీరు వస్తున్నట్టు మాకు తెలియదు" అన్నాడు పొట్టిగార్డు.

"ప్రొప్రయిటరు అనుమతిస్తే మిమ్మల్ని లోనికి పంపిస్తాం."

బాషా వెంటనే జీపు దిగాడు. "వాటీస్ దిస్ నాన్సెన్స్, వినాయక్?"

వినాయక్ గార్డువేపు తిరిగాడు. "మిస్టర్ నాయర్ ఫోన్ చేశారు. మీ ఎలక్ట్రిషియన్ సింగ్ సినిమాకెళ్ళి రాలేదట. మమ్మల్ని త్వరగా రమ్మన్నారు. మేము వెంటనే లోనికెళ్ళి చూడాలి. మిస్టర్ ఆలస్యం మీకే అపాయం."

బాషా చందర్‌నీ, జగన్నాథ్‌నీ సైగ చేశాడు. ఇద్దరూ టూల్ బాక్స్‌లు చేతబట్టుకుని దిగి నిలబడ్డారు.

రెండవగార్డు గబగబ గేటువేపుకి నడిచాడు. బాషా అతన్ని వెంటాడబోయాడు. కానీ వినాయక్ వారించాడు.

"ఒక్క క్షణం ఆగండి" పొట్టిగార్డు అన్నాడు. "అతను నాయరుసాబ్‌కి ఫోన్ చేయడానికి వెళ్ళాడు.

రాగానే మీకు పర్మిషన్ దొరుకుతుంది. మా తిప్పలు మీకు తెలీవు. అనుక్షణమూ అప్రమత్తతతో వుండాలి.''

టైమ్ చక చక గడిచిపోతోంది. వెళ్ళిన గార్డు రెండు నిముషాలయినా తిరిగి రాలేదు.

వినాయక్ మెదడులో రకరకాల అనుమానాలు రేకెత్తాయి. ఆ గార్డు నాయర్‌కి ఫోన్ చేశాడంటే తమ బండారం బయటపడుతుంది. ఒకవేళ నాయర్ తమని దొంగలుగా అనుమానించి ఫైరింగ్ ఆర్డర్స్ ఇవ్వవచ్చు గార్డ్సుకి. ఆ గార్డు యేమీ ఎరగనట్టు వచ్చి అకస్మాత్తుగా షూటింగ్ ప్రారంభిస్తే......

వినాయక్ భుజాలెగరేసి జేబులో రివాల్వరుని పట్టుకున్నాడు. చీకట్లో కళ్ళు చీల్చి గార్డు రాకకోసం కాచుకున్నాడు అసహనంగా.

వినాయక్‌కి వచ్చిన అనుమానాలే బాషాకు కూడా వచ్చాయి. రెండు జేబుల్లో రెండు చేతులు పోనిచ్చి రివాల్వర్స్ పట్టుకున్నాడు.

చందర్, రాబర్టు, జగన్నాథ్‌లు కూడా టూల్ బాక్సులు కిందపెట్టి జేబుల్లో చేతులు పెట్టుకున్నారు.

ఇలా అందరూ జేబుల్లో చేతులు పెట్టుకోవడం పాటి గార్డుకు అనుమానం రేకెత్తించింది. ఈ విషయం వినాయక్ పసిగట్టి, జేబులోంచి చెయ్యితీసి నవ్వి, ''నీ సర్వీసెంత?'' అనడిగాడు.

పాటిగార్డు సమాధానమిచ్చేంతలో ఫోన్ దగ్గర వున్న గార్డు అరిచాడు:

''దిలావర్! సాబ్ ఓ. కె. అన్నారు.''

ఆ అరుపు విన్నాక వినాయక్ ముఖంలో నెత్తురు చుక్క లేదు. అలాగే బాషా, చందర్, జగన్నాథ్ కూడా విస్తుపోయారు.

"ఆల్ రైట్, మీరు వెళ్ళవచ్చు" పాట్టిగార్డు అన్నాడు, గేటుకేసి చెయ్యి చూపిస్తూ.

ఐదుగురూ టూల్ బాక్సులు పట్టుకుని ముందు కడుగు వేశారు.

గేటు లోపల ఫోన్ దగ్గర నిలబడి వున్న గార్డు, "మీకు శ్రమ కలిగించాం క్షమించాలి" అన్నాడు నొచ్చుకుంటూ.

వినాయక్ బలహీనంగా నవ్వాడు. "నెవర్ మైండ్. మీకు థాంక్స్ చెప్పాలి."

ఆ తర్వాత నలుగురూ చకచక ఆవరణలోకి అడుగు లేశారు. బాషా, వినాయక్ పక్కకు వచ్చి, "ఏమి టిందులో మర్మం?" అనడిగాడు.

వినాయక పెదవి విరిచాడు. "ఇప్పుడు మనం ట్రాప్ లో ఇరుక్కున్నాం, మనమెవరో నాయర్ కి తెలిసిపోయింది. అందుకే లోనికి ఆహ్వానించి చుట్టూ వల బిగిస్తున్నట్టుంది."

బాషా వూపిరి బిగబట్టాడు.

వినాయక్ కొనసాగించాడు "బి ఎలర్ట్! యేక్షణా న్నయినా ఫైరింగ్ స్టార్టు కావచ్చు. మనం ధైర్యంగా ఎదుర్కోవాలి."

కేబిన్ దగ్గర గార్డు ముందుకు వచ్చి, "వెళ్ళండి, నాయర్ సాబ్ రమ్మన్నారు" అన్నాడు.

వినాయక్ తన అనుచరులకు చూపులతో హెచ్చరిక చేశారు. కేబిన్ వెనక పవర్ రూం చేరుకుని ఆగారు, తలుపుకి తాళం వేసి లేదు.

వినాయక్ గొళ్లెంతీసి లోనికి అడుగు పెట్టాడు. చీకటిగా వుంది. పెన్‌టార్చి వెలిగించి ముందుకు నడిచాడు. కేబిన్ తలుపు చేరుకుని దానిపైన చప్పుడు చేశాడు. వెంటనే తలుపులు తెరుచుకున్నాయి.

## 7

వినాయక్ చేతిలో రివాల్వర్ ప్రత్యక్షమైంది.

"కదలకండి! నా దగ్గర రివాల్వర్ వుంది."

చీకట్లో ఒకరి ముఖాలు ఒకరికి కన్పించడం లేదు.

వినాయక్ పెన్‌టార్చి నాయర్ ముఖం మీదికి ఫోకస్ చేశాడు. నల్లటి నాయర్ కళ్లు నిశ్చలంగా కన్పించాయి.

"మిస్టర్ నాయర్, మాకు మీ సేఫ్‌లోని డబ్బు కావాలి. అభ్యంతరం చెబితే మీ ప్రాణానికి గ్యారంటీ వుండదు. పదండి. తాళంచెవులిలా ఇవ్వండి" కర్కశంగా అన్నాడు వినాయక్.

అతని వెనుకవున్న అనుచరుల చేతుల్లోని రివాల్వర్స్ సిద్ధంగా వున్నాయి.

పరిస్థితి యేమిటో గ్రహించిన నాయర్ ఒక నిర్ణయానికి వచ్చి, "ఆల్‌రైట్, అభ్యంతరం లేదు. ఇన్నాళ్ళూ డబ్బే ప్రాణమనుకున్నాను. ఇప్పుడు ప్రాణమే డబ్బని తెలుసుకున్నాను" అన్నాడు నవ్వుతూ.

"రండి, ఆయుధాలనవసరం! నో వైలెన్స్! ఇవిగో తాళంచెవులు. నిర్భయంగా సేఫ్ తెరిచి కావలసినంత క్యాషు తీసుకెళ్ళండి. కమాన్, గెటిన్!"

నాయర్ మాటలు విని వినాయక్ ఫకాలున నవ్వాడు. "అడుగు వేసేముందు బాగా ఆలోచించడం నేరస్థుల

ఆచారం. మీరు పన్నిన వలలో అమాయకంగా చిక్కుకోడానికి మేం దద్దమ్మలంగాం! వెనక్కి తొలగండి, కేబిన్‌లో ఇంకెవరున్నారు?''

''నా కూతురు నళిని'' నాయర్ గొంతు పూడుకపోయింది.

వినాయక్ చటుక్కున లోని కడుగువేసి టార్చి నలువేపులా ఫోకస్ చేశాడు. ఎడమవేపు మూల బెడ్‌మీద నళిని నిద్రపోతోంది.

కేబిన్‌లో ఇంకెవరూ లేరు.

బాషా జేబులోంచి కొవ్వొత్తితీసి వెలిగించాడు. ఆ వెలుగులో వినాయక్, నాయర్ ముఖం చూస్తూ, ''మీ మంచికోసం చెబుతున్నాను—ఈ కేబిన్‌ని చుట్టుముట్టేందుకు గార్డ్సుకి మీరార్డర్స్ ఇచ్చివుంటే వెంటనే ఉపసంహరించుకోండి. లేదా, మిమ్మల్ని సంహరించవలసి వస్తుంది. రిమంబరిట్, నో మిస్టేకు'' అన్నాడు.

బాషా నళినికి స్మెల్లింగ్ సాల్టు వాసన చూపిస్తోంటే నాయర్ గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. నోరు తెరిచి అరవబోయాడు.

వినాయక అతని నోటిమీద చెయ్యివేసి, ''అరవకండి అపాయం! అర్థమైందా? మీరు అరిస్తే గార్డ్సు లోనికి జొరబడతారు. కాని, ముందు మిమ్మల్ని చంపుతాం. ఆల్ రైట్, తాళంచెవులివ్వండి.''

బాషా నళినికి స్పృహ పోగొట్టి బెడ్ పక్కన వున్న అలారం బెల్ కనెక్షన్ వూడగొట్టాడు.

నాయర్ వణుకుతున్న పాదాలతో బెడ్ చేరుకుని తలగడ కిందినుంచి తాళం చెవులు తీశాడు. వినాయక వాటిని విసురుగా లాక్కున్నాడు.

"మిస్టర్ నాయర్! మీ ధైర్యాన్ని మెచ్చుకోవాలి. ఈ రోజుల్లో బ్యాంకులకు లేని భద్రత మీ కేబిన్‌కి ఎలా వుంటుందనుకున్నారు? బెడ్ పక్కన సుమారు పది లక్షల రూపాయలున్న సేఫ్ వుంచుకుని ఎలా నిద్ర పోతున్నారు? గార్డ్సుని నమ్ముకున్నారా? గార్డుని నమ్ము కుంటేనే దిక్కు లేదు. మిస్టర్ నాయర్, మీ గార్డ్సుని వుద్యోగంలోంచి తొలగించి సర్కస్‌లో జోకర్స్ పాత్ర లివ్వడం మంచిది. ఏమంటారు?''

నాయర్ మాట్లాడలేదు. దుండగుల చర్యల్ని శ్రద్ధగా గమనిస్తున్నాడు.

బాషా రివాల్వర్ జేబులో దోపుకుని సేఫ్ దగ్గరికి నడిచాడు. చందర్, రాబర్టు, జగన్నాథ్‌లు టూల్ బాక్సులు సేఫ్ దగ్గరికి చేరవేశారు.

ఆ తర్వాత వినాయక్ తన తెలివితేటలకు మురిసి పోతూ, గర్వంతో పులకించిపోతూ ఒక్కో అడుగు కేబిన్ అదిరేలా వేస్తూ నడిచాడు సేఫ్ దగ్గరికి.

నాయర్ కళ్ళు సేఫ్ మీద నిశ్చలంగా వున్నాయి. నుదుటిమీంచి చెమటలు కారి ఒక్కొక్కబొట్టు నేలమీద పడుతున్నాయి. నరాలు బిగదీసుకుపోయాయి. రక్తపు వేగం హెచ్చింది.

సేఫ్ తలుపు తెరుచుకుంది.

కళ్ళు చెదిరే డబ్బు ఎదురుగా చూసి తమ కలలన్నీ నిజమైపోయినట్లు సంతోషంతో అర్చారు ఆ ఐదుగురు నేరస్తులూ.

జగన్నాథ్, చందర్‌లు వణుకుతున్న చేతులతో గబగబ టూల్ బాక్సులు విప్పారు. బాషా సేఫ్‌లోంచి డబ్బు తీసి నేలమీదికి విసిరేస్తున్నాడు. వినాయక్

సేఫ్ నానుకుని నిలబడి సిగరెట్ వెలిగించి గంభీరంగా పీల్చసాగాడు. రాబర్టు రివాల్వర్‌తో నాయర్‌ను కవరు చేస్తున్నాడు.

ఈ దృశ్యమంతా చూస్తున్న నాయర్ గుండెల్లో క్రమంగా ఆత్మవిశ్వాసం నిండుగా చోటు చేసుకుంది. పడక్కుర్చీల్లో కూచోని తాపీగా చుట్ట వెలిగించి విశ్రాంతిగా వెనక్కు వాలాడు.

ఐదు టూల్ బాక్సులు దాదాపు నిండిపోయాయి. సేఫ్ కూడా దాదాపు ఖాళీ అయింది.

వినాయక్ కళ్ళు పై షెల్ఫ్‌మీద పడ్డాయి. దానికి తాళం వేసివుంది. "ఓ. కే. మిస్టర్ నాయర్! ఇందులో నగలున్నాయా?"

"తెరిచి చూడు తెలుస్తుంది" నిర్లక్ష్యంగా సమాధాన మిచ్చాడు నాయర్. అతని నిర్లక్ష్యం వినాయక్‌ని గాభరా పెట్టింది.

బయట ఎక్కడా చడీ చప్పుడు లేదు.

వినాయక్ వణుకుతున్న చేతులతో పై షెల్ఫ్ తాళం తెరిచాడు. అతని కళ్లు ఒక్క క్షణం నిశ్చలంగా వుండిపోయాయి. చుట్టలు చుట్టివున్న తెల్ల కాయితాలు షెల్ఫ్ నిండా వున్నాయి. చటుక్కున వెనక్కి తిరిగి "ఏమిటివి?" అన్నాడు నాయర్‌ని మింగేలా చూసి.

"విప్పి చూడు!" నాయర్ గొంతులో నిర్లక్ష్యం తొలగలేదు. అతని కళ్ళు టూల్ బాక్సులమీద పడ్డాయి. జగన్నాథ్, చందర్‌లు డబ్బును వాటిలో సాధ్యమైనంతవరకు కుక్కినింపి, మూతలు పెట్టారు.

వినాయక్ చటుక్కున ఒక చుట్టవిప్పి లైట్ దగ్గరికి వచ్చాడు. ఆ కాయితాలనిండా టైపుచేసిన అంకెలు తప్ప ఇంకేమీ లేవు.

"ఆ అంకెలు మీరు టూల్ బాక్సుల్లో నింపుకున్న రూపాయలవి." నాయర్ అన్నాడు ప్రశాంతంగా.

"ఈ కాయితాలన్నీ కార్బన్ కాపీలు. వీటి వరిజినల్స్ పోలీసుల దగ్గర వున్నాయి. ఒకవేళ మీరీ డబ్బు తీసుకుని వెళ్ళిపోయారనుకోండి. పోలీసులు రంగంలోకి దిగుతారు" నాయర్ గుండెలనిండా గాలిపీల్చి మళ్ళీ చెప్పాడు. "కాబట్టి ఈ డబ్బు మీ కెందుకూ పనికిరాదు, కాఫీ కాచుకోడానికి తప్ప."

నాయర్ నోటినుంచి వస్తోన్న ఒక్కో మాటా వినాయక్ గుండెల్లో బాణాల్లా గుచ్చుకుంటున్నాయి.

"బ్యాంకులకు లేని భద్రత నా సేఫ్‌కి లేదు. ఇది మీ లాటి దొంగల దృష్టిలో మాత్రమే. నా దృష్టిలో యీ సేఫ్‌కి వున్న సేఫ్టీ ఛేధింపలేనిది. నిరూపణ కావాలంటే ఆ డబ్బులో ఒక్క రూపాయితో సిగరెట్ పెట్టె కొని చూడండి. తెలుస్తుంది. మీరు నన్ను చంపేసి డబ్బు తీసుకెళ్ళగలరేమోగానీ, పోలీసులకి ఎప్పుడూ అందుబాటులోనే వుంటారు. కాబట్టి నన్ను చంపడం బుద్ధి తక్కువపని తెలుసుకోండి."

వినాయక్ గుండెలో అలజడి ప్రారంభమైంది. అతని శరీరంలో వణుకు ప్రారంభమైంది. నిలబడేందుకు కాళ్లు సహకరించడం మానేశాయి. నాయర్ మాటలు అతని చెవుల్ని చిల్లులు చేసేలా వున్నాయి. ముఖంలో కవళికలు చకచక మారిపోతున్నాయి.

చందర్, జగన్నాథ్‌లు నేలమీద చమటలుకక్కుతూ కూచుండిపోయారు, రాతిబొమ్మల్లా.

నాయర్ మరో చుట్ట వెల్గించి, అందరి ముఖాల్నీ చూశాడు.

"చాలా తెలివైన పథకం వేశారు! నా తాళంచెవికి మైనం మరకలు కన్పించినప్పుడే అనుమానించాను. జయ చచ్చాక అనుమానం ధృవపడింది. ఈ రాత్రి సింగ్ అదృశ్యమయ్యాడు. ఇప్పుడు సప్లై బ్రేక్ డౌన్ అయ్యాక అర్థమైంది, అతను అదృశ్యమవడంలో మర్మం. ఆ తర్వాత గార్డునుంచి ఫోన్ వచ్చింది. ఇక పూర్తిగా బోధ పడింది.

వినాయక్ కి అప్పటికీ నోరు పెగల్లేదు.

"ఏమిటిది వినాయక్!" బాషా అర్చాడు ఆందోళనగా.

వినాయక్ జవాబివ్వలేదు.

బాషా తటాలున నాయర్ మీదికి దూకి గొంతు పుచ్చుకున్నాడు. "చెప్పు! ఇది నిజం కాదని చెప్పు! నువ్వు మోసం చేస్తున్నావు! నిన్ను చంపేస్తాను."

వినాయక్ తేరుకుని, బాషా కాలర్ పుచ్చుకుని వెనక్కి లాగాడు.

"రాస్కెల్, ఈ బిజినెస్ లో ప్రాణాల ప్రసక్తి లేక నాయర్ ని చంపితే రూపాయలు దక్కవు. చంపక పోయినా దక్కవు."

"మరి?"

"పోలీసుల దగ్గర వున్న వరిజినల్ కాయితాలు మన వశమైతే దక్కుతాయి" వినాయక్ అన్నాడు.

వినాయక్ తెలివి చందర్ ని ఆశ్చర్యగొలిపింది.

"ఎలా దక్కించుకుంటాం?" బాషా అర్చాడు పిచ్చిగా.

"అది సాధ్యం కానిపని బాషా!"

వినాయక్ కళ్లు మూతలుపడుతున్నాయి. గుండెలో రక్తప్రసరణ క్రమంగా తగ్గడం అతను గమనిస్తున్నాడు. బాషా చటుక్కున అతన్ని చేతుల్లోకి తీసుకున్నాడు.

చందర్, రాబర్టు, జగన్నాథ్‌లు వినాయక్ పక్కన చేరారు. వినాయక్ పరిస్థితి క్షణాలు దొర్లుతున్నకొద్ది విషమించసాగింది.

"బాషా, నేను ఓడిపోయాను! ఇప్పుడు విడిపోతున్నాను. ఇది నా చివరి పథకం. ఈ పథకం పారితే ఈ వెధవ బ్రతుక్కి స్వస్తిచెప్పి ప్రశాంత జీవితం గడపాలనుకున్నాను కానీ బాషా, అంతా తల్లక్రిందులైంది. చందర్, జగన్, రాబర్టు! నన్ను క్షమించండి ఫ్రెండ్స్."

వినాయక్, బాషా చేతులు బలంగా పట్టుకున్నాడు. బాషా వినాయక్ గుండెలు నిమురుతున్నాడు. అడుగడుగున ఎదురయిన ఆటంకాల్ని అలసట లేకుండా ఎదుర్కొన్నాను. ఇప్పుడీ ఆటంకాన్ని ఎదుర్కొనే శక్తీ యుక్తీ నాకు లేవు బాషా!"

"ఏమిటి వినాయక్?"

"నాగుండె నా పేయ్! ఈ బాధ భరించలేను! ఓహ్!" పిడికిలి బిగించి ఛాతీమీద బాదుకుంటూ అరుస్తున్నాడు వినాయక్. "ఈ గుండెకి దయ, జాలి లేవు! ఇలాంటి గుండె నాకు వద్దు."

"వినాయక్!"

బలహీనంగా నవ్వాడు వినాయక్, "చూడు బేటా, నేను చచ్చాక నా శవాన్ని తీసుకుని తలవంచుకుని వెళ్ళిపో!" వినాయక్‌కి వూపిరి పీల్చడం కష్టతరమైంది హాతాత్తుగా, "ఆ డబ్బు ...కేసి... చూడకు! డియర్...

ఫ్రెండ్స్! మీ కల చెడగొట్టినందుకు...నన్ను తనివితీరా తిట్టుకోండి...కానీ...కానీ... ఆ డబ్బు మాత్రం... ముట్టుకోకండి! అది నిప్పు!...రి...మెం...బ...రిట్! నో...మి...స్టేక్!''

వినాయక్ తల వాల్చేశాడు.

బాషా కెవ్వుమని కేక పెట్టాడు. చందర్, జగన్నాథ్ ఘొల్లుమన్నారు.

మరుక్షణం కేబిన్ వాళ్ళ ఏడ్పులతో ప్రతిధ్వనించ సాగింది.

ఆ ఏడ్పుల శబ్దంలో గార్డ్సు లోనికి జొరబడ్డం ఎవరికీ విన్పించలేదు.

—: ఐపోయింది :—

# చిత్రమైన ఖైదు

## వసుంధర

ఇంటర్వ్యూ గదిలో చాలా మందే ఉన్నారు. ఉన్న వారిలో యువకులూ, యువతులూ కూడా ఉన్నారు. చూడ్డానికి అందరూ మిసమిసలాడి పోతున్నారు ఆరోగ్యంతో.

మొట్ట మొదటిసారిగా లోపలికి వెళ్ళివచ్చి నతన్ని చాలామంది చుట్టు ముట్టి—"ఏమడిగారు?" అన్నారు.

"నా బొందలా ఉంది ఇంటర్వ్యూ. నా గురించి, తలి దండ్రుల గురించి, చుట్టాల గురించి, సంసారం స్థితిగతుల గురించి అడిగారు. ఇంటిపేర్లు—కులం, గోత్రం - వగైరా ప్రశ్నలు చాలా వేశారు. జనరల్ నాలెడ్జికి సంబంధించి ఒక్క ప్రశ్న కూడా లేదు—"అని వెళ్ళిపోయాడతను.

అక్కడున్న అందరూ వెంటనే తమ బంధువులనూ, వారి ఇంటిపేర్లనూ, గోత్రాలనూ గుర్తు చేసుకోవడానికి ప్రయత్నించారు.

ఉమ నంబరు పదమూడు. కొంతమంది ఆ విషయమై ఆమెపై సానుభూతి చూపిస్తే-"నాకలాంటి నమ్మకాలు లేవు"-అని లోపలకు వెళ్ళింది.

లోపల ఓ యాభై ఏళ్ళాయన కూర్చున్నాడు. ఉమను చూస్తూనే పలకరింపుగా నవ్వి-ఆమె ఇంటిపేరు, కులం, గోత్రం-అడిగాడు. ఆమె చెప్పింది. ఆయన సంతృప్తిగా తలాడించి-"నీకు తలితండ్రులు లేరు కదూ-ఎవరిదగ్గ ఉంటున్నావు-?" అనడిగాడు.

"మా మామయ్యగారింట్లో ఉంటున్నాను. ఉద్యోగం దొరికితే వాళ్ళకు నాబాధ్యత చాలావరకూ తప్పుతుంది-" అంది ఉమ.

"నీకు మెడికల్ ఎగ్జామినేషన్ ఉంటుంది. రిపోర్టు సక్రమంగా ఉంటే నువ్వు సెలక్టయినట్లే-నెలకు ఆరు వందల జీతం-" అన్నాడా ముసలాయన.

"మెడికల్ ఎగ్జామినేషన్ ఎప్పుడు?" అంది ఉమ.

"ప్రిలిమనరీ ఇప్పుడే-" అంటూ ముసలాయన బల్లమీద గంట మోగించాడు. మెడలో స్టెతస్కోపు ఉన్న సుమారు నలభై అయిదేళ్ళ స్త్రీ వచ్చి ఆమెను లోపలకు తీసుకు వెళ్ళింది.

పది నిముషాల్లో ఉమ, లేడీ డాక్టరు తిరిగి వచ్చారు. లేడీ డాక్టరు అంతా తృప్తికరంగా ఉన్నట్లు ముసలాయనకు చెప్పి వెళ్ళిపోయింది.

ముసలాయన ఉమవైపు చూసి-"నువ్వు సెలక్టయ్యావు. ఈ సంగతి బయట మాత్రం చెప్పకు. మీ ఊరు వెళ్ళి విషయం మీ వాళ్ళకు చెప్పి తిరిగి నేను చెప్పిన చిరునామాకు తిరిగిరా"-అంటూ ఆయన ఆమెకో కాగితాన్ని

చ్చాడు. ఆ కాగితంమీద ఉమ ఉద్యోగానికి ఎక్కడ చేరవలసినదీ వివరాలున్నాయి.

ఉమ అక్కణ్ణించి కదలబోతూండగా—"పెళ్ళైన వాళ్ళి ఉద్యోగానికి పనికిరావు. ఉద్యోగమైనాక పెళ్ళి చేసుకోవచ్చును. ఉద్యోగంలో చేరే ముందు మళ్ళీ మెడికల్ ఎగ్జామినేషన్ ఉంటుంది. ఈ విషయం గుర్తుంచుకో—" అన్నాడు ముసలాయన.

ఉమ ఆయనకు నమస్కరించి అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

ఉమ వెళ్ళాక అయిదో నంబరు బలరామ్‌ది.

బలరామ్‌ని కూడా ఉమ నడిగినట్లే ప్రశ్నలడిగాడు ముసలాయన. అతని జవాబు లాయనకు సంతృప్తిని కలిగించాయి.

"నీకు తలిదండ్రులు లేరుగదా—మరెక్కడ ఉంటున్నావ్?"

"వారాలు చేసి చదువుకున్నాను నేను. స్నేహితుల ఆదరణతో బ్రతుకుతున్నాను—" అన్నాడు బలరామ్.

"ఉద్యోగమిస్తే వెంటనే వచ్చి చేరగలవా?"

"రెక్కలు కట్టుకుని వాలతానండి—"

ముసలాయన బల్లమీది గంట మ్రోగించాడు. మెడలో సైతస్కోపు వేసుకున్న ఓ నడియస్సుడక్కడికి వచ్చి, బలరాంని లోపల గదిలోకి తీసుకువెళ్ళి పది నిముషాల్లో తిరిగివచ్చి—అంతా సంతృప్తికరంగానే ఉన్నట్లు చెప్పాడు.

ముసలాయన డాక్టరు వెళ్ళిపోగానే—"నువ్వు సెలక్టయ్యావు నీ ఊరికి వెళ్ళి చెప్పవలసిన వాళ్ళకు చెప్పకుని సరాసరి నేను చెప్పిన అడ్రసుకు వచ్చేసి ఉద్యోగంలో

జాయిను కావాలి. ఆరంభంలో నెలకు ఆరువందలు. ఇష్టమేనా?" అన్నాడు.

"మీకుచాలాచాలా థాంక్స్..."అన్నాడు బలరాం.

"థాంక్స్ సంగతి అలా ఉంచు. ఆరోగ్యం నాకు చాలా ముఖ్యం. అనారోగ్యంగా ఉన్నవాళ్ళను నేను ద్యోగంలో ఉంచుకోను. నిన్నుద్యోగంలో జేర్చుకున్న రోజున మళ్ళీ మెడికల్ ఎగ్జామినేషన్ ఉంటుంది .." అన్నాడు ముసలాయన.

బలరాం ఉత్సాహంగా అక్కడ్నించి వెళ్ళిపోయాడు.

## 2

"వెరీగుడ్! చాలా ప్రాంప్టుగా వచ్చేశారు. ఆరోగ్యం కూడా బాగా మెయింటైన్ చేశారు" అన్నాడు ముసలాయన.

"ఇంటర్వ్యూ ఒక వూళ్ళో వుద్యోగం ఇంకోవూళ్ళో" అన్నాడు బలరాం నెమ్మదిగా. ఈ తంతంతా అతనికి ఆశ్చర్యంగా వుంది.

"మీవంటివాళ్ళకోసం నేను చాలా కాలంగా ప్రయత్నిస్తున్నాను. నాకు చాలా ముఖ్యమైన పని ఒకటి మీ కారణంగా జరగాలి" అన్నాడు ముసలాయన.

బలరాం, ఉమ ఒకరివంక ఒకరు ఆశ్చర్యంగా చూసుకున్నారు. ఆనాడు జరిగిన ఇంటర్వ్యూలో సెలక్టయినది తామిద్దరూ అన్నమాట.

ముసలాయన వాళ్ళిద్దరి ముందూ రెండు పుస్తకాలు పెట్టి ఇవి నా పద్దు పుస్తకాలు. వీటిలో కూడికల్లో ఎక్కడయినా తప్పులున్నాయేమో చూడండి..." అన్నాడు.

ఓ క్షణం ఆగి—"ఈ పూటకు ఇదే మీ డ్యూటీ—" అన్నాడు.

బలరాం, ఉమ ఇద్దరూ చెరో పుస్తకాన్నీ అందుకుని చూడ్డం మొదలు పెట్టారు. ప్రతి పేజీలోనూ కొన్ని అంకెలున్నాయి. చివర వాటిని కూడగా వచ్చిన సంఖ్య వుంది. ఇద్దరూ శ్రద్ధగా ఆ కూడికలు మళ్ళీ చేయసాగారు. అక్కడక్కడ కొన్ని పేజీలలో తప్పులున్నాయి.

ఆ పుస్తకం పూర్తిచేయడానికి బలరాంకి గంటన్నర పట్టింది. ఆ తర్వాత పదినిముషాల్లో ఉమ కూడా పని పూర్తి చేసింది. వాళ్ళు చెప్పిన తప్పొప్పుల వివరాలను ముసలాయన తన జేబులో వున్న కాగితంలో చూసి సరి పోల్చుకుని సంతృప్తిగా తలాడించి "మీకు పనిశ్రద్ధ బాగానే ఉన్నదనుకోవాలి. మీరిద్దరూ నాకు బాగా నచ్చారు" అన్నాడు.

కాసేపు విశ్రాంతి తీసుకోమని చెప్పి ముసలాయన ఆ గదిలోంచి వెళ్ళిపోయాడు. బలరాం, ఉమ ఇద్దరూ ఆ గదినే పరిశీలించి చూస్తున్నారు.

మామూలు డ్రాయింగు రూంలాగున్నది తప్పితే అదో ఆఫీసు గదిలా లేదు. ఇద్దరి మనసుల్లోనూ రకరకాల ప్రశ్నలు తిరుగుతున్నాయి-

ఈ ముసలాయన ఎవరు? తాము చేయదల్చుకున్న వుద్యోగం ఏమిటి? ఆ వుద్యోగానికీ తమ ఆరోగ్యానికీ సంబంధం ఏమిటి? ఉద్యోగంలోకి తీసుకునేముందాయన కులం గోత్రం అడిగాడు. వాటి ప్రాముఖ్యత ఏమిటి? ముందు ముందు ముసలాయన తమకెటువంటి బాధ్యతల నప్పగించబోతున్నాడు?

ఇద్దరి బుర్రల్లోనూ ఒకేరకం ప్రశ్నలు తిరుగుతున్న ప్పటికీ ఇద్దరూ ఒకరితో ఒకరు మాట్లాడుకోలేదు. విచిత్రంగా ఆ గదిని పరికిస్తూ ఏవేవో ఆలోచిస్తూ అలా కూర్చుండిపోయారు. వాళ్ళిద్దరూ కనీసం ఒకరికేసి ఒకరయినా ఆట్టే చూసుకోలేదు.

సుమారు గంట అనంతరం ముసలాయన లోపలకు వచ్చి "చాలా విచిత్రమైన మనుషుల్లా వున్నారే మీరు! నేను వచ్చేసరికి ఒకరితో ఒకరు మాట్లాడుకుంటారను కున్నాను" అన్నాడు.

ఇద్దరూ ఆ కున్ను చూస్తూ లేచి నిలబడ్డారు.

ముసలాయన తన డ్రాయరు సొరుగులాగి వాళ్ళిద్దరికీ రెండు ఆల్బమ్స్, ఒక పెద్ద కవరూ ఇచ్చి "దీన్నిండా ఫోటోలున్నాయి. కొన్ని ఆడవాళ్ళవి, కొన్ని మగవాళ్లవి వేరుచేసి ఒకరు ఆల్బంలో మగవాళ్ళ ఫోటోలూ, ఇంకొకళ్లు ఆడవాళ్ల ఫోటోలూ అంటించండి" అన్నాడు.

ఆ కవర్లో వున్నవన్నీ సినిమా యాక్టర్ల ఫోటోలు. ముసలాయన దగ్గర ఏమీ పనిలేదనీ, ఏదోవిధంగా తమను ఎంగేజ్ చేయడానికి ప్రయత్నిస్తున్నాడనీ ఇద్దరకూ అర్థమైంది. ఏదేమైనా చెప్పినపని చేయడం తమధర్మం కాబట్టి, ఇద్దరూ ఆ పని మొదలుపెట్టారు. అయితే వాళ్ళిద్దరూ ఒకరితో ఒకరు మాట్లాడుకోవడం లేదు. ఆల్బం పని పూర్తి కావడానికి సుమారు గంట పట్టింది.

"మీకు నీతినియమాలపైన నమ్మకముందా?" అనడిగాడు ముసలాయన.

బలరాం, ఉమ _ ఆయనవంక ఆశ్చర్యంగా చూశారు.

"యువతీ యువకుల విచ్చలవిడి జీవితంపై మీమీ

అభిప్రాయా లేమిటి?" ముసలాయన ఇంకో ప్రశ్న వేశాడు.

"నాకేమీ తెలియదు. ఇలాంటి విషయాల్లో అభిప్రాయాలు చెప్పే తెలివితేటలు నాకు లేవు" అన్నాడు బలరాం.

"మీ ప్రశ్నలు నాకు సరిగ్గా అర్థం కాలేదు..." అంది ఉమ.

ముసలాయన ఆమెవంక ఆశ్చర్యంగా చూశాడు. పదిహేడేళ్ళ ఉమ ముఖం చాలా అమాయకంగా కనబడుతోంది. ఆమె పక్క నిలబడ్డ ఇరవయ్యేళ్ళ బలరాం కళ్లలో చెప్పుకోదగ్గ అనుభవాలు కనబడ్డంలేదు.

"ఇంతకాలమూ జీవన పోరాటంలో వుండిపోయిన మీకు ఇతర విశేషాలమీద దృష్టి మళ్ళ లేదంటే పెద్ద ఆశ్చర్యం లేదు. కానీ మీరిప్పుడు సంపాదన పరుల య్యారు. జీవితమంటే ఆకలి, నిద్ర ఈ రెండే కాదని తెలుసుకోవడానికి ఎంతోసేపు పట్టదు మీకు" అన్నాడు ముసలాయన.

తర్వాత ఆయన ఒక ఫ్లాస్కులోంచి కాఫీ రెండు కప్పుల్లో పోసి ఇద్దరికీ ఇచ్చాడు. వాళ్ళు కాఫీ తాగుతూంటే ఆయన ఇద్దరివంకా చూస్తూ కూర్చున్నాడు.

కాఫీ తాగిన అయిదు నిముషాలకే బలరాం, ఉమ లిద్దరికీ నిద్ర ముంచుకు వచ్చేసింది. కూర్చున్నవాళ్ళు కూర్చున్నట్లుగా పడిపోయారు.

ముసలాయన ఇద్దర్నీ సమీపించి కదిపి చూసి సంతృప్తిగా తలాడించాడు.

# 3

అతను, ఆమె పార్కులో కూర్చుని ఉన్నారు. ఇద్దరి ముందూ కొంత సరంజామా వుంది. ఆ సరంజామాలో మూత విప్పిన క్యారియరు ఉంది. క్యారియర్లోంచి పూరీలు కనబడుతున్నాయి.

"ఇంక తినలేనండీ—ఆశగా చాలా పూరీలు తెచ్చుకున్నాం..." అందామె.

"అలా అంటే ఎలా శోభా-బాగా తింటేనేగా నీ ఆరోగ్యం బాగుపడుతుంది..." అన్నాడతను.

"నా ఆరోగ్యానికేంవచ్చిందండీ-దుక్కలాగున్నాను. ఏదో మనకు అదృష్టం లేదు..." అంది శోభ.

"పెళ్ళయిన అయిదేళ్ల తర్వాత మళ్ళీ వేస్తున్న ఈ హనీమూన్ ట్రిప్పు మనకు సహకరించగలదనుకుంటున్నాను" అన్నాడతను.

శోభ కళ్ళల్లో రవంత సిగ్గు కనిపించింది—"అవును మన పెళ్ళి జరిగి ఐదు సంవత్సరాలయింది..." అంటూ నిట్టూర్చింది.

"పూరీలు తినగలవో లేదో చెప్పు. లేకపోతే అవతల పారేద్దాం. ఏ కుక్కలో తింటాయి" అన్నాడతను.

"ఇంత ఖరీదుపెట్టి కొన్నవి కుక్కలపాలు కానివ్వడ మెందుకండీ-ఏ ముష్టివాడికయినా ఇస్తే ఆప్యాయంగా తింటాడు" అంది శోభ.

"సరే నీ ఇష్టం. నేను వెళ్ళి రెండు కూల్ డ్రింక్స్ తీసుకు వస్తాను" అంటూ అతను లేచి వెళ్ళాడు. శోభ చుట్టూ చూసింది. ఆమె దగ్గర్లోనే వున్న ఓ బికారి ఆమె నాకర్షించాడు.

"ఏయ్!" అంటూ చప్పట్లు కొట్టి పిలిచిందామె. బికారి ఆమెవైపు తిరిగాడు.

"పూరీలు తింటావా?" అడిగిందామె.

వద్దన్నట్లుగా తలాడించాడతను.

"ఎంగిలివి కాదు..." అందామె గట్టిగా.

అతను చటుక్కున లేచి ఆమెకు దగ్గరకు వచ్చి—"చాలా థాంక్స్. మంచి ఆకలిమీద వున్నాను..." అన్నాడు.

ఆమె అప్రయత్నంగా పూరీలున్న గిన్నెనూ, కూర గిన్నెనూ అతనికి అందించింది. అతని భావంలోని సంస్కారం ఆమెకు ఆశ్చర్యాన్ని కలిగించింది.

బికారి ఆ రెండు గిన్నెలూ అందుకుని అయిదు నిమిషాల్లో పూరీలన్నీ తినేసి "మీ గిన్నెలు ఎంగిలి చేశానని అన్యధా భావించకండి. ఇప్పుడే వీటిని శుభ్రంచేసి తీసుకు వస్తాను" అని దగ్గరలో వున్న కుళాయి దగ్గరకు వెళ్ళి ఆ రెండు గిన్నెలూ శుభ్రంగా కడిగి వెనక్కు తెచ్చాడు.

బికారి ఆమెకు నమస్కరించి-"మీలాంటి వాళ్ళను చూసినప్పుడల్లా నాకు కడుపునిండిపోతుంది. ఈ ప్రపంచం నిండా మీలాంటి వాళ్ళుండాలని నాకోరిక. కానీ దురదృష్ట వశాత్తూ ఈ ప్రపంచంలో దుర్మార్గులు చాలా ఎక్కువగా ఉన్నారు. ఎవరైనా వాళ్ళను ఏరేయడానికి ప్రయత్నించినా అది కేవలం ఉడతా భక్తి అవుతోంది-" అన్నాడు.

"ఈ ప్రపంచంలో అన్ని దుర్మార్గులకూ అవసరమే ముఖ్యకారణం. ఎంత మంచి వాళ్ళైనా అవసరం కోసం

ఎటువంటి దుర్మార్గునికైనా పాల్పడవచ్చు..." అని నిట్టూర్చింది శోభ..."ఆ విధంగా నేనూ మంచి దాన్ని కాదు."

"నేను నమ్మలేను. మనుషుల ముఖాన్ని చూసి, మాటలు విని వాళ్ళ బుద్ధుల్ని అంచనా వేయగలను. నన్ను ప్రత్యేకంగా పిలిచి గౌరవించిన ప్రతి ఒక్కరూ నావల్ల ఉపకారం పొందారు. ఈ రోజు మీరు నా మనసుకు కలిగించిన తృప్తి కారణంగా_మీరు తలపెట్టిన కార్యం విజయవంతమవుతుంది..." అన్నాడు బికారి.

"ఏదో మీ నోటిమాటవల్ల అలా జరిగితే..." అని ఆగింది శోభ.

"తప్పక జరుగుతుంది. ఒక సంవత్సరం తర్వాత మీ యింటికి మళ్ళీ వస్తాను. మీ చిరునామా చెప్పగలరా?" అన్నాడు బికారి.

శోభ చిరునామా చెప్పింది.

"ఇంకెవరైనా అయితే_నేను చిరునామా ఎందుకడిగానా అని లక్ష అనుమానాలు మనసులో పెట్టుకుని అడ్రసు చెప్పడానికి తటపటాయించేవారు. మీరు వెంటనే తడుముకోకుండా చెప్పడం మీ మంచి హృదయాన్ని తెలియజేస్తుంది. ఒక ఏడాది తర్వాత ఈ జోగినాథం మీ ఇంటికివచ్చి మీ ఆనందాన్ని కళ్ళారాచూసి వెడతాడు..." అన్నాడు బికారి.

"మీ పేరు జోగినాథమా?" అనడిగింది శోభ.

"అవును..." అని జోగినాథం ఉలిక్కిపడి_"అన్నట్లు మీ రిచ్చిన అడ్రసు నాకు తెలిసినదే_సుందరరామయ్యగారు మీ కేమవుతారు?" అనడిగాడు.

"ఆయన నా మామగారు. ఆయన మీకెలా తెలుసు?" అంది శోభ.

"అది నా దురదృష్టం-" అన్నాడు జోగినాథం- "నా వంటిమీద భౌతికమైన మురికి పేరుకుపోతుంద దానికి ఆయనే కారణం. మీ దృష్టిలో ఆయన ఎటువంటి వాడు? ఆయన కేదైనా అపకారం జరిగితే సహించ గలరా?"

"ఆయన దేవుడిలాంటివారు. ఆయన మీద ఈగ వాలినా సహించలేను..."

"ఆయన దేవుడిలాంటి వాడుకాడని తెలిస్తే...."

శోభ ఆశ్చర్యంగా అతనివంక చూసి-"మీరు నా మంచి తనాన్ని నమ్ముతున్నట్లే నేనూ ఆయన మంచి తనాన్ని నమ్ముతున్నాను. మీరు నా చెడ్డతనాన్ని నమ్మ కూడదని నిర్ణయించుకున్నట్లే నేనూ ఆయన చెడ్డతనాన్ని నమ్మకూడదని నిర్ణయించుకున్నాను...." అంది.

జోగినాథం తన జేబులోంచి ఒక ఫోటో తీసి ఆమెకు అందించి-"జాగ్రత్తగా చూసి చెప్పండి. ఈ ఫోటోలో వ్యక్తి ఎవరో తెలుసా?" అన్నాడు.

"ఈయనే నా మామగారు. ఇది మీ దగ్గర కెలా వచ్చింది?" అందిశోభ.

జోగినాథం చటుక్కున ఆ ఫోటోని అందుకుని జేబులో పెట్టుకున్నాడు-"మీరు సుందరరామయ్యగారి కోడలు కాకపోతే ఎంత బాగుండేది? పోనీ ఈ ఫోటోలో వ్యక్తి సుందరరామయ్య కాకపోయినా ఎంత బాగుండేది?" అంటూ గొణుక్కుంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

# 4

బలరాం కళ్ళు తెరిచి చూశాడు. వెంటనే అతనికి ఏమీ తెలియలేదు. కళ్ళు నులుముకుని మళ్ళీ చుట్టూ చూశాడు.

గది విశాలంగా ఉంది. ఎక్కడా దుమ్ములాంటివి కనబడడంలేదు. గదిలో కూర్చునేందుకు రెండు కుర్చీలున్నాయి. వాటి ముందు ఓ బల్ల ఉంది. ఓ మూలగా వంట చేసుకునేందుకు వీలుగా స్టవ్ ఉంది. గదిలో ఓ పెద్ద వాష్ బేసిన్ ఉంది. ఇంకో మూలగా స్నానం చేయడానికి షవర్ ఉంది. దాని పక్కనే లెట్రిన్ ఏర్పాట్లు ఉన్నాయి. అయితే ఎక్కడా మనుగులేదు.

బలరాం జరిగినది గుర్తు చేసుకునేందుకు ప్రయత్నిస్తున్నాడు. ఎంత ఆలోచించినా అతనికి ముసలాయన కాఫీ ఇవ్వడంవరకు మాత్రమే గుర్తుంది. తర్వాతేం జరిగిందో గుర్తుకు రావడంలేదు.

బలరాం పక్కమీంచి లేచాడు. ముసలాయనే తనకీ గది ఏర్పాటుచేసి వుంటాడని అతనికి అనిపించింది. అతను వాష్‌బేసిన్ వద్దకు నడిచాడు. అక్కడ బ్రష్షు, పేస్టూ వున్నాయి. ముఖ ప్రక్షాళనం కావించుకున్నాడు. అక్కడ్నించి బల్లదగ్గరకు వెళ్ళాడు. బల్లమీద పేపరు వెయిట్ క్రింద ఓ కాగితం వుంది.

"నీకు అన్ని సదుపాయాలూ వుంటాయి. వాష్‌బేసిన్‌కు తిన్నగా నిలబడితే కుడిపక్కన వున్న గోడ మధ్యలో చిన్న మీట వుంది. అది నొక్కి చూడు" అని రాసి వుందా కాగితం మీద.

బలరాంకి ఓ క్షణంపాటు ఏమీ అర్థం కాకపోయినా తర్వాత పరిస్థితి అర్థమైంది. అతను పరుగులాంటి నడ

కతో కాగితంలో సూచించబడిన చోటకు వెళ్ళి మీటను గుర్తించి నొక్కాడు. వెంటనే గోడలోంచి తలుపులు తెరుచుకున్నాయి. బలరాం ఆశ్చర్యంగా పరికించాడు.

అక్కడ అలమారావిధంగా వుంది. ఒక అరలో ప్లేటు, ప్లేట్లో ఇడ్లీలు, చట్నీ ఉన్నాయి. పక్కనే ఓ ఫ్లాస్కు వుంది. ఫ్లాస్కు పక్కన కప్పు, సాసరు వున్నాయి. సాసరుకింద ఓ కాగితం వుంది.

“అలమారాలోంచి నీకు కావలసినవన్నీ వెంటనే తీసుకో. ఈ తలుపులు అయిదు నిముషాలకు మించి తెరుచుకుని వుండవు. సూచించబడిన టైములో కాక మిగతా సమయాల్లో నీవు మీట నొక్కినా ఈ తలుపులు తెరుచుకోవు. తిరిగి పన్నెండు గంటలకు మీట నొక్కు” అని రాసి వుంది ఆ కాగితం మీద.

బలరాంకి విచిత్రంగా అనిపించింది. అతను తొందరగా అలమారాలోవన్నీ తీసేసుకున్నాడు. తర్వాత వాటంతటవే బీరువా తలుపులు మూసుకుపోయాయి. బలరాం అప్రయత్నంగా టైము చూసుకున్నాడు. ఏడు గంటలయింది.

ఇడ్లీలు ఆవిర్లు కక్కుతున్నాయి. చట్నీ చాలా రుచిగా వుంది. ఆవురావురుమంటూ తినేశాడు బలరాం. తర్వాత అతను ఫ్లాస్కు మూత తీశాడు. అందులో కాఫీ లేదు. చిక్కటి తీయటి పాలున్నాయి. ఆ పాలు తాగేసరికి బలరాంకి చాలా బలం వచ్చింది.

ఇప్పుడతను తనున్న పరిస్థితుల గురించి తెలుసుకునేందుకు ప్రయత్నిస్తున్నాడు. గదిలోకి తనకు టిఫిన్ అందిన పద్ధతినిబట్టి చూస్తే గదిలోంచి బయటకు వేరే మార్గమున్నట్లు లేదు. ఏదయినా మార్గముంటే ఆ బీరువా

ద్వారానే వుండాలి. ఇడ్లీలు చాలా వేడిగా వున్నాయి, కాబట్టి అక్కడ పెట్టి ఎంతో కాలమయుండదు అని అత ననుకున్నాడు.

ఒకటి రెండు పర్యాయాలు ఆ గోడలోని మీటనొక్కి చూశాడు. కానీ ఏమీ కాలేదు.

బలరాం శుభ్రంగా స్నానం చేశాడు. షవర్ లోంచి నీళ్ళు వస్తున్నాయి. తుడుచుకుందుకు తువ్వాలుంది. కట్టు కుందుకు మంచి బట్టలున్నాయి. ఘుమఘుమలాడే సెంట్స్, పౌడర్స్ వున్నాయి.

స్నానంచేసి అక్కడున్న సదుపాయాలన్నీ ఉపయోగించుకునేసరికి బలరాం శరీరంలో కొత్త వుత్సాహం చోటుచేసుకొంది. అతను గదిలోంచి బయటకు వెళ్ళడానికేమైనా మార్గాలున్నాయేమో చూడసాగాడు.

పన్నెండు గంటలవరకూ అతను చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. పన్నెండు గంటలకు గోడమధ్య మీట నొక్కాడు.

బీరువాలో వేడి వేడి విందుభోజనం, సమస్త సదుపాయాలతో సిద్ధంగా వుంది. మారాలోచన మాని అతను ఆ భోజనం బయటకు తీసుకుని తృప్తిగా ఆరగించాడు.

అందులో వున్న సమాచారం ప్రకారం అతను తిరిగి నాలుగు గంటలకు ఆ గోడలోని మీట నొక్కవలసి వుంటుంది. ఏకారణంవల్లనయినా అతనా విషయం అద మరిస్తే గదిలో కాలింగ్ బెల్ వంటిది వినబడి అతన్ని హెచ్చరిస్తుంది.

బలరాంకిదంతా విచిత్రంగా వుంది. ఉద్యోగం పేరుతో తనను చేరదీసిన ముసలాయన తననిలా ఎందుకు బంధించాడు? తననుండి ఆయన ఆశిస్తున్న ప్రయోజన మేమిటి?

కాలింగ్ బెల్ మ్రోగుతుందో లేదో తెలుసుకోవడం కోసం బలరాం కైము నాలుగయినా గోడలోని మీట నొక్కలేదు.

పది నిమిషాల అనంతరం కాలింగ్ బెల్ మ్రోగింది.

నిద్రపోతున్నవాడికి కూడా మెలకువ తెప్పించగల శబ్దమది.

బలరాంకో అయిడియా వచ్చింది. బీరువానుంచి తప్పకుండా బయటకు దారి వుండి వుండాలి. ఈ పర్యాయం బీరువా తెరుచుకున్నప్పుడు తాను అందులో దూరితే!

ఈ అభిప్రాయంతో అతను ఈ పర్యాయం బీరువా తెరుచుకోగానే అందులోకి దూరాలని ప్రయత్నించాడు. చిన్న చిన్న అరలు కాబట్టి ఒక మనిషి అందులో దూరడం కష్టమే. అదీకాక అతను కొద్దిగా లోపలికి చేయి పెట్టి చటుక్కున వెనక్కు తీసేసుకున్నాడు. బీరువాలో అతనికి సరఫరా చేయబడే వస్తువులు కర్ర షేలలో వుంచబడుతున్నాయికానీ బీరువా అరలలోంచి కరెంట్ ప్రవహిస్తోంది.

నాలుగు గంటలకు తెరుచుకున్న బీరువాలో తినుబండారాలున్నాయి. మిక్స్చర్, వేయించిన శనగపప్పు, ఉప్పు అద్దిన వేరుశనక్కాయలు వగైరాలు. బలరాం అవి తీసుకున్నాడు కానీ ఈ పర్యాయం అతనికంత ఉత్సాహంగా అనిపించలేదు.

ఏమిటి జరుగుతోంది? ఎందుకు జరుగుతోంది? ఈ జైలు జీవితం తనకు ఎన్నాళ్ళు?

ఈసారి బీరువాలో మళ్ళీ ఎన్నింటికి తలుపులు తెరుచుకుంటాయో వివరించే కాగితం లేదు. బహుశా కాలింగ్ బెల్ ద్వారా ఆ విషయం తెలియబర్చవచ్చునని ముసలాయన అనుకున్నాడేమో!

బలరాం మళ్ళీ తీవ్రంగా పరిశోధించసాగాడు. అతనలా శోధించగా శోధించగా ఓ చిన్న విచిత్రం కనబడింది.

వాష్ బేసిన్ వున్న గోడకు మధ్యలో ఓ మీట గోడ రంగులో కలిసిపోయి వుంది. ఏదో వింత జరక్కపోదన్న ఆశతో బలరాం ఆ మీటను నొక్కాడు.

అది నొక్కిన వెంటనే గదిలో శ్రావ్యమైన సంగీతం వినిపించసాగింది.

ఆ సంగీతం అతను మళ్ళీ మీటను నొక్కే వరకూ వినబడుతూనే ఉంది. బలరాంకు చాలా నిరుత్సాహం కలిగింది.

## 5

బలరాంకి చాలా విసుగ్గా వుంది.

అతనాగదిలోకి వెళ్ళి నాలుగు రోజులయింది. పుష్టికరమైన ఆహారం అతనికి అందుతోంది. కానీ ఏ పనీ లేదు.

అతని జీవితం నాలుగు గోడలకూ అంకితమైపోయింది. ఎవ్వరూ అతనితో మాట్లాడరు. అసలు ఇంకో మనిషే తనకు కనుపించరు. ఎప్పుడే పాపం చేశాడో కానీ ఇప్పుడీ ఖైదు జీవితం లభించింది.

అయిదో రోజున బలరాం మళ్ళీ తన ప్రయత్నాలలో తానుండగా బీరువా గోడకు ఎదురుగా వున్న గోడలో ఓ మీట కనుక్కోగలిగాడు. అంతకాలం అదతని కళ్ళబడకపోవడం ఆశ్చర్యమే! ఎందుకంటే గోడమీద మొత్తం ఎనిమిది ఆకుపచ్చ చుక్కలున్నాయి. వాటిలో ఏడు రంగుతో పెట్టిన చుక్కలు. ఒకటి మాత్రం మీట!

బలరాం మీటను నొక్కగానే ఆ గోడ భూమిలోకి దిగిపోసాగింది.

ఆ గోడ అలా భూమిలోకి దిగిపోతూంటే అతను ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డాడు. రెండు నిముషాల్లో గోడ పూర్తిగా భూమిలోనికి దిగిపోయింది. నేలమీద అసలు గోడ వుండన్న ఆనమాలు కూడా లేదు.

అంతసేపూ బలరాం దృష్టి గోడతోపాటే కదుల్తోంది. అప్పుడే అతను గోడకవతల ఏముందీ అని చూశాడు. అటు చూడగానే అతనికి ఏడవాలో నవ్వాలో తెలియ లేదు.

అతనుంటున్నలాంటిదే ఇంకో గది అది. అన్నివిధాలా తన గదితో సరిపోలి వుంది. బయటకంటూ దారి వున్నట్లు లేదు. ఆ గదిలో కూడా నేలమీద ఓ పరుపు వుంది. ఆ పరుపు మీద...

బలరాంకు దానిమీద ఎవరో పడుకుని వున్నారని అనుమానం వచ్చింది. అతను చటుక్కున అటువైపుకు నడిచాడు.

అతను నాలుగడుగులు వేశాడో లేదో గదిలోని గోడ మళ్ళీ భూమిలోంచి మొలుచుకు వచ్చింది. అతను చటు క్కున వెనక్కు తిరిగేసరికి గోడ యధాప్రకారంగా అయిపోయింది.

ఒక గదిలోంచి ఇంకో గదిలోకి మారటం మినహా అతను చేసినదేమీ లేదని తెలియడమేకాక, ఇది ఎవరో కావాలని చేసిన పని అని కూడా అతనికి అనుమానం వచ్చింది.

గోడ మళ్ళీ మొలిచిన ఆశ్చర్యంకంటే పరుపు మీద వున్న వ్యక్తిని చూడాలన్న కుతూహలం బలరాం నెక్కు వగా ఆవహించింది. అందుకే అతను నాలుగు అంగల్లో పరుపును చేరాడు. ఆ మనిషి ఎవరోకానీ నిండా దుప్పటి ముసుగులా కప్పుకుని వున్నాడు.

బలరాం కొద్దిక్షణాలు తటపటాయించి—ఆ మనిషి కప్పుకున్న దుప్పటిని తొలగించి ఆశ్చర్యపడ్డాడు.

ఆ మనిషి...ఉమ!

అతను దుప్పటి లాగగానే ఉమకు కూడా మెలకువ వచ్చి చటుక్కున లేచి కూర్చుంది. బలరాంను చూడ గానే ఆమె కళ్ళల్లో కనబడ్డ ఆశ్చర్య మింతా అంతా కాదు.

ఓ అయిదు నిమిషాలు మాత్రమే ఆశ్చర్యం సృష్టించిన మౌనం ఆ గదిలో రాజ్యమేలింది. తర్వాత బలరాం తన సంగతి చెప్పాడు. ఉమ చెప్పినది విన్నాక ఆమె కూడా తనకువలెనే సకల సౌకర్యాలతో ఖైదు జీవితాన్ని నాలుగు రోజులుగా అనుభవిస్తున్నదని అతనికి అర్థమైంది.

"ఒంటరితనం చాలా బోరుగా వుంది. మనమిద్దరం కలుసుకోవడం ఒకవిధంగా మంచిదే. కనీసం కాలక్షేప మయినా అవుతుంది..." అన్నాడు బలరాం.

"నాకు ఒంటరితనమంటే చాలా ఇష్టం. నేనొక్క ర్తినీ వున్నప్పుడు ఇంకొకరు తోడుగా వుండడం అందు లోనూ మగవాడు...నాకస్సలు ఇష్టముండదు. నీ గది లోకి నువ్వెళ్ళిపో..." అంది ఉమ.

బలరాం దెబ్బతిన్నాడు. నాలుగు రోజుల తర్వాత కనబడ్డ మనిషి తననిలా అంటుందని అతనూహించలేదు. అతని అహం దెబ్బతింది.

బలరాం వెంటనే గోడ దగ్గరకు వెళ్ళి మీట కోసం అన్వేషించసాగాడు. అతనెంత ప్రయత్నించినా మీట వంటిది ఏమీ కనబడలేదు.

"నన్ను మన్నించాలి...గోడను ఎలా తప్పించాలో నాకు తెలియడంలేదు" అన్నాడు బలరాం.

"వచ్చినవాడికి దారి తెలీకుండా వుంటుందా?" అంది ఉమ.

"నీకు అనుమానంగా వుంటే నువ్వే ప్రయత్నించు" అన్నాడు బలరాం.

ఉమ గోడ దగ్గరకు వెళ్ళి తనూ ప్రయత్నించి "అడ దాన్ని — నాలుగు రోజులుగా ప్రయత్నిస్తూ కూడా ఏమీ తెలుసుకోలేకపోయాను. ఆ విషయం నీకూ తెలుసు. తిరిగి వెళ్ళడానికి నీకు దారి తెలిసే ఉంటుంది. ఇందులో నీ కుతంత్రం ఏదో వుంది" అంది.

"ఏమైనా సహించగలను కానీ అపవాదును మాత్రం సహించలేను. నీకు నామీద అనుమానంగా వుంటే ఏం చేయమంటే అది చేస్తాను. పీక నొక్కుకొని ప్రాణాలు తీసుకోమంటావా?"

ఉమ నిరసనగా అతని వంక చూసి "నీ ప్రాణాలు తీసుకోనక్కరలేదు. నా జోలికి వచ్చి నా ప్రాణాలు తీయకుండా వుంటే చాలు" అంది.

బలరాం ఇంక ఆమెతో ఏమీ మాట్లాడదలుచుకో లేదు. అతని ఉత్సాహమంతా చచ్చిపోయింది. ఇంత కంటే ఆ గదిలో ఒక్కడూ వేరే వుండి వుంటేనే బాగుండేదని అనుకున్నాడతను.

# 6

సాయంత్రం నాలుగు గంటలకు గదిలో కాలింగ్ బెల్ మ్రోగింది.

ఉమ పరుగున వెళ్ళి ఆ గదిలోని బీరువా తెరిచి చూసి వులిక్కిపడింది.

బీరువాలో తినుబండారాలేమీ లేవు. వంకాయలు బియ్యం, చింతపండు, మిర్చి వగైరా పోపుసామాను

అవసరమైన గిన్నెలు, చాకు అందులో వున్నాయి. గబ గబా అవన్నీ బయటకు తీసింది. బీరువా తలుపులు వేసు కున్నాయి.

బలరాం కూడా కుతూహలంగా అక్కడకు వెళ్ళి అన్నీ చూశాడు. "వంట చేసుకోవాలన్నమాట! పోనీ ఈ గదిలో అదీ ఒక కాలక్షేపమే!" అన్నాడు అప్ర యత్నంగా.

ఉమ అతని వంక ఉరిమి చూసి - "వంట నాకు చాలా బోరు" అంది.

"నాకు ఆకలి ఎక్కువ. ఎలా చెయ్యాలో చెప్పు వంట నే చేస్తాను" అన్నాడు బలరాం.

కాసేపు వాదించుకున్నాక ఇద్దరూ కలిసి వంట చేయ డానికి నిశ్చయించుకున్నారు. బలరాం వంకాయలు తరి గాడు. మిరపకాయలు గిల్లాడు. ఆమె అందించమన్నవన్నీ అందించి "ఉద్యోగం వచ్చినా నాకీ సేవలు తప్పలేదు. వారాలు చేసుకునేటప్పుడిలాగే ఆడవాళ్ళకు పనులు చేసిపెట్టేవాణ్ని" అన్నాడు. ఉమ మాట్లాడలేదు.

వంకాయకూర, అన్నం, చారు, పెరుగులతో ఇద్దరూ సుష్టుగా భోజనం చేశారు. పెరుగు అన్నం తిన్నాక "రేపొద్దున్న పెళ్ళి చేసుకున్నాక ఎక్కడైనా ఇలాంటి సదుపాయాలతో ఇలాంటి గదే దొరికితే ఎంత బాగుం టుంది?" అన్నాడు బలరాం.

"ఈ గదిలో మనమిద్దరమూ వుండగా పెళ్ళి అనే మాట నా చెవుల పడనివ్వకూడదు. అసలిదంతా నువ్వు పన్నిన కుతంత్రమని నాకు అనుమానంగా వుంది. జీవితం మీద నాకు చాలా ఆశలున్నాయి" అని కళ్ళొత్తుకుంది ఉమ. తన ఆశలన్నీ భగ్నమైపోతాయేమోనన్న భయం ఆమె కంఠంలో ధ్వనించింది.

"మాటి మాటికీ అనుమానించి నన్ను చిన్నబుచ్చ వద్దు. నా మంచితనం నీకే ముందు ముందు అర్థం కాగలదు..." అన్నాడు బలరాం. నిజం చెప్పాలంటే ఆమె కళ్ళు తుడవాలని అతనికి అనిపించింది.

ఎవరి కంచాలు వాళ్ళు కడుక్కున్నారు. ఒకరికొకరు సాయపడగా గిన్నెలు కడుక్కున్నారు. ఉమ ప్రోత్సాహము లభించకపోవడంవల్ల బలరాం ఆట్టే ఎక్కువగా మాట్లాడలేదు. నిద్ర సమయంలో మాత్రం ఇద్దరూ మాటాడుకోవలసి వచ్చింది.

ఉన్నదొకటే పరుపు. ఒక్కటే దుప్పటి. గదిలో కాస్త చలిగానే వుంటోంది.

"నేను క్రింద పడుకుంటాను. చిన్నప్పట్నించి అల వాటే!" అంది ఉమ.

"నాకూ క్రిందనే అలవాటు. ఆడవాళ్ళ శరీరాలు కోమలంగా ఉంటాయి. నువ్వు పరుపుమీద పడుకో" అన్నాడు బలరాం.

"అనుమానించ వద్దంటూనే నీ బుద్ధి అనుక్షణం బైట పెట్టుకుంటున్నావు. పడుకునేటప్పుడు ఆడవాళ్ళ శరీరాల గురించి ఆలోచించవలసిన అవసరమేముంది?" అంది ఉమ.

బలరాం ఆమెతో మాట్లాడదల్చుకోలేదు. ఆమెది చిన్నతనం కావచ్చు. అతను కూడా వయసులో ఆమె కంటే ఎంతో పెద్దకాదు. అతను చలి అనిపిస్తున్నా పరుపు పక్క క్రిందనే పడుకున్నాడు. ఉమ పరుపుకు అవతలపక్క క్రిందగా పడుకుంది. ఇద్దరూ పరుపును వదిలిపెట్టి క్రిందనే పడుకున్నారు.

ఉమకు త్వరగానే నిద్ర పట్టినట్లుందికాని బలరాంకి

ఓ పట్టాన నిద్ర రావడంలేదు. అతని మనసు పరిపరి విధాల పోతోంది.

ఈ పరిస్థితుల్లో ఉమ తనకు సహకరించి తనతో స్నేహంగా వున్నట్లయితే ఈ గదిలో రోజులు క్షణాల్లా గడిచిపోయుండేవి. కానీ తనకా అదృష్టం లేదు. ఎంత ప్రయత్నించినా నిద్ర రావడంలేదు. అదుపు తప్పుతున్న మనసు, నేలమీద చలి...

బలరాం చాలా సేపటికి తెగించి ఉమవైపు చూశాడు. ఆమె ముఖం అటువైపు తిప్పి పడుకుని వుంది. కదలిక లేదుకాబట్టి నిద్ర పోతోందనే అనుకోవాలి. పరుపు మాత్రం ఖాళీగా వుంది.

బలరాం తన పడక పరుపు మీదకు మార్చాడు. నెమ్మదిగా దొర్లుకుంటూ వెళ్ళి ఉమమీద చేయివేశాడు. ఆమె కదలలేదు. నెమ్మదిగా చేతిని ఆమె బుగ్గలమీదకు పోనిచ్చాడు. మృదువుగా వున్న ఆమె చెక్కిళ్ళు తగులుతూంటే అతనికి ఏదోలా అనిపించింది.

అంతలోనే ఉమ చటుక్కున లేచి కూర్చుని "నేననుకుంటూనే వున్నాను, నీ బుద్ధి తిన్నగా వుండదని..." అంది. బలరాం వులిక్కిపడి ఏదో అనేలోగానే ఉమ బ్యావుమని ఏడ్చేసింది.

ఆమె అలా ఏడుస్తూంటే బలరాంకు భయం కూడా వేసింది. "నన్ను మన్నించు ఉమా!" అన్నాడు.

"నీతో ఈ గదిలో ఎన్ని పగళ్ళు, ఎన్ని రాత్రుళ్ళు గడపాలో__ఇంకోసారి నన్నలా ముట్టుకున్నావంటే నేను చచ్చిపోతాను" అంది ఉమ.

బలరాం మాట్లాడకుండా నిద్రకు ఉపక్రమించాడు. ముత్తంమీద తెల్లవారుఝామున అతనికి నిద్ర పట్టింది. లేచేసరికి బాగా ఆలస్యమైంది.

"కాఫీ సిద్ధంగా వుంది. ముఖం కడుక్కో!" అంది ఉమ. ఆమె మాట కాస్త ప్రసన్నంగా ఉండడం చూసి బలరాం కాస్త తృప్తిపడ్డాడు.

సమస్య మళ్ళీ స్నానం చేయడం దగ్గర వచ్చింది. గదిలో మరుగులేదు.

"నేను స్నానం చేయను" అంది ఉమ.

"నా గురించి నువ్వు ఎన్నని మానేయగలవు? నేను కళ్ళు మూసుకుంటానులే..." అన్నాడు బలరాం.

ఉమ ఓ రెండు క్షణాలు ఆలోచించి—"అలా కుర్చీలో కూర్చో!" అంది.

బలరాం కూర్చోగానే ఉమ అతన్ని కుర్చీకి గట్టిగా కట్టేసి–కుర్చీని మరోవైపుగా తిప్పింది. ఎందుకయినా మంచిదని అతని కళ్ళకు గంతలుకూడాకట్టి "అమ్మయ్య!" అని నిట్టూర్చింది.

అతన్నా స్థితిలో వుంచినాకనే స్నానాదికృత్యాలన్నీ ఆమె నిశ్చింతగా ముగించగలిగింది. బట్టలు మార్చుకుని వచ్చేక "నీకు తృప్తిగా వుందా?" అన్నాడు బలరాం.

"నీకు గంతలు సరిగా కట్టలేదనీ, పక్క చూపులు చూస్తున్నావనీ నాకు అనుమానంగా వుంది. సరిగా స్నానం చేయలేకపోయాను" అంది ఉమ.

"నీ కర్మ—నువ్వో నిత్యశంకితురాలివి" అని అతనంటూ వుండగా ఆమె అతని కట్లు విప్పింది.

"నన్ను నమ్మడానికి రెండు కారణాలు చాలు..." అన్నాడు బలరాం.

"ఏమిటవి?" అంది ఉమ

"నువ్వు నన్ను కట్లు కడుతూ వుంటే వూరుకున్నాను. మళ్ళీ నా కట్లు విప్పుతావని గ్యారంటీ యేమిటి? ఐనా

నీ బాధ తెలిసినవాడ్ని కాబట్టి అంగీకరించాను. రెండవ కారణం ఏమిటంటే...'' అని క్షణం తటపటాయించాడు బలరాం.

"అదీ చెప్పు'' అంది ఉమ.

"నిన్నిపళంగా ఇలా బలంగా కౌగలించుకుంటే నన్నడ్డేదెవ్వరు?''అంటూ చటుక్కున ఆమెను కౌగలించుకున్నాడు బలరాం. తెల్లబోయిన ఉమ కౌగిలినుంచి విడిపించుకునే ప్రయత్నం చేయడానికి కొద్ది నిముషాలు పట్టింది. ఆ ఆలశ్యంలోనే తన శరీరం తనకు ఎదురు తిరుగుతోందని ఆమె పసిగట్టింది. ఆమె బలంగా బలరాంని తోసివేసింది.

బలరాం వెనక్కి పడిపోబోయి నిలదొక్కుకుని "ఉమా! ఇక్కడ మనం ఇలా ఎన్నాళ్లుండాలో తెలియదు. నేను నిన్ను తప్పక పెళ్ళి చేసుకుంటాను. ఈ ఖైదుజీవితంలో నువ్వున్నావన్న వూహ ఒకటే నా కానందాన్నిస్తోంది. ఆ ఆనందాన్నించి నన్ను దూరం చేయకు. నన్ను కరుణించు'' అన్నాడు.

"నిన్ను పెళ్ళి చేసుకుంటానో లేదో నాకు తెలియదు కానీ పెళ్ళికాకుండా మాత్రం నేను మగవాడికి లొంగను. ఇంకోసారి ఇలాంటి పని జరిగితే గ్యాస్ స్టవ్వుందికదా- చీరకు నిప్పంటించుకుని చచ్చిపోతాను'' అంది ఉమ.

ఆమె సామాన్యురాలు కాదని బలరాంకు అర్థమైంది. ఆమెను ఎలా లొంగదీసుకోవాలా అని అతను ఆలోచిస్తున్నాడు.

అయితే ఆ రోజు మధ్యాహ్నం పన్నెండు గంటలకు బీరువా తలుపులు తెరిచి వచ్చేక ఉమ పరుగున వెళ్ళి బల్లరాంను కౌగలించుకొంది. ఊహించని ఈ పరిణా

మానికి బలరాం ఆనందపడుతూ ఆమెను బలంగా హత్తుకున్నాడు. నెమ్మదిగా ఉమ అతని చేతికో చీటీ అందించింది.

"ఈ రోజునుంచి లెక్క పెట్టుకుంటే మీ ఇద్దరి జీవిత కాలం సరిగ్గా పదిరోజులు."

ఆ కాగితంలో వ్రాసివున్న వాక్యమిది. ఆ క్షణంలో బలరాంకు ఆ వాక్యమంత భయంకరంగా తోచలేదు. "ఉమా! నువ్విలా నా చేతుల్లో వుంటే నేనీక్షణంలో చనిపోవడానికయినా సిద్ధమే" అంటూ అదురుతున్న ఆమె పెదాలపై ముద్దు పెట్టుకున్నాడు.

# 7

"బలరాం!" అంది ఉమ.

"ఊఁ" అన్నాడు బలరాం.

"హెచ్చరిక ప్రకారం పదోరోజు ఈ వేళ..."

"అవును..." అన్నాడు నిర్లిప్తంగా బలరాం.

"అలా నిర్లిప్తంగా వుంటావేం? నాకు చావాలని లేదు. మనమిద్దరం యిక్కడ్నించి బయటపడే ఏర్పాటు చూడు. తర్వాత ఇద్దరమూ పెళ్ళి చేసుకొని..."

"పెళ్ళా? ఒకవేళ నేను నిన్ను మోసం చేస్తే..." అన్నాడు బలరాం.

"చెయ్యలేవు. చేస్తే నేను నిన్ను చంపేసి నన్ను చంపుకుంటాను" అంది ఉమ.

బలరాం నవ్వి "నేను నిన్ను మోసంచేస్తే ప్రతిఫలంగా ఇద్దరం చస్తాం. అంతేగదా — నేను నిన్ను మోసం చేశాననుకుని ఇద్దరి చావుకూ సిధపడు. ఇక్కడ మనలను రక్షించగలవారెవ్వరూ లేరు...?" అన్నాడు.

"నేను నిన్నే నమ్ముకున్నాను. నీకు సర్వస్వం అర్పించు

కున్నాను. నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను. నువ్వు నన్ను రక్షించాలి'' అంది ఉమ. ఆమెకు ఏడుపు వస్తోంది.

''కొద్దిరోజుల క్రితం నేను నిన్ను వేడుకున్నాను. నువ్వు నిర్లక్ష్యంగా వుండేదానివి. ఇప్పుడు నువ్వు నన్ను వేడుకుంటున్నావు. నేను నిర్లక్ష్యంగా వుంటున్నాను. ఆడదానికీ మగవాడికీ ఇక్కడే తేడా. ఒకసారి లొంగే వరకూ ఆడది ఎంత నిర్లక్ష్యంగానయినా వుండగలుగుతుంది. కానీ ఒకసారి లొంగిందో తర్వాత నిర్లక్ష్యమంతా మగాడిది. అయితే యిప్పుడు మనిద్దరి విషయంలో ఒక తేడా వుంది. నేను నిన్ను కోరినప్పుడు నా కోరిక నువ్వు తీర్చగలిగే స్థితిలో వున్నావు. ఇప్పుడు మాత్రం నేను నీ కోరిక తీర్చగల స్థితిలో లేను. నన్ను నేను రక్షించుకో గలిగినప్పుడు కదా నిన్ను రక్షించే ప్రసక్తి వస్తుంది...'' అన్నాడు బలరాం.

''అయితే మనకు చావు తప్పదంటావా?''

''ఉమా — ఈ గదిలో బంధించబడిన క్షణం నుంచీ వంటరితనంనుంచి తప్పించుకోవాలని ఎంతో కోరుకు న్నాను. నీ సమక్షంలో నన్నా బాధ వదిలిపెట్టింది. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. చివరి క్షణంవరకూ నిన్ను రక్షించడానికి నా చేతనయినది చేస్తాను. కాని పిరికి వాళ్ళలా చావంటే భయపడుతూండడం నాకిష్టం లేదు. జరగనున్నదెలాగా జరుగుతుంది. నాకు దగ్గరగా ఈ పరుపు మీద ఒకరిపక్క ఒకరు సర్వం మరచిపోదాం. మన లోకం మనది. ఇతరులతో మనకు నిమిత్తంలేదు. మరో ఆలోచన మనకు వద్దు'' అన్నాడు బలరాం.

ఉమ అతనికి దగ్గరగా జరిగి ''మననెవ్వరూ ఏమీ చేయలేరు. ఆఖరికి ఆ దేవుడు కూడా'' అంది. బలరాం ఆమెను బలంగా హత్తుకున్నాడు.

సాయంత్రం నాలుగు గంటలు దాటేక కాబోలు ఆ గదిలో కాలింగ్ బెల్ మ్రోగింది.

# 8

ఒక మనిషి సముద్రంవైపు వెడుతున్నాడు.

జోగినాథం కొద్దిక్షణాలతన్ని పరిశీలించేక___అతడు సముద్రంలోకి ఆగకుండా నడుస్తున్నాడని గ్రహించి ఒక్క వుదుటున లేచి పరుగెత్తాడు. ఆ మనిషిని అందుకుని రెక్క పట్టుకుని ఒడ్డుకు లాక్కొచ్చి "ఏమిటి నువ్వు చేయబోయింది?" అన్నాడు.

ఆ వ్యక్తి జోగినాథం వంక చిరాగ్గా చూసి "ఎవరు మీరు? ఈ నిర్జనప్రాంతంలోకెక్కడావచ్చి నాప్రాణాలు రక్షించారు?" అన్నాడు.

"నేను భగవంతుడి ప్రతినిధిని. ఎలాంటివారి కష్టాలనయినా తీర్చగలను. నువ్వెందుకు ఆత్మహత్యకు తలపడ్డావో చెప్పు..." అన్నాడు జోగినాథం.

"అయితే నా ఉమను నాకు దక్కించగలరా చెప్పండి" అన్నాడా వ్యక్తి.

"ఉమ ఎవరు...అసలు నీ కథంతా వివరంగా చెప్పు..." అన్నాడు జోగినాథం.

"నా పేరు బలరాం..." అంటూ అతను తన కథను ప్రారంభించాడు. ఉద్యోగాన్వేషణలో ఆరంభమై ఉమా సంయోగంతో నడిచిన ఆ కథను జోగినాథం చాలా ఆసక్తిగా విన్నాడు.

"పదిరోజుల్లో మాకు మరణముందని అంటున్నప్పటికీ అలా జరగలేదు. అయిదు నెలలకుపైగా మేము సుఖజీవనం చేశాము. ఒకరి నొకరు అర్థం చేసుకున్నాము. అయితే ఈ రోజు హఠాత్తుగా నేనీ వూళ్ళో ప్రత్యక్ష

మయ్యాను. నా జేబులో వెయ్యిరూపాయలున్నాయి. నేనక్కడ్నించి మాయమై ఈ వూరి హోటల్ గదిలోకెలా వచ్చానో నాకు తెలియదు. ఎవరో చప్రాసీలాంటి వాడు నన్నీ ఊరి హోటల్ గదిలో దిగబెట్టినట్లు హోటల్ యజమాని అంటున్నాడు. నా ఉమను కలుసుకోగలనన్న ఆశ నాకు లేదు. ఈ బ్రతుకు వ్యర్థమనిపిస్తోంది..." అన్నాడు బలరాం.

"నీ జేబులో వున్న వెయ్యి రూపాయలూ నీకెన్నాళ్లు వస్తాయి?"

"కనీసం నాలుగైదు నెలలు..." అన్నాడు బలరాం.

"ఐదు నెలలపాటు ఉమ కోసం ఎక్కడెక్కడైనా ప్రయత్నించు. జీవితం కొనసాగించు. సరిగ్గా ఐదు నెలలు అయ్యాక నేనిచ్చిన అడ్రసుకు రా. నీ ఉమ దొరుకుతుంది. ఈలోపల నేనొక ముఠాను పట్టుకునే ప్రయత్నంలో వున్నాను" అన్నాడు జోగినాథం.

## 9

ఆ రోజు ఘనంగా వేడుక జరుగుతోంది.

సుందరరామయ్య కోడలు శోభ గర్భం ఫలించి పండంటి కొడుకును కన్నది. సంతానప్రాప్తికోసం ఆమె, ఆమె భర్త తీర్థయాత్రలకు వెళ్ళిన సందర్భంలో ఇది జరిగింది. ఈ రోజున సుందరరామయ్య మనుమడి నామకరణ మహోత్సవం జరుగుతోంది.

పీటలమీద కూర్చున్న శోభ ముఖం కలకలలాడిపోతోంది.

"అమ్మో-నేను గుర్తున్నానా?" అన్న మాటలు విని శోభ వులిక్కిపడి తలెత్తి చూసింది. ఆ వ్యక్తిని చూసి ఆశ్చర్యపడింది.

"గుర్తుందో లేదో—నా పేరు జోగినాథం. సంవత్సరం తర్వాత మిమ్మల్ని కలుసుకుంటానని మాటిచ్చాను. కానీ ఇంకా ముందే వచ్చి మిమ్మల్ని కలుసుకున్నాను. అప్పట్లో మీ కోరిక యేమిటో నాకు తెలియదు. కానీ సంతానమే మీ కోరిక అని ఈరోజు తెలిసింది. మీ ఆనందాన్ని కళ్ళారా చూడ్డం కోసం వచ్చాను..." అన్నాడు జోగినాథం.

శోభ అప్రయత్నంగా చేతులు జోడించి "మీరు నిజంగానే దైవస్వరూపులు" అంది.

"వీడా? దైవస్వరూపుడా... పనికిమాలిన ముష్టి వెధవ!" అన్నాడు సుందరరామయ్య.

జోగినాథం సుందరరామయ్య వంక చూడకుండా "అమ్మా-మీ మంచితనం కారణంగా మీ మామగారినో పర్యాయం బుద్ధిగా మసలుకోమని హెచ్చరించాను. కానీ ఆయన నా హెచ్చరిక చెవిని బెట్టలేదు. ఇక నేనాయన్ను రక్షించలేనమ్మా శోభా" అన్నాడు.

అంతలో పోలీసులు ప్రవేశించారు అక్కడికి. ఇన్‌స్పెక్టర్ కుటుంబరావు వెతుక్కుంటూ వచ్చి సుందరరామయ్య చేతులకు బేడీలు వేసి "నీ ముఠాకి ఈరోజుతో స్వస్తి!" అన్నాడు.

సుందరరామయ్య ఆశ్చర్యంగా ఏదో అనబోగా "ఇందులో పొరపాటేమీ లేదు మిస్టర్ సుందరరామయ్యా! జోగినాథంగారు మీ ముఠా కార్యకలాపాల గురించి చాలా సమాచారం సేకరించి యిచ్చారు. అప్పట్నించి నిన్ను వేయి కళ్ళతో కనిపెట్టి వున్నాం. స్మగ్లింగ్, దొంగతనం నీ వృత్తి. నువ్వు దొంగతనాలు చేసిన స్థలంలో ఒకచోట ఆటోమేటిక్ కెమేరాతో నీ ఫోటో

కూడా తీయడం జరిగింది. నీ ముఠా సభ్యులందరూ పట్టుబడ్డారు'' అన్నాడు ఇన్ స్పెక్టర్ కుటుంబరావు.

"ఈ జోగినాథం చేపట్టిన కేసు ఏదీ ఫెయిల్ కాదు. శోభకు సంతానం కలిగింది. సుందర్రామయ్యకు జైలు ప్రాప్తిస్తోంది. ఇంక బలరాంకు...ఉమ లభించాలి...'' అన్నాడు.

"బలరాం, ఉమ ఎవరు?'' అన్నాడు ఇన్ స్పెక్టర్.

"విడిపోయిన ప్రేమికులులెండి. ఈ కేసుకూ వాళ్ళకూ సంబంధం లేదు'' అన్నాడు జోగినాథం.

సుందర్రామయ్య కలవరపాటుతో జోగినాథం వంక చూసి "శోభ క్షేమం కోరేవాడివయితే నువ్వోసారి నన్ను జైల్లో కలుసుకోవాలి'' అన్నాడు.

జోగినాథం అప్పటికేమీ మాట్లాడకపోయినా తర్వాత సుందర్రామయ్యని కలుసుకున్నాడు.

"డాక్టర్లు పరీక్ష చేసి చెప్పినప్రకారం శోభకు సంతాన యోగం లేదు. లోపం నా సుపుత్రుడిది. వాడు నాకులా కాక మంచి మనసు కలవాడు. వాడికి, వాడి భార్యకూ ఈ అన్యాయం జరగడం నాకు నచ్చలేదు.

మా వంశాంకురాన్ని సంపాదించడం కోసం నేను ఒక విచిత్రమైన పద్ధతి అవలంబించాను. మా కులానికి చెందినవారూ, ఆరోగ్యవంతులూ అయిన ఇద్దరు యువతీ యువకులను ఒకచోట చేర్చి ఉద్రిక్తత కలిగించే పరిస్థితు లేర్పరచాను. వాళ్ళు దాంపత్య జీవితం నెరవేర్చారు.

అమ్మాయి గర్భవతి అయిన అయిదు నెలలకు అబ్బాయి నక్కడ్నుంచి తప్పించాను. అమ్మాయికి లేడీ డాక్టర్ని ఏర్పాటుచేసి పురుడు పోయించి శిశువు పుట్టి మరణించి నట్లు తెలియబర్చాను. ఇదంతా ఎవరు చేయించారో ఆమెకు తెలియదు.

కనబడని ఆమె భర్తకోసం, చనిపోయిన తన శిశువు
కోసం ఆమె కన్నీరు మున్నీరుగా విలపిస్తోంది. ఆమెకు
నాకు తెలిసిన ఒక స్త్రీ యింట్లో ఆశ్రయం ఏర్పాటు
చేశాను.

ఆమె తన భర్తను కలుసుకోవడం నాకిష్టంలేదు. ఆ
యువకుడు, ఆ యువతి వేర్వేరు జీవితాలు గడపాలని నా
ఆశయం. వాళ్ళ పేర్లే బలరాం, ఉమ.

నీవు వాళ్ళ పేర్లుచ్చరించడం నాకు భయాన్ని కలి
గించింది. ఎటువంటి నిజాన్నయినా బయట పెట్టించగల
శక్తి నీకున్నదని నాకర్థమైంది. బలరాంనీ, ఉమనీ కల
పాలనుకుంటే ఉమ ఎక్కడున్నదీ చెబుతాను. కానీ
ఆమె కొడుకు బ్రతికే వున్నట్లు చెప్పవద్దు. తన కొడుకు
పోయాడని ఆమె అనుకొంటున్నది. ఆమెను ఆ భ్రమల
లోనే వుండనీ. సంపూర్ణారోగ్యంగల ఆమె మళ్ళీ తప్పక
సంతానవతి కాగలదు.

శోభ బిడ్డకు తల్లిగా మరెవ్వరి పోటీ వుండరాదు.
అందుకే ఈ పని చేశాను. ఇలాంటి ఏర్పాటు చేస్తున్నట్లు
శోభకు చూచాయగా తెలుసు. భార్యాభర్తలను తీర్థ
యాత్రలకు పంపి—ఉమ ప్రసవించగానే ఆ బిడ్డను
శోభ కడకు చేర్చాను.

జీవితంలో నే చేసిన తప్పులన్నింటికీ శిక్ష అనుభ
డానికి సిద్ధంగా వున్నాను. కానీ, బలరాం, ఉమలకు
శోభ దగ్గర పెరుగుతున్నవాడే తమ బిడ్డడన్న రహ
స్యాన్ని రహస్యంగానే వుంచితే అటు శోభ, ఇటు నేను
కూడా నీకు జీవితాంతం ఋణపడి వుంటాం.”

సుందరరామయ్య చెప్పిన కథంతా ఆశ్చర్యంగా
విన్నాడు జోగినాథం. “ఏం చేయాలో నాకూ తోచడం

లేదు. కానీ నిన్ను హెచ్చరించి కొన్ని నెలలపాటు వదిలిపెట్టడమూ, ఆ సమయంలో శోభను బిడ్డనివ్వడానికి నువ్వు చేస్తున్న ఏర్పాటు సక్రమంగా నెరవేర్చడం కోసమే జరిగిందనిపిస్తోంది. అలా జరగడం ఈశ్వరాజ్ఞ అనే అనుకోవాలి. నువ్వు చేసిన పనిలోని మంచి చెడ్డలను విచారించకుండా నువ్వు కోరిన శోభ సంతోషం కల కాలం వుండేలా చేస్తాను. సెలవు ..''

ఈ ప్రపంచంలోని విచిత్రాలకు ఆశ్చర్యపడుతూ అక్కడ్నించి కదిలాడు జోగినాథం.

——: అ యి పో యి ం ది :——

# మిస్. శోభాసింగ్

సంపత్

కారు తలుపు తెరుచుకుని కాలు క్రింద పెట్టాడు సుంద
రేశన్.

రంగురంగుల విద్యుద్దీపాలతో అట్టహాసంగావుంది క్లబ్
అంతా. లోపలినుంచి చప్పుడు బయటకి వినబడటంలేదు.

డోర్ దగ్గర వేచివున్న 'డోర్‌మన్' సుందరేశన్‌ని
చూసి, తలుపు తెరిచి పట్టుకున్నాడు వినయంగా సెల్యూట్
చేస్తూ.

చిరునవ్వు నవ్వి లోనికి నడిచి హాలునంతటిని కలయ
చూశాడు సుందరేశన్.

లోపల బయటికి కనబడకుండా అమర్చివున్నాయి
లైట్లు. డిమ్‌గా వెలుగుతుండటంవల్ల కూర్చున్న మనుషుల
ఆకారాలు స్పష్టంగా కనబడటంలేదు.

దూరంగావున్న స్టేజ్ మీద ఆర్కెస్ట్రా మోగుతుంది.
దానికి అనుగుణంగా శరీరంలోని ఒంపుసొంపుల్ని కదు
లుస్తూ 'నాట్యం' చేస్తోందో నాట్యరాణి.

సుందరేశన్‌ని సమీపించాడొక వెయిటర్. "ప్లీజ్ కమిన్ సర్!" అంటూ అతన్ని ఒక టేబుల్ దగ్గరకు తీసుకుపోయాడు.

ఆ టేబుల్‌కి అటొకటి, యిటొకటి మాత్రమే ఉన్నాయి కుర్చీలు. పైన 'రిజర్వ్‌డ్' అన్న చిన్న ప్లేట్ వుంది.

"మిస్ శోభాసింగ్ రాలేదా?" అని ప్రశ్నించాడు సుందరేశన్ కూర్చుంటూ.

మిస్ శోభాసింగ్‌కి ఇరవయి నాలుగేళ్ళుంటాయి. సన్నగా పొడుగ్గా, తీగలా ఉంటుందామె శరీరం. బాబ్డ్ హెయిర్. పెదవులకి లిప్‌స్టిక్, గోళ్ళకి నెయిల్ పాలిష్ వేయటంవల్ల మరింత అందంగా కనబడుతుంది. అసలు 'మేకప్' అనేది ఆడవాళ్ళు ఆమెదగ్గరే నేర్చుకోవాలని అనుకుంటుంటాడు సుందరేశన్.

సిటీలో ప్రఖ్యాతి వహించిన ఒకానొక ప్రయివేట్ రిసెర్చి లాబ్‌లో శోభాసింగ్ అసిస్టెంట్‌గా పనిచేస్తోంది.
ఆ లాబ్‌కి సంబంధించిన ఒక ఫీల్డ్ ఆఫీసులో ఆఫీసర్ సుందరేశన్. ముప్పయి అయిదు సంవత్సరాల వయసు. పెళ్ళయిన కొద్దివారాలకే భార్య ఆక్సిడెంట్‌లో చనిపోయింది. చావుతప్పి బయట పడ్డాడు సుందరేశన్.

అతనికి జీవితంమీద విరక్తి కలిగింది. ఆత్మహత్యచేసుకుందామని అనుకున్నాడు. ఆ టైంలోనే శోభాసింగ్‌తో పరిచయం కలిగింది.

శోభాసింగ్‌కి తలితండ్రులు లేరు. ఒక్క అన్న మాత్రం కలకత్తాలో ఏదో వ్యాపారం చేసుకుంటున్నాడు. ఉద్యోగం చేయవలసిన అవసరం లేకపోయినా, చదివిన

చదువు సార్థకత కోసం ఆ లాబ్‌లో అసిస్టెంట్ గా చేరింది శోభాసింగ్.

శోభాసింగ్ పరిచయం తరువాత, తన ఆలోచన మార్చుకున్నాడు సుందరేశన్. ఇప్పుడతనికి లోకంఎంతో సుందరంగా కన్పించసాగింది.

క్రమంగా వారిద్దరిమధ్య ప్రేమభావం అంకురించింది. ఇద్దరూ కలిసి తిరగటం; సినిమాలకి, షికార్లకి పోవటం జరుగుతోంది తరచుగా.

ఆ కార్యక్రమంలోని ఒక భాగమే ఆనాటి సుందరేశన్ క్లబ్‌కి రాకలోని అంతరార్థం. ఆ క్లబ్ అంటే యిద్దరికీ ఎంతో యిష్టం. ఎన్నోసార్లు అక్కడ కలుసుకున్నారు. క్లబ్‌లో పనిచేసే వ్యక్తులకు 'నోటెడ్ పర్సన్స్'అయ్యారు.

"సారీసర్! మీకోసం యిప్పుడే మిస్ శోభాసింగ్ వచ్చి వెళ్ళారు" అన్నాడు వెయిటర్.

"ఎంతసేపయింది?" ఆశ్చర్యంగా అడిగాడు సుందరేశన్.

"జస్ట్ టూ మినిట్స్ సర్! పైన రూం వైపువెళ్లారు" అన్నాడతను.

క్లబ్ పైన వరుసగా రూమ్స్ ఉన్నాయి. ఒకొక్కప్పుడు అక్కడే వుండిపోతారు యిద్దరు.

వెయిటర్‌కి భారీగా టిప్ యిచ్చి పైకివెళ్ళాడు సుందరేశన్.

అలవాటుగా తమకి రిజర్వ్ చేయబడే గదిముందాగి తట్టాడు. లోపలినుంచి ఎటువంటి సమాధానమూ రాలేదు.

ఆశ్చర్యపోతూ తలుపుల్ని తోశాడు.

తెరుచుకున్నాయి. లోపల లైట్లు వెల్గించివున్నాయి. మనుషులున్న అలికిడి లేదు.

"శోభా! శోభా!" పిలిచాడు సుందరేశన్. జవాబు రాలేదు. బాత్‌రూంలో కూడా ఎవరూ లేరు.

తిరిగి వస్తుండగా కన్పించింది ఎన్వలప్, టాయిలెట్ టేబుల్ వద్ద.

ఆశ్చర్యపోతూ తీసి చూశాడు.

మామూలుగా అయితే శోభాసింగ్ చేతివ్రాత అతనికి గుర్తే. కాని యిది మాత్రం ఏదో కంగారులో వ్రాసినట్లు పైన గిలికివుంది బాల్‌పాయింట్ పెన్‌తో.

నవ్వువచ్చింది సుందరేశన్‌కి. ఇటువంటి చిలిపిపనులు శోభకి అలవాటే.

బయటకు వచ్చి కారులో శోభాసింగ్ యింటి వైపు బయలుదేరాడు.

సుందరమయిన రెండస్తుల మేడ ఆమెది. అన్నిహంగులతో ముచ్చటగా వుంటుంది.

మేడలోపల లైట్లు వెలుగుతుండటం గమనించి ఊపిరి పీల్చుకున్నాడు సుందరేశన్.

కారుదిగి లోనికి పోయాడు తలుపులని నెట్టుకుని. పట్టపగలులా వెలుగుతున్నాయి లైట్లు. కానిఎక్కడా శోభాసింగ్ జాడలేదు.

చివరకి బెడ్‌రూంలో పడకమీద కన్పించింది మరో ఎన్వలప్. ఇందాకటి బాల్‌పెన్‌తో రాసినదే, మరో ఉత్తరం వుంది దానిలో.

"మిస్ శోభాసింగ్ క్షేమంగా కావాలంటే రేపురాత్రి పదిన్నరకి బ్లూ డైమండ్ నైట్‌క్లబ్‌లో వేచివుండు. ఈ సంగతి మరొకంటికి తెలియకూడదు."

ఇంగ్లీషులో రాసి వుంది ఆ వుత్తరం. అది శోభాసింగ్ చేతివ్రాత కాదు.

ఆమెకేదో ఆపద సంభవించిందని మాత్రం అర్థం అయింది సుందరేశన్ కి.

సవాలక్ష ఆలోచనలు అతన్ని మిన్నుముట్టాయి.

## 2

మిస్ శోభాసింగ్ నైట్ క్లబ్ కి వచ్చేసరికి తమ అలవాటయిన ప్లేస్ లో సుందరేశన్ కన్పించలేదు. వెయిటర్ ని అడిగింది.

సుందరేశన్ వచ్చాడని, పైకి వెళ్ళారని చెప్పాడతను.

ఒకవేళ రూంలో వున్నాడేమో అనుకుంటూ అటు దారితీసింది.

తలుపులు నెట్టుకుని లోనికిపోయింది. చీకటిగా వుండటంతో ఆటోమాటిక్ గా ఆమె చేయి స్విచ్ బోర్డుమీదకు మళ్ళబోయింది.

అదే క్షణంలో ఆమె నోరుమూసేశారెవరో. రెండో చేత్తో చల్లటి మొనని ఆమె నడుంకి గుచ్చాడతను.

నోటమాట రాలేదు శోభాసింగ్ కి.

"మిస్ శోభా! ఇది రివాల్వర్ అని గ్రహించే వుంటావు. పిచ్చిపిచ్చి వేషాలెయ్యక మర్యాదగా నాతో రా. అరవటానికి ప్రయత్నిస్తే కాల్చటానికి వెనుకాడను. అర్థమయిందా. తలవూపి మాత్రం నీ అభిప్రాయం చెప్పు."

కరుగ్గా, బొంగురుగా వుంది అతని కంఠం. క్షణాల లోనే తనున్న పరిస్థితి అర్థమయిపోయిందామె. తల వూపింది నెమ్మదిగా.

"గుడ్!" అంటూ నోటిమీద చేయి తీసేశాడతను.

వెనువెంటనే జేబులోనుంచి నల్లని గుడ్డనొకదానినితీసి, మడిచి ఆమె కనులకి బిగించి కట్టాడు. రుమాలుతో ఆమె వెనుకనుంచి చేతుల్ని విరిచి కట్టాడు.

"పద. పెరుమాళ్ళు నీపని కానివ్!" అన్నాడతను.

అప్పుడుగాని శోభాసింగ్ కి అర్థంగాలేదు, అతనుగాక మరోవ్యక్తి లోపల వున్నాడని. ఆ గదిలో లైటు వెలగటము, పెరుమాళ్లు ఏదోగిలికి ఎన్వలవ్ లో నుంచటము ఆమెకు తెలియదు.

ముగ్గురూ బయటపడి వెనుకనున్న ఫైర్ యెస్కేప్ వద్దకు దారితీశారు. దోవలో ఎవరూ ఎదురుకాకపోవటం శోభాసింగ్ దురదృష్టమే!

క్లబ్ ఆవరణలోనుంచి బయటపడి ఒక కారెక్కించారామెని. ఎప్పుడూ ఆ మనిషే మాట్లాడుతున్నాడుగానీ పెరుమాళ్లు మాత్రం పెదవి విప్పటంలేదు.

కారు కదిలింది. కొంత తడవుపిమ్మట గతుకులుగానున్న రోడ్డువెంట పోతున్నట్లు ఎగిరెగిరిపడింది. ఆ పిదప సాఫీగా పోసాగింది.

భుజాన్ని పైకిలేపి, ముఖం తుడుచుకుంటున్నట్లు నటిస్తూ, కళ్ళకి కట్టివున్న గంతల్ని తొలిగించటానికి ప్రయత్నించింది శోభాసింగ్.

పూర్తిగా తొలక్కముందే ఆమె చెంప అదిరిపోయింది.

"మిస్ శోభా! నీ వేషాలు నా దగ్గరకాదు. కదలకుండా కూర్చో!" హుంకరించాడతను.

మౌనంగా వుండిపోయిందామె.

దాదాపు అరగంట, ముప్పావుగంట తరువాత ఆగింది కారు. తననెక్కడికి తీసుకుపోతున్నారో అనూహ్యంగా ఉందామెకి. సుందరేశన్ ఏమయ్యాడు? ఎవరు వీళ్లు?

మరికొద్దిసేపు తరువాత తానేదో మెట్లు ఎక్కుతున్నట్లు అర్థమయిందామెకు.

మరో అయిదు నిముషాల తరువాత ఆమెనో గదిలోకి తోయటం, గదిబయట గొళ్లెం పెట్టడం జరిగింది.

# 3

సుందరేశన్ రాత్రంతా నిద్రపోనట్టుగా కళ్లుఎర్రబడి ముఖం ఉబ్బివుంది.

అతను ఏదో సమస్యగురించి బాధ పడుతున్నాడని ప్రయివేట్ డిటెక్టివ్ మనోహర్ కి తెలిసిపోయింది.

ఇద్దరూ మనోహార్ ప్రయివేట్ గదిలో కూర్చున్నారు.

శోభాసింగ్ తో తనకు పరిచయం అయిన సంగతి, త్వరలో తామిద్దరూ పెళ్ళిచేసుకోబోతున్న విషయమూ చెప్పి, రాత్రి జరిగిన సంఘటన చెప్పాడు సుందరేశన్.

"ఆమెను ఎవరో, ఎందుకు ఎత్తుకుపోయారో నాకు అర్థంగావటంలేదు. పోలీసుల దగ్గరకంటె మీ దగ్గరకు రావటం మంచిది, క్షేమమని ఇలా వచ్చాను.

ఎలాగయినా మిస్ శోభాసింగ్ ఆచూకీతీసి, ఆమెను క్షేమంగా అప్పగించాలి" అన్నాడు సుందరేశన్.

తరువాత తనకి కన్పించిన రెండు ఎన్వలప్ లనుకూడా చూపాడు డిటెక్టివ్ మనోహార్ కి.

"సరే! మీరు మామూలుగా ప్రవర్తించండి. నేను మిగిలిన విషయాలు చూసుకుంటాను. అన్నట్లు...ఆమె యింటి తాళం మీదగ్గర వుందా?" అన్నాడు.

ఉందని చెప్పి యిచ్చాడు సుందరేశన్. "మరొకటి ఆమె దగ్గర వుంటుంది" అనికూడా అన్నాడతను.

"ఈ కేసులో పోలీసుల హెల్ప్ తీసుకోవాల్సివస్తే నా తరఫున తీసుకుంటాను. మీ పేరు బయటకు రాకుండా చూసే బాధ్యత నాది." అన్నాడు మనోహార్.

తలూపాడు అతను.

సుందరేశన్ వెళ్ళిపోయిన చాలసేపటివరకు ఏదో ఆలో చిస్తూ కూర్చుండి పోయాడు మనోహర్. చివరికి లేచి డ్రస్ చేసుకుని కారులో బయలుదేరాడు.

## 4

మిస్ శోభాసింగ్ యింటి దాపుల్లో కారుని పార్కు చేసి, నడకమీద ఆమెయింటి వెనుక ప్రాంతాల్ని చేరు కున్నాడు డిటెక్టివ్ మనోహర్.

ముందూ, వెనుక ఒకే లైట్ డోర్ కావటం, రెంటికి ఒకే తాళం పనిచేస్తుందని సుందరేశన్ తెలియచెయ్యటం జరిగింది.

వెనుకనుంచి ఆమె యింట్లోకి ప్రవేశించాడతను. ఆమె నివాసాన్ని క్షుణ్ణంగా పరిశీలించినా అతనికి అనుమానా స్పదంగా కన్పించలేదు ఏదీ.

అరగంట పాటు పరిశీలించి తిరిగి వెనుకద్వారంనుంచి బయట పడ్డాడు.

ఏదో ఆలోచిస్తూ కరెంటు స్తంభం దాటిన మనోహర్ తలమీద పిడుగులు పడ్డట్లయింది. చిన్నగా మూలుగుతూ నేలమీదకి వాలిపోయాడు అతను.

చేతిలోని రాయిని పక్కకు విసిరి, మనోహర్ జేబులు తడిమాడు అతనిని కొట్టినవ్యక్తి. అతని ఐడెంటిటీచూడ గానే గుండెవేగం ఎక్కువయిందతనికి.

చప్పున ఆ కాగితాలు మనోహర్ జేబులోకితోసి

ఒక్క పరుగుమీద అక్కణ్ణించి దూరమైపోయాడు.

పావుగంట తర్వాత అతికష్టంమీద కళ్లు తెరిచాడు మనోహర్.

చేత్తో తలమీద అదుముకున్నాడు. తల వెనుక లెఫ్ట్ హాండ్ సైడ్‌లో జిగటగా తగిలింది రక్తం.

అయిదు నిమిషాల తరువాత రికవరీ అయిన అతడు జరిగినది వూహించగలిగాడు.

టైం చూసుకున్నాడు. ఎనిమిదీ ముప్పావు కావొస్తుంది. అంటే అతను స్పృహ తప్పి ఇరవై నిముషాలు, అరగంటకంటే ఎక్కువ వుండదు.

శోభాసింగ్‌ని ఎత్తుకుపోయినవాళ్ళు మళ్ళీ దేనికోసమో ఆమె ఇంటికి వచ్చారు. తాను కంట బడ్డాడు. అంటే సుందరేశన్ ఈ విషయం 'మూడో కంటికి' చెప్పాడని అర్థమై వుంటుంది వాళ్ళకి. అంతేగాదు, ఏదో 'క్లూ' కూడా యింట్లోనే ఒదిలిపోయి వుంటారు.

నీరసంగా లేచి శోభ యింటివైపు మళ్ళీ అడుగులు వేశాడు.

వెనుక ద్వారంద్వారా లోనికిపోయి కొంచెంసేపు కూర్చున్నాడో కుర్చీలో. ఎంత ప్రయత్నించినా అతనికి అనుమానించవలసినదేదీ కన్పించలేదు.

మరోసారి ఓపిగ్గా చెక్ చేయటం ప్రారంభించాడు మనోహర్.

టెలిఫోన్ వున్న స్టాండ్ క్రింద మాగజైన్స్ పెట్టుకోవటానికి వీలుగా 'అర' వుంది. దానిలో రకరకాల పత్రికలు యింగ్లీషువి వున్నాయి. అయితే అన్నీ ఫిల్మ్ ఫేర్, ఫెమినా, ఫాషన్స్‌కి సంబంధించిన పుస్తకాలే. ఆ మాగజైన్స్‌ని అటూ యిటూ కెలికాడు. అడుగున చిక్కుకుని వున్న ఓ పుస్తకం మీద అతని చూపు పడింది. దానిని బయటికి లాగి, తీసి ఆశ్చర్యపోయాడు మనోహర్.

రాజకీయాలు విప్లవాలకి సంబంధించి భారతదేశంలో నిషేధించబడిన ఒక పుస్తకం అది. ఇటువంటివి శోభా

సింగ్ చదువుతుందా? మనోహర్ భృకుటి ముడిపడింది.

అట్ట తెరిచి చూశాడు. 'క. పీటర్ పాల్' అని ఉంది పెన్‌తో రాసి.

ఎవరీ పీటర్ పాల్? శోభాసింగ్ ఫ్రెండా? లేక ఈ పుస్తకం ఓనరా? సెకండ్ హాండ్ బుక్ స్టాల్‌లో కొనుక్కొని వుంటుందేమో ఈ బుక్కుని.

అటూ యిటూ తిప్పి చూశాడు మనోహర్. నీట్‌గా వుంది బుక్. సెకండ్ హాండ్‌లో కొన్నట్లుగా అనిపించ లేదు.

దానిని అలా పట్టుకునే ఫోన్ దగ్గరికి పోయాడు మనోహర్. సుందరేశన్‌కి డయల్ చేశాడు. అవతలి నుంచి అతను పలకగానే—

"మిస్ శోభాసింగ్‌కి 'పీటర్ పాల్' అనే పరిచయ స్తుడు ఎవరయినా వున్నారా?" అని ప్రశ్నించాడు మనోహర్.

"పీటర్ పాల్? నాకు తెలిసినంతవరకు లేరే!" అన్నాడు సుందరేశన్.

"ఆమె భావాలెటువంటివి? తీవ్రమయినవా? ఏదైనా రాజకీయ పార్టీని అభిమానిస్తున్నట్లు ఎన్నడయినా, ఏ సందర్భంలోనయినా మీతో అన్నదా? గుర్తుకు తెచ్చు కోండి."

కాసేపు ఆలోచించి లేదన్నాడు సుందరేశన్.

"ఎందుకు అడుగుతున్నారు యివన్నీ?"

"జస్ట్ వెయిట్!" అన్నాడు హఠాత్తుగా మనోహర్.

ఆ బుక్‌లో చదివినంతమేర గుర్తు పెట్టుకోవటానికి వీలుగా చిన్న కాగితం ముక్క ఒకటి బుక్ మార్కుగా వుంది. అది బుక్‌లోనుంచి జారి పడటంతో తీసి చూశాడు మనోహర్.

ఒకవైపు ఖాళీగా వుంది. రెండో వైపు ఒక లేడీ "ఫ్రెండ్స్ క్లబ్" అన్న అక్షరాలు కన్పించాయి. నీలం రంగు అట్టముక్కలోనుంచి చింపినట్లుగా ఉందా పేపర్.

"ఫ్రెండ్స్ క్లబ్ మీకు తెలుసా?" ప్రశ్నించాడు మనోహార్ ఫోన్‌లో.

"తెలును. అక్కడికి మెంబర్స్‌ని తప్ప యితరులని రానివ్వరు. నాకు అందులో మెంబర్ షిప్ ఉంది" చెప్పాడు సుందరేశన్.

ఒక్క క్షణం వూరుకుని "అక్కడ మెనూ కార్డు ఏ రంగులో ఉంటుంది?" అడిగాడు మనోహార్.

ఆశ్చర్యపోయాడు సుందరేశన్. "బ్లూ కలర్‌లో. ఎందుకు?"

"ఇది చెప్పండి. ఆ క్లబ్‌లో మిస్ శోభాసింగ్‌కి మెంబర్‌షిప్ వుందా?"

"లేదనుకుంటాను" జవాబిచ్చాడు సుందరేశన్.

"ఇంతకీ విషయం ఏమిటో చెప్పకుండా సస్పెన్స్‌లో వుంచారు. ఏం జరిగింది? ఎక్కడనుంచి మాట్లాడుతున్నారు?"

"తరువాత చెబుతాను" అని ఫోన్ పెట్టేశాడు మనోహార్. దీర్ఘంగా ఆలోచించి మళ్ళీ ఎవరికో డయల్ చేశాడు.

"ఫ్రెండ్స్ క్లబ్ హియర్!" అని విన్పించింది అటు నుంచి తీయని గొంతు ఒకటి.

"మీ క్లబ్‌లో యితరులు రావటానికి అవకాశం లేదు కదూ మేడమ్?" అన్నాడు మనోహార్.

"అవును" అంది ఆమె.

"మెంబర్‌షిప్ తీసుకోవాలంటే ఏం చేయాలి?"

"సెక్రటరీని కలుసుకుంటే మెంబర్ షిప్ దొరికే వివరాలు చెబుతారు. పెద్దగా రెస్ట్రిక్షన్స్ ఏమీ వుండవు. ఫీజూ చెల్లించి, మెంబర్ షిప్ పొందటమే!" చెప్పింది ఆమె.

"థాంక్స్! మీ క్లబ్ లో శోభాసింగ్, మిస్టర్ కె. పీటర్ పాల్ అనే మెంబర్స్ ఉన్నారా? ప్లీజ్, చిన్న యిన్ఫర్మేషన్ కావాల్సి వచ్చింది" అన్నాడు మనోహర్.

అయిదు నిమిషాలపాటు మౌనం. ఆ తరువాత "ఎవరూ లేరు. యిద్దరూ కూడా!" అందామె.

తన చేతిలోని మెనూ కార్డ్ ముక్క వంక చూశాడు మనోహర్.

"3-6-78 తేదీన మీ క్లబ్ కి పీటర్ పాల్ అనే వ్యక్తి వచ్చాడు. ఎవరి తరఫున గెస్ట్ గా వచ్చాడో చెబుతారా?" అని అడిగాడు.

రెండు నిమిషాల తరువాత "మిస్టర్ రహమతుల్లాగారి తరఫున వచ్చారు," అంది రిసెప్షనిస్టు. రహమతుల్లా బాగా పేరున్న రాజకీయనాయకుడు.

"థాంక్స్!" చెప్పి ఫోన్ పెట్టేశాడు డిటెక్టివ్ మనోహర్.

## 5

మెత్తటి పరుపులా వున్న నవారు మంచం దుప్పటి మీద వెల్లకిలా పడుకొని సీలింగ్ వంక చూస్తోంది మిస్ శోభాసింగ్.

గది పైనుంచి అరవై వాట్స్ బల్బు మాత్రం వెలుగుతోంది. ఆ గదికి ఉన్న ఒకే ఒక కిటికీ బిగించబడి వుంది.

ఆ గదిలో మంచమూ, దుప్పట్లు రెండు, దిండు ప్రక్కనే నీళ్ళ కూజా, టీపాయ్ మీద నాలుగయిదు ఇంగ్లీషు ఫిలిం మాగజైన్లు మాత్రం వున్నాయి. గదికి ఆటాచ్ చేయబడి వుంది బాత్ రూమ్.

ఉన్న ఒకద్వారం అయినా బంధించబడి వుంది. రాత్రంతా తిండిలేకపోవడంవల్ల నీరసంగా వుందామెకి.

బయట అడుగుల శబ్దం విన్పించి, తల తిప్పి గుమ్మం వంక చూసిందామె. ఎవరో తలుపు తెరుస్తున్న చప్పుడు అయింది.

రెండు నిముషాల తరువాత తలుపు కొంచం తెరుచుకుంది. నల్లగా మెరుస్తున్న చేయి ఒకటి మోచేతివరకు ప్రత్యక్షమయి, ప్రక్కనే వున్న స్విచ్ బోర్డు మీదకి పాకటం గమనించిందామె.

క్షణం తరువాత గదిలో చీకటి ఆవరించటం, లావుగా వున్న ఒక వ్యక్తి లోపలకు అడుగు పెట్టటం జరిగింది. తన ఉనికి తెలియకుండా జాగ్రత్తపడుతున్నాడని గ్రహించగలిగింది శోభ.

"ఎవరు? ఎవరు మీరు? మీకేం కావాలి? నన్నెందుకు బంధించారు?" గద్గదమవుతున్న గొంతుతో అడిగిందతన్ని శోభ.

ఆ ఆకారం మాట్లాడకుండా మంచం ప్రక్కకు వచ్చి చేతిలో వున్న పాకెట్స్ని మంచంమీద వుంచింది.

ఎలా వచ్చాడో, అలానే వెనుదిరిగిపోయాడతను.

గుమ్మం దగ్గరకి పరుగెత్తి లైటువేసింది శోభ.

బ్రెడ్, బిస్కెట్స్, జామ్టిన్నూ కన్పించాయి మంచం మీద. భోరున ఏడుపు వచ్చిందామెకి. సుందరేశన్ ఆమె మనసులో మెదలాడు.

గబగబ వాటిని తిని ఆకలి తీర్చుకుంది. ఆకలి తీరటంతోనే అక్కడినుంచి బయట పడేందుకు మార్గాలు వెదక సాగిందామె మనసు.

## 6

"కొంప మునిగింది సార్! సుందరేశన్ మనోహర్ సాయం కోరాడు." అన్నాడు పీటర్, లోపలకివస్తూనే.

"మనోహరా? ఎవరతను?" అడిగాడు రహమతుల్లా.

"మనోహర్ సార్! ప్రయివేట్ డిటెక్టివ్. సి.బి.ఐ.లో యిదివరకు పనిచేశాడు."

గుర్తుకువచ్చింది కాబోలు అదిరిపడ్డాడు రహమతుల్లా.

"మై గాడ్! పోలీసులు కూడా రంగంలోకి వచ్చారేమో. త్వరపడాలి. వెంటనే మీనన్‌ని కలుసుకోవాలి" అన్నాడు రహమతుల్లా.

"ఇప్పుడేనా?"

"కాదు. సాయంత్రం. అతనిప్పుడు లాబ్‌లో వుంటాడుగదా! ఎందుకయినా మంచిది ఫోన్‌లో ఒకసారి హెచ్చరిస్తా" అంటూ ఫోన్ దగ్గరికి నడిచాడు రహమతుల్లా.

మీనన్ పూర్తిపేరు రవిమీనన్. అతడికి ఇరవై ఎనిమిది సంవత్సరాల వయసుంటుంది. అందంగా చలాకీగా ఉండే అతనికి తొలి చూపులోనే మిస్ శోభాసింగ్ మీద 'ప్రేమ' ఏర్పడింది. తాను శోభాసింగ్‌ని ప్రేమిస్తూన్నానని, ఆమె లేనిదే బ్రతకలేనని అనుకున్నాడు అతను.

అయితే అతని దురదృష్టమేమోగాని, శోభాసింగ్ చూపు మాత్రం సుందరేశన్ మీద పడింది. వాళ్ళిద్దరి

మధ్య ప్రేమ గాఢతరం గావటం గమనించి అతను పతపత వుడికిపోయాడు.

సరిగ్గా ఆ సమయంలోనే అతనికి ఎదురుపడ్డాడు రహమతుల్లా ఓ నైట్ క్లబ్‌లో. అప్పుడే శోభాసింగ్, సుందరేశన్ చెట్టాపట్టాలు వేసుకుని బయటకి పోతున్నారు.

వారికి కన్పించకుండా వారిని గమనిస్తున్న రవిమోనన్ ప్రక్కకు తిరిగి చిన్నగా వులిక్కిపడ్డాడు. తన ముఖంలోకే గుచ్చి చూస్తున్నాడో మనిషి.

"ఆమె పేరు శోభాసింగ్. అతని పేరు సుందరేశన్ గదూ!" అన్నాడు ఆ అపరిచితుడు.

ఆశ్చర్యపోయాడు రవిమోనన్. విభ్రాంతిగా అతని వంక చూశాడు.

"ఆమెని మీరు ప్రేమిస్తున్నారు. కాని ఆమె మనసులో మీకు స్థానం లేదు. ఆమె మీకు కావాలి ఎలాగయినా. యింకా చెప్పాలంటే...ఆమె మీ ప్రత్యర్థి సుందరేశన్‌కి దక్కకూడదు. అవునా?"

తన ఆలోచనలన్నీ బయట పెడుతున్న ఆ మనిషిని చూసి బెదిరిపోయాడు రవిమోనన్.

రవిమోనన్ తడబాటు చూసి నవ్వాడు ఆ వ్యక్తి. "కంగారు పడకండి. నా పేరు రహమతుల్లా. మీకు సాయపడాలనే అలా అన్నాను" అన్నాడు.

"ఇంతకీ ఎవరు మీరు? మీకీ వివరాలన్నీ ఎలా తెలుసు?" ఉద్వేగంతో ప్రశ్నించాడు రవిమోనన్.

"అది మీ కనవసరం భాయ్. మీకు కావలసినది శోభేగదా! ఆల్ రైట్. నేనో ప్లాన్ చెబుతాను. అది ఆచరిస్తే ఆమె నీ వశం అవుతుంది. కాకపోతే నీకు యిద్దరు మనుషుల సాయం కావల్సి వస్తుంది. ఆ ఖర్చులు నువ్వు భరించగలిగితే శోభాసింగ్ నీ వశం అవుతుంది."

"ఏమిటా ప్లాను?" ఉత్సాహంగా అన్నాడు రవి మీనన్. శోభ తనది అవుతుందన్న సంగతి అతనికెంతో ఆనందాన్ని కలుగజేసింది.

"చెప్తా! చెప్తా! నీవు సాయం చేసినందుకు నీకు శోభ దక్కుతుంది. మరి నాకు ఏదయినా ప్రతిఫలం ఇవ్వాలి?" అడిగాడు వృద్ధుడు చిరునవ్వుతో.

"ఏం కావాలి?" అన్నాడు ఆతృతగా రవిమీనన్.

"అదీ చెబుతాను. నేను యివ్వబోయే ప్లానులో ఎటువంటి మర్డర్లూ వుండవు. కాని కొంచం జాగ్రత్తగా మెలగాలి. అదీగాక అది పోలీసుల చెవుల్లో పడకూడదు. అందుకు సిద్ధపడితేనే చెప్తా" అన్నాడు రహమతుల్లా.

అంగీకారంగా చూశాడు రవిమీనన్. "సస్పెన్స్ ఎందుకు? చెప్పండి" అన్నాడు.

రహమతుల్లా అటూ యిటూ చూసి తమ మాటలు ఎవరూ వినటంలేదని మరోమారు దృఢపరచుకొని నెమ్మదిగా చెప్పటం ప్రారంభించాడు.

పూర్తిగా వినటంతోనే ఖంగు తిన్నాడు రవిమీనన్. అనుమానంగా రహమతుల్లా కళ్ళల్లోకి చూశాడు.

"మీకా 'గన్' ఎందుకు?" అనుమానంగా ప్రశ్నించిన అతన్ని చూసి గంభీరుడయ్యాడు రహమతుల్లా.

"మిస్టర్ రవి! మీకు కావల్సింది మేము అందిస్తున్నాం. మాకు కావల్సింది అందివ్వవలసిన బాధ్యత మీది. మీకిష్టం లేకపోతే చెప్పండి. మరోదారి చూసుకుంటాం." అన్నాడతను.

రవిమీనన్ మనసు అల్లకల్లోలం అయింది. రీసెర్చి లాబ్‌లో ఈ మధ్య కొత్తగా కనుక్కున్న ఒక ఫార్ములా కావాలని చెప్పాడు రహమతుల్లా.

అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు వున్న అతని మాటలకి రవిమీనన్ తల వూపాడు. వెంటనే ఒప్పుకు న్నాడు రహమతుల్లా పథకానికి.

తత్ఫలితంగా పీటర్‌పాల్, పెరుమాళ్ళు ఆ పనికి నియోగించబడ్డారు. వారిద్దరిమీద పోలీసుల రికార్డు లేక పోయినా యిద్దరూ నేరస్థులే.

వారిద్దరినీ ఏర్పాటు చేసింది రహమతుల్లానే.

మిస్ శోభాసింగ్‌ని అదను చూసి అపహరించి బంధిం చటం, సుందరేశన్‌ని క్లబ్‌లో కలుసుకొమ్మని ఉత్తరం వ్రాయటమూ జరిగిపోయింది.

అయితే శోభాసింగ్‌నీ బంధించిన ప్రదేశం రవి మీనన్‌కి మాత్రం తెలియచేయలేదు రహమతుల్లా. కొత్త ఫార్ములా తెచ్చి అందించిన తర్వాత మిస్ శోభాసింగ్‌ను అతడికి అప్పగిస్తామన్నాడు. ఆమెను బంధించిన గదిలోనే యథేచ్ఛగా అనుభవించవచ్చు ఆమెను. ఒకసారి. శీలం అర్పించిన ఆడది తిరిగి అతడినే భర్తగా పొందుతుంది. ఇది వారి పథకం.

# 7

ఆ పగలంతా శోభాసింగ్ స్నేహితుల, పరిచయస్థుల అడ్రసులను, వివరాలను తెలుసుకోవటంతోనే సరి పోయింది డిటెక్టివ్ మనోహర్‌కి.

సాయంత్రం ఆరున్నర గంటలవుతుండగా ఉసూరు మని నిట్టూర్చుతూ ఒక హోటల్‌నుంచి ఫోన్ చేశాడు సుందరేశన్‌కి.

తన పరిశోధన వివరించి "మీరు మాత్రం ఏ అను మానం కలగకుండా ప్రవర్తించండి. రాత్రికి తప్పక బ్లూ డైమండ్ నైట్‌క్లబ్‌కి వెళ్ళండి. నేను కూడా మిమ్మల్ని వాచ్ చేస్తుంటాను" అన్నాడు మనోహర్.

ఫోన్ పెట్టేసి "యిక చివరి అడ్రసు మాత్రం మిగిలింది" అనుకుని టాక్సీ ఎక్కాడు.

అంతవరకు అతనికి లభించిన వివరాలు నిరాశాజనకంగా ఉన్నాయ్. శోభాసింగ్ ని ఎరిగినవాళ్ళేగాని, ఆమెగురించి క్లోజ్ గా ఎవరూ మెలిగినట్లు కన్పించలేదు. అయితే అందరూ చెప్పిన మాట మాత్రం పూర్ణిమాచంద్, శోభాసింగ్ లు మంచి స్నేహితులని.

ఆమె యింటి దగ్గర టాక్సీ దిగి, తలుపు తట్టాడు మనోహర్.

తలుపు తెరిచింది పూర్ణిమాచంద్. ఆమెకి కూడా దాదాపు శోభాసింగ్ వయసే వుంటుంది. కొంచం బొద్దుగా, బలంగా ఉండటంవల్ల పొట్టిగా ఉన్నట్టు అన్పిస్తుంది.

మనోహర్ వంక ఆశ్చర్యంగా చూసిందామె.

"క్షమించాలి. మీరేనా పూర్ణిమాచంద్?" ప్రశ్నించాడు.

తలవూపి "ప్లీజ్! కమిన్" అంది దారితొలుగుతూ ఆమె. ఆయింట్లో ఆమె ఒక్కతే ఉంటుందన్న విషయం తెలిసిన మనోహర్ మగవారి దుస్తులు, బూట్లు కన్పించడంతో విస్తుపోయాడు.

ఇద్దరూ కుర్చీలలో కూర్చున్న తరువాత తానువచ్చిన పని బయటపెట్టాడు మనోహర్. "మీకు శోభాసింగ్ తెలుసా?" అంటూ. పూర్ణిమ ముఖం నల్లబడిందా మాట విని.

"బాగా తెలుసు. మేమిద్దరం ప్రాణస్నేహితులం. ఆమెని కలుసుకోటానికి నిన్న, ఈరోజు ప్రయత్నిం

చాను. కాని యింట్లో లేదు. ఏమయిందో కూడా తెలియ లేదు. ఎందుకు అడుగుతున్నారీ విషయాల్ని?'' అని అందామె.

మనోహర్ నోరు విప్పబోయాడు. అదే క్షణంలో ప్రక్కనే వున్న టెలిఫోన్ పొలికేక పెట్టి గణగణమోగ సాగింది ఆగకుండా.

# 8

అవకాశం కోసం ఎదురుచూస్తూ కూర్చుంది శోభా సింగ్. బయట అడుగుల శబ్దం వినగానే చప్పున లేచి నిలబడింది.

అప్పుడు సమయం రాత్రి ఏడున్నర అవుతుంది.

ఉదయం అంతా శ్రమపడి బాత్‌రూంలో వున్న టవల్స్‌ని వేలాడదీసే హేంగర్‌ని ఊడ బెరికింది.

చప్పుడుచేయకుండా గుమ్మం ప్రక్కకివెళ్ళి నిలబడింది చేతిలో స్టీల్ హేంగర్‌తో.

పెరుమాళ్ళు స్విచ్ ఆఫ్ చేసి, గదిలోకి అడుగు పెట్టాడు. అతని చేతిలో టార్చివుంది. ఫోకస్ చేసి మంచంమీద చూశాడు. శోభాసింగ్ కన్పించలేదు.

అదేక్షణంలో టార్చిని పట్టుకున్న చేతిమీద బరువుగా పడిందో దెబ్బ. చిన్నగా అరిచి టార్చిని వదిలేశాడు. ఆ క్షణంలోనే అతని తలమీద, భుజంమీద పడ్డాయి దెబ్బలు.

పక్కకి తప్పుకు నేలోపే మాడుమీద స్టీల్ రాడ్ తగ లటంతో చిన్నగా మూలిగి క్రిందికి జారిపోయాడు పెరు మాళ్ళు.

దడదడలాడే గుండెలతో బయట గొళ్ళెంపెట్టి, మెట్లు దిగింది. ఆమె వూహించినట్లు చాలా పాతకాలంనాటి బిల్డింగు అది. రేపో, మాపో కూలిపోయే స్టేజ్‌లోవుంది.

క్రింద హాలులో ఎవరూ ఎదురు పడలేదు. బయటకు పరిగెత్తి, కన్పించిన మార్గంవైపు పరుగుతీయు సాగింది.

ఆ ప్రాంతం అంతా ఏదో పొలాలకలె వున్నాయి. చుట్టుప్రక్కల యిళ్ళేమీ కన్పించలేదు. పొలాల మధ్యలో 'భూత్ బంగ్లా' మాదిరివుంది ఆ భవంతి.

కాళ్ళకు అడ్డుపడుతున్న పొదలను తప్పుకుంటూ రొప్పుతూ పరిగెడుతుంది ఆమె. ఆవేశంతో వక్షాలు ఎగిరెగిరి పడుతున్నాయి. తాను కొట్టిన దెబ్బలకు యెక్కువ కాలం స్పృహతప్పి వుండలేడు అతను. తెలివిరాగానే వెంటనే బయలుదేరుతాడు. తానీలోపే తప్పించుకుని, వీలయినంతదూరం పారిపోవాలి.

ఒంట్లోవున్న శక్తినంతా కాళ్ళలోకి తెచ్చుకుని పరుగిడుతోంది ఆమె.

దాదాపు ఇరవయినిమిషాల తరవాత చిన్న కంకర రోడ్ కన్పించటంతో పోతున్న ప్రాణాలు లేచి వచ్చాయామెకి.

ఆ రోడ్ వెంట పరుగుతీసిన ఆమెకు, కొంచెం సేపటి తరువాత చిన్నగ్రామం యెదురయింది. అప్పటికి టైం రాత్రి ఎనిమిది గంటలు అయింది. ఊరంతా నిద్ర పోయింది.

ఫోన్ కోసం ఊరంతా తిరిగింది. చివరికి ఒక చిన్న హోటల్ క్లీనర్ సహాయంతో ఒక షాప్ లోనుంచి ఫోన్ చేయగలిగింది.

మొట్టమొదట ఆమె డయల్ చేసింది సుందరేశన్ ఇంటికి. అయితే రెస్పాన్స్ రాలేదు.

తరువాత ప్రాణస్నేహితురాలు పూర్ణిమాచంద్ కి ఫోన్ చేసింది. అవతలినుంచి పూర్ణిమ ఎత్తటంతో కన్నీళ్లు కారాయి ఆమెకి.

గబగబ తానున్న పరిస్థితి, తానువున్న గ్రామంగురించి యింగ్లీషులో చెప్పింది శోభాసింగ్. వెంటనే వస్తున్నానని పూర్ణిమాచంద్ తెలియచేయటంతో రిసీవర్ క్రెడిల్ చేసి, బిల్లుయిచ్చి బయటపడిందామె.

హోటల్ క్లీనర్ కి చెప్పి, అక్కడే ఓమాటు ప్రదేశం చూసుకుని, ఎదురుచూడ సాగింది పూర్ణిమకోసం.

# 9

"శోభ పిలుస్తూంది" అంది పూర్ణిమాచంద్ ఉద్వేగంతో.

ఉలిక్కిపడ్డాడు డిటెక్టివ్ మనోహర్. "ఎవరూ?" అన్నాడు నమ్మలేనట్లు.

గబగబ చెప్పింది పూర్ణిమాచంద్.

"మైగాడ్! ఆపదలోవుంది. వెంటనే వెళ్ళి రక్షించాలి. పదండి" అన్నాడతను. ఆ పాటికే కిటికీలుమూసి తయారవుతోంది పూర్ణిమాచంద్.

ఇద్దరూ బయటకి రాబోతుండగా ఒక కారువచ్చి ఆ యింటిముందు ఆగటంతో ఆగిపోయారు.

మనోహర్, పూర్ణిమవంక చూశాడు.

కారులోనుంచి దిగిన వ్యక్తిని చూడగానే ఆమె ముఖంలో రిలీఫ్ కన్పించింది.

"మీట్ మై ఫ్రెండ్ పీటర్ పాల్. హీ ఈజ్ మిస్టర్ డిటెక్టివ్ మనోహర్." పరస్పర పరిచయం చేసింది.

అతని పేరు వినగానే మెదడులో ఎక్కడో టంగ్ మని మోగినట్లయింది మనోహర్ కి.

"గ్లాడ్ టు మీట్ యు! ఎక్కడికి బయలుదేరారు" ఆ కంఠంలో ఆసక్తి మాత్రమేవుంది.

"శోభాసింగ్ ఫోన్ చేసింది. ఎవరో దుర్మార్గు

లామెను బంధించారట. తప్పించుకుని బయటపడిందట”
అంటూ గబగబ చెప్పింది పూర్ణిమ.

పీటర్ పాల్ ఊపిరి స్తంభించినట్లయింది. శోభ తప్పించు
కుందా? పెరుమాళ్ళు ఏం చేస్తున్నాడు? ఇప్పుడామె
తప్పించుకుంటే తమ ప్లానంతా గల్లంతవుతుంది. ఆమెని
పికప్ చేసుకోకుండా వీళ్ళని ఆపాలి.

ఇలా అనుకుంటూ జేబులోనుంచి చిన్న కత్తితీశాడు.
అదిచూసి వెనక్కి తగ్గేరు మనోహర్ పూర్ణిమలు.

“పాల్! ఏమిటిది?” అంది నిర్ఘాంతపోతూ ఆమె.

“ఎస్ బేబీ! మీరు ఎక్కడికీ కదలకూడదు. లోనికి
పదండి” దర్పంగా అన్నాడు పీటర్.

ఉన్నట్లుండి గాలిలోకి ఎగిరాడు మనోహర్. రెండు
కాళ్ళనీ పీటరుచేతికి మెలివేసి క్రిందపడిపోయాడు. ఆ
వూపుకి ముందుకు తూలాడు పీటర్.

చటుక్కున పైకి జంప్ చేసి నిలబడి కత్తిపట్టుకున్న
అతని చేతిని మెలిపెట్టి, క్రిందపడేలాచేసి, పిడిగుద్దులతో
పీటరు ముఖాన్ని పచ్చడి చేయసాగాడు మనోహర్.

వీరిద్దరి పోరాటాన్ని విభ్రాంతిగా గమనిస్తోంది
పూర్ణిమానంద్.

పీటర్ని బంధించి, బాత్ రూంలో పడేశాడు మనోహర్.
వెంటనే దాపుల్లోనున్న పోలీస్ స్టేషన్ కి ఫోన్ చేసి, తను
యెవరో చెప్పి, పీటర్ ని కస్టడీలోకి తీసుకోవడానికి
అన్ని ఏర్పాట్లు పూర్తిచేసి బయటపడ్డాడు.

దోవలో పూర్ణిమ అతనికి చెప్పింది, ఒకసారి పొర
పాటున తానేదో పుస్తకాన్ని శోభాసింగ్ గదిలోనే
వదిలివేసినట్లు. అది పీటర్ పాల్ దనికూడా చెప్పింది.

కారు తిన్నగా బ్లూ డైమండ్ నైట్ క్లబ్ దగ్గరకు

వచ్చి ఆగింది. లోపలికి పరిగెత్తాడు మనోహర్. అప్పటి వరకూ సుందరేశన్‌ని కలుసుకోవటానికి ఎవరూరాలేదు. విస్తారని ఎప్పపెట్టకూడా చేయలేదు మనోహర్.

శోభాసింగ్ ఉనికి బయటపడిందని తెలియగానే సుందరేశన్ కూడా బయలుదేరాడు వారితోపాటు.

# 10

గ్రామంలోకి ఏదో వాహనం అడుగుపెట్టినట్లు గ్రహించటంతోనే నెమ్మదిగా తల ప్రక్కకువంచి చూసింది శోభాసింగ్.

మరికొన్ని క్షణాలలోనే అక్కడ ప్రత్యక్షమయింది కారు.

లోపల చాలామంది వ్యక్తులున్నట్లున్నారు. తనుగుర్తు చెప్పింది. పూర్ణిమ వెతుక్కుంటూ ఒక్కతే వస్తుంది అనుకుంది. ఇంతిమంది ఎందుకు? లేక పోలీసులను పిలుచుకు వచ్చిందా? పోలీసుల కారులా లేదే!

ఆమె అలా అనుకుంటుండగానే కారు లోపలినుంచి మనోహర్ దిగి ఎదురువచ్చిన క్లీనర్ని యేదో ప్రశ్నిస్తున్నాడు. బయటకు దిగిన సుందరేశన్‌ని చూడగానే ఆనందోద్రేకాలు తన్నుకొచ్చాయి శోభాసింగ్‌కి.

ఒక్క వూపుతో బయటపడి "సుందర్" అని అరుస్తూ వెళ్ళి, అతని మెడని కావలించుకుని వాత్తుకుపోయింది.

మిగిలిన వాళ్ళు విస్తుపోయారు.

సుందరేశన్ నీళ్ళునిండిన కళ్ళతో ఆమెని పొదివి పట్టుకుని, వీపు నిమురుతుండి పోయింది. కొంచెం సేపటికి తామున్న పరిస్థితి గుర్తుకువచ్చి, సిగ్గుతో విడివడింది శోభ.

"కమాన్ మిస్ శోభా! కారెక్కండి. ఆ దుర్మార్గుల అంతు చూడాలి!" అన్నాడు మనోహర్.

ఆ గ్రామంలో పోలీసుస్టేషన్ ఎక్కడో కనుక్కొని, సబ్-ఇన్‌స్పెక్టర్‌ని, మిగిలిన కానిస్టేబుళ్ళని పోగుచేసేసరికి పది గంటలయింది రాత్రి.

పిట్టలు యింకా అక్కడే వుంటాయన్న నమ్మకంలేదు మనోహర్‌కి. అయినా ఒకసారి ట్రయిచేసి చూద్దామన్నారు మిగిలిన వాళ్ళు.

ఆ చీకటిలో గుర్తులు సరిగా చెప్పలేకపోయిందిశోభ. ఆమె చెప్పిన ఒంటరి మేడ సంగతి విని, ఆప్రదేశం తనకి తెలుసునని అన్నాడు సబ్-ఇన్‌స్పెక్టర్.

కారు జీప్ పరుగుతీశాయి. మగవాళ్లు జీప్‌లో యిరుక్కొని కూర్చున్నారు యెలాగో.

అయితే శోభకొట్టిన దెబ్బలు బలంగా తగలటంవల్ల పెరుమాళ్లుకింకా స్పృహరాలేదు. పోలీసుబృందం అతడిని చుట్టుముట్టింది.

వెంటనే హెడ్‌క్వార్టర్సుకి కబురు పంపబడింది. ఆ బృందానికి నాయకుడయిన రహముతుల్లాను, వారితో చేతులు కలిపిన రవిమోహన్‌ను అరెస్టు చేశారు.

"మొత్తానికి మిస్ శోభాసింగ్ ఒక సీక్రెట్‌ని బట్ట బయలుచేశారు" అన్న డిటెక్టివ్ మనోహర్ మాటలకు నవ్వుతూ సుందరేశన్ శోభవంక చూశాడు.

సిగ్గుతో తలవంచుకుంది మిస్ శోభాసింగ్.

—: అయిపోయింది :—

# నకిలీ భర్తలు!

ఏ. వి. మోహన్రావ్

విమానంలోనుండి దిగాడు ఆనంద్.

జనం దూరంగా నిలుచుని, పూలగుత్తులు గాలిలో వూపుతూండటం కనుపించింది. దాదాపు అతనితో వచ్చిన ప్రతి ప్రయాణీకుడి కోసం ఎవరో ఒకరు వచ్చి వుండవచ్చుననిపించింది.

కానీ ఆనంద్ కోసం మాత్రం ఎవ్వరూ రారు. అలా ఎవరైనా వచ్చి వుంటే వాళ్ళు హితులుగానీ, స్నేహితులుగాగానీ ఐవుండటానికి వీల్లేదు. శత్రువులయితేనే అతని కోసం వస్తారు.

ఆనంద్ కేంద్రప్రభుత్వపు రహస్యపు గూఢచారి దళంలో పని చేస్తున్న మనిషి. అతనికి దాదాపు అప్పగించే పనులన్నీ అనితర సాధ్యమైనవి. అందులో ప్రాణాపాయంపాలు హెచ్చు. ఇంతదాకా ప్రాణాలు మాత్రం పోగొట్టుకోకుండా, చిన్న చిన్న దెబ్బలు, పెద్ద పెద్ద గాయాలతో మాత్రం బైటపడ్డాడు.

ఈమారు అతనికి అప్పగించపడ్డ పని అంత కష్టమైంది కాదు. మద్రాసులో వున్న సి. బి. ఐ. డైరక్టరువద్ద సెక్రెటరీగా పని చేస్తున్న 'రాణి' మనదేశ రహస్య సమాచారాన్ని ఇతరదేశాలకు, దేశంలో అరాచకం సృష్టించే కొన్ని వర్గాలకు అందజేస్తున్నదన్న అనుమానంతో, ఆమెను నిఘావేసి పట్టుకొనేందుకు నియమించారు. ఆ పనిమీదే మద్రాసు వచ్చాడిప్పుడు. తన్ను రక్షించుకుంటూ ఆమె డైరెక్టర్ కుమార్‌ని అభ్యర్థించింది.

విమానాశ్రయంలో జనాన్ని తప్పించుకుని బైట కొచ్చాడు ఆనంద్. టాక్సీని పిలిచి ఎక్కి కూర్చున్నాడు.

"ఎంకే పోణుం?" ఎక్కడికి పోవాలని అడిగాడు అరవంలో డ్రైవరు.

"హోటల్ డైమండ్!" అని సిగరెట్ వెలిగించుకుని కూర్చున్నాడు ఆనంద్.

నున్నటి తారు రోడ్డుమీద మెల్లిగా జారిపోతున్నది టాక్సీ. కిటికీలోంచి చల్లగా వస్తున్న గాలినీ, సిగరెట్ పొగను పీలుస్తూ వెనక్కి వాలి కూర్చున్నాడు.

"ఎమరాల్డ్ బాగుంటుంది" అన్నాడు టాక్సీ డ్రైవర్.

"డైమండ్‌లో రిజర్వేషనుంది నాకు. అయినా అది అంత బాగుంటుందా?" అడిగాడు ఆనంద్.

"చాలా బాగుంటుంది. ఒంటరిగా వచ్చారు. సూట్ కేసును కూడా తీసుకురాలేదు మీరు. అక్కడ అన్నీ దొరుకుతాయి."

"అందమైన అమ్మాయిలు దొరుకుతారా?"

"అసలు దొరికేది అక్కడే! మిగిలిన హోటళ్ళలో నకిలీ సరుకు దొరుకుతుంది."

ఆనంద్ అరనిమిషం తనలో తనే ఆలోచించు కున్నాడు.

రాణి గురించి తెలుసుకొన్న వివరాలొకసారు మెదడులోనే నెమరు వేసుకున్నాడు. ఆమెకు పెళ్ళయింది. భర్తను వదిలేసింది. కానీ విడాకులు తీసుకోలేదు. అతను ప్రయత్నించినా ఆమె యివ్వలేదు.

ఆమె భర్త పశ్చిమాశియాలో ఏదో దేశంలో పని చేస్తున్నాడు. అతను నెల నెలా ఆమెకు డబ్బు పంపుతున్నాడు. ఆ డబ్బూ, ఇక్కడొచ్చే జీతం రెండూ కలుపుకుని, చిన్నసైజు రాకుమారిలా జీవిస్తుంది రాణి. ఇది అందరికీ ఆమె చెప్పుకుంటున్న కథ.

కానీ ప్రభుత్వానికి ఆమె మనదేశ రహస్యాలు ఎవరికో అమ్మి, ఆ డబ్బుతో విలాసంగా జీవిస్తోందనిపిస్తున్నది. దాని అంతును తేల్చేందుకే అతన్ని పంపారిప్పుడు.

"ఎమరాల్డుకు పోనిమ్మంటారా?" అడిగాడు డ్రైవర్.

"పోనీ!" అన్నాడు ఆనంద్.

మరో పది నిముషాల్లో కారు అరంతస్తుల అందమైన భవనపు పోర్టికోలో ఆగింది. డ్రైవరు దిగి రిసెప్షనులోకి వెళ్ళి రెండు నిముషాలు మాట్లాడి వచ్చాడు.

"రూం ఖాళీ వుంది వెళ్ళండి" అన్నాడు డ్రైవరు.

ఆనంద్ డ్రైవరుకు ఇవ్వవలసిందానికన్నా పది రూపాయి లెక్కువిచ్చి పంపాడు.

ఆరొందలా ఇరవై మూడో నెంబరు గది తాళం తీసుకుని, లిఫ్టు ఎక్కి ఆరో అంతస్తు చేరుకుని గది తలుపు తెరచి లోనికి వెళ్ళి మూశాడు. వెనక వైపునుండి రెండు బలమైన చేతులు అతని మెడను పట్టుకుని నులిమేందుకు ప్రయత్నించసాగాయి.

ఆనంద్ వూపిరి బిగించి దమ్ములాగి, ముందున్న తలుపును ఆసరాగా చేసుకుని వెనక్కు బలంగా తోశాడు. మెడపైని పట్టు తప్పటంతోపాటు 'ధన్' మన్న శబ్దం వినిపించింది.

గిరుక్కున వెనక్కి తిరిగి చూశాడు. నేలపైన వెల్లకిలా పడున్న లావుపాటి వ్యక్తి కనుపించాడు.

అరక్షణమన్నా ఆలస్యం కాకుండా, బూటు కాలితో అతని మొహంమీద తన్నాడు. రబ్బరుసోల్ క్రింద పడున్న మనిషి ముక్కుకు తగిలి, రక్తం కారటంతో పాటు తల వ్రేలాడిపోయింది.

లైటు వేశాడు. ఆ మనిషి స్పృహతప్పి పడిపోయి వుండటంతో వంగి మోకాళ్ళపైన కూర్చుని, అతని జేబులన్నీ వెతికాడు. అతని దగ్గరొక పొడవాటి కత్తి, చిన్న రివాల్వరు దొరికాయి. ఆ రెండూ తీసి జేబులో వేసుకున్నాడు.

బాత్ రూమ్‌కు వెళ్ళి చల్లటి నీళ్ళలో మొహం కడుక్కుని గదిలోకి వచ్చాడు. ఆ వ్యక్తికి స్పృహ రాలేదు.

ఆనంద్‌కు తన రాక, అవతలి పార్టీకి తెలిసిపోయిందన్న విషయం అర్థమైంది. ఇక్కడికి అతను వస్తున్నట్లు, ఢిల్లీలో వున్న డైరక్టర్ జనరల్ కుమార్‌కు, మద్రాసులో వున్న డైరక్టరుకూ తప్ప మరెవరికీ తెలియదు. అలాంటప్పుడు ఈ సంఘటన ఎలా జరిగి వుంటుందని వూహించసాగాడు.

అక్కడ వుండటం అంత క్షేమం కాదనిపించింది. టెలిఫోన్ వైరు తెంచి, ఆ మనిషి కాళ్ళూ, చేతులూ కట్టేసి గదిలోంచి బైటపడ్డాడు.

వేగంగా క్రిందకు దిగి, రిసెప్షను ముందుకు వెళ్ళి

అంతకు ముందు తనకు గది నెంబరు చెప్పిన మనిషిని పలకరించి "నేనిందాక టాక్సీలో వచ్చాను. ఆ డ్రైవరే రూం విషయం మాట్లాడాడు. అతని పేరు తెలుసా?" అడిగాడు.

"తెలీదు! ఏం అవసరమా?" అడిగాడు రిసెప్షనులో వున్న వ్యక్తి.

"టాక్సీలో నా పర్సు పడిపోయింది. అందులో చాలా ముఖ్యమైన కాగితాలున్నాయి" అన్నాడు ఆనంద్.

"అలాగా? అయితే ఒకక్షణం కూర్చోండి. గేటు దగ్గరున్న గూర్ఖాకు తెలిసివుంటుంది కనుక్కొని చెప్తాను" అన్నాడతను.

ఆనంద్ సోఫాలో జేరబడ్డాడు.

రెండు నిముషాల తర్వాత ఆనంద్‌ను పిలిచాడు రిసెప్షనులోని వ్యక్తి. ఆనంద్ లేచి అతనివద్దకు వెళ్ళాడు.

"అదృష్టవంతులు. అతని పేరు అల్లాడిన్. టాక్సీ నెంబరు ఎం. ఎస్. వై. నాలుగువేలా ఆరొందలా నలభై ఆరు. అతనుండేది ఆళ్వారుపేటలోని పాయస్ రోడ్‌లోని నలభయ్యారో నెంబరు ఇంట్లో" అని చెప్పాడు.

"థాంక్స్! నాకరించి చాలా శ్రమపడ్డారు" అంటూ జేబులోంచి పదిరూపాయల నోటుతీసి టేబుల్ పైన పెట్టాడు.

"ఇందులో శ్రమేంలేదు!" అంటూ నోటందుకుని, "మీ పర్సు పోయిందన్నారు" అన్నాడు నోటుకేసి చూస్తూ.

"అందులో డబ్బు పెట్టడం నాకలవాటులేదు" అంటూ అక్కణ్నించి వెనక్కి తిరిగి గేటువేపు నడిచాడు.

# 2

'సింపుల్ అపార్ట్‌మెంట్స్' అనే బోర్డు వున్న గేటు ముందాగాడు ఆనంద్.

గంట పదకొండు కావస్తోంది.

ఆరంతస్తుల పెద్దభవనం అది. అందులో మూడో అంతస్తులో వున్న ముప్పయ్యొనిమిదవ నెంబరు ఫ్లాట్‌లో వుంటోంది రాణి.

కాంపౌండులోకి ప్రవేశించాడు. తిన్నగా మెట్లెక్కి వెళ్ళాడు మూడో అంతస్తుకి.

రాణి ఫ్లాట్ ముందు ఆగి చూశాడు. ఫ్లష్‌డోరుకు పై భాగాన కాలింగ్ బెల్ వుంది. దాన్ని నొక్కాడు.

రెండుక్షణాల తర్వాత తలుపు కొద్దిగా తెరచుకుంది.

"ఎవరు నువ్వు?" అడిగింది అవతలున్న రాణి.

ఆమె తలంతా చెదరివుండటం గమనించాడు ఆనంద్. వేసుకున్న సన్నటి నైట్ గౌన్‌లోనుండి, తెల్లటి బ్రాసరీ స్పష్టంగా కనుపించసాగింది. దాని వెనుక నున్న ఎత్తుల అందాల్ని, కొలతల్ని ఊహించుకుంటూ నిరుత్తరుడై నిలుచున్నాడు.

"నిన్నే! ఎవరునువ్వు? ఎవరు కావాలి?" అడిగింది రాణి విసుగ్గా.

"నా పేరు ఆనంద్. హెడ్ క్వార్టర్సునుండి వచ్చాను. నీవు కోరిన రక్షణ నీకు కల్పించవలసిందిగా నన్నాదేశించారు" అన్నాడు ఆనంద్.

"అందుకు ఋజువు?"

పాంటు జేబులోనుండి తన ఐడెంటిటీ కార్డుతీసిచ్చాడు ఆనంద్. రాణి దాన్నందుకుని పరిశీలనగాచూసి తలుపు

బార్లా తెరిచింది. ఆనంద్ లోనికి వెళ్ళగానే తలుపు మూసింది.

హాల్లోనున్న సోఫాల్లో కూర్చున్నారిద్దరు.

"చాలా బాగుంది?" అన్నాడు ఆనంద్.

"ఏమిటి?

"నీయిల్లు."

"అదా? అద్దెకొంప!"

"అసలు విషయానికొద్దాం! నీ సమస్య నాకు వివరంగా చెప్పు?"

"నీకెంతవరకు తెలుసు?" అంది రాణి.

"నిన్నెవరో బెదిరించి రహస్యాలు సేకరిస్తున్నారనీ, వాళ్ళనుంచి రక్షింపమనీ నువ్వు అభ్యర్థించినట్లు మాత్రం తెలుసు. అంతకన్నా మరింకేమీ తెలియదు" అన్నాడు ఆనంద్.

"నేనింతకు ముందు అహమ్మదాబాద్‌లో పని చేసేదాన్ని. ఇక్కడకొచ్చి సంవత్సరమయింది.

ప్రతి శనివారం రాత్రి ఈగల్ బార్‌కు వెళ్ళేదాన్ని. అక్కడ నాకొక వ్యక్తి పరిచయమయ్యాడు. అతను డబ్బును నీళ్ళలా ఖర్చుపెట్టేవాడు. అతన్ని చూస్తే అక్కడున్న వాళ్ళంతా ఎంతో విధేయతతో వుండేవాళ్ళు.

అతనే నన్ను పరిచయం చేసుకున్నాడు. మా ఇద్దరికీ కొంత స్నేహం కలిసింది. కలిసినపుడల్లా మంచి మంచి ఫారిన్ వస్తువులు తెచ్చి బహుమానంగా యిచ్చేవాడు. మాటల్లోకి దించి, ఏవేవో అడిగేవాడు. కాస్త విస్కీ

పుచ్చుకున్నాక ఏం మాట్లాడేదాన్నో నాకే తెలీకుండా పోయేది. మారుసటి దఫా కలిసినపుడు, నేనే చెప్పాను అంటూ, కొన్ని రహస్యమయిన విషయాలు తనకు తెలిసి నట్లు, వివరించేవాడు. ఆ తర్వాత అతనేవేవో వివరా లడిగి, మరువారం కలసినపుడు, ఇవ్వమనేవాడు.

రెండుమూడు సార్లు వీలుకాదన్నాను. అయితే అంతకి ముందు నేను తనకి చెప్పిన వివరాలు, నాపై అధికారులకి చెప్తానని బెదిరించేవాడు. నాకిటూ పాలుపోక, అతను అడిగిన సమాచారం సేకరించి ఇచ్చేదాన్ని.

ఇంతకు ముందుదాకా అతనడిగిన విషయాలన్నీ, చాలా మామూలుగా వుండేవి. ఈమధ్య చాలా రహస్యమయి నవి, దేశరక్షణకు సంబంధించినవి అడగడం మొదలు పెట్టాడు.'' అంటూ ఆగింది రాణి.

ఆనంద్ సిగరెట్ తీసి వెలిగించుకొని, ''ఎలాంటి విష యాలడిగేవాడు. తెలియాలి నాకు. ఉదాహరణకు ఒకట్రెటి చెప్పు'' అన్నాడు.

''తూర్పుతీరంలో స్మగ్లింగ్ అరికట్టేందుకు యెంత మంది అధికారులు పనిచేస్తున్నారని అడిగాడు ఒకసారి. ఇంకోమారు, ఎన్ని మోటారు లాంచీలు వున్నాయని అడిగాడు'' అంది.

''ఈమధ్య అడుగుతున్న విషయాలేమిటి?''

''మద్రాసుకు దగ్గరలోవున్న అటమిక్ రియాక్టర్ దగ్గర పనిచేసే రక్షణ దళంకోసం ఎన్నిజతల బూట్లుకొంటారు? తూర్పుతీరంలో ఎన్ని సబ్ మెరైన్లు తిరుగుతున్నాయి. వాటిల్లోవుండే ఆయుధాలేమిటి? మొదలయినవి?'' అంది రాణి.

"ఇదంతా ఆర్మీకి సంబంధించిన విషయం కదా? నీకు ఎలా తెలుస్తుంది?" అడిగాడు ఆనంద్ అర్థంగానట్లు.

"దక్షిణప్రాంతంలో ఆర్మీ ఇంటలిజెన్స్ కూడా మేము చూస్తోన్నాము. అందుకే ఇక్కడి డైరెక్టరు ఆర్మీనుంచి తీసుకోబడ్డాడు." అంది రాణి.

"అలాగా? అయితే ఈ సమాచారం అందజేశావా?"

"లేదు."

"ఎందుకని?"

"ఇష్టంలేక."

"నిన్ను రక్షించమని హెడ్ క్వార్టర్సుకు అడగడం అన్నా, మీ డైరెక్టరుకు చెపితే సరిపోయేది గదా?" కడిగాడు ఆనంద్.

"అతన్ని నమ్మలేకపోయాను."

"ఐసీ. నిన్ను ఇప్పుడు వాళ్ళేమని బెదిరిస్తున్నారు?"

"వాళ్ళడిగిన సమాచారం అందించకపోతే, నేను మరో పురుషుడితో కులుకుతున్నట్లు నిరూపించే ఫోటోలు నా భర్తకు పంపుతామంటున్నాడు."

"అంతేనా?" త్రోసివేసినట్లన్నాడు ఆనంద్.

"ఆ ఫోటోలు సాకుగా, అతను నానుండి విడాకులు సులభంగా పంపుతాడు. అతను నెలనెలా పంపుతున్న డబ్బురాదు. అదిరాకంటే నాపని ఖాళీ."

"అయితే ఇప్పుడేం చేద్దామంటావ్?" అడిగాడు ఆనంద్.

"నువ్వే ఆలోచించు."

"అందుకు టయిమ్ కావాలి. నీకభ్యంతరం లేకుంటే

ఈ రాత్రికిక్కడ సోఫాలో పడుకుంటాను. నువ్వు నీ గదిలో పడుకుని గడియపెట్టుకో!" అన్నాడు ఆనంద్.

"తెల్లారాక నువ్వెవరని అందరూ అడిగితే..."

"అలాంటి అవసరం రాకముందే లేచి వెళతాను. సరేనా?" అన్నాడు ఆనంద్.

"సరే" అంది రాణి. లేచి బెడ్రూంలోకి వెళ్ళిపోయింది. ఆమె నడకకు నలిగిపోయిన పిరుదులు అందమయిన నృత్యభంగిమల్ని అభినయిస్తూంటే చూచి చిత్తయిపోయాడు ఆనంద్. రాణిలో అందం, ఆకర్షణ, దాన్ని ప్రదర్శించడంలో చాతుర్యం అన్నీ వున్నాయనిపించింది.

లైట్ ఆఫ్ చేసి తనుకూడా సోఫాలో నడుంవాల్చాడు.

## 3

ఎక్కడో దూరంగా 'గణగణ' మంటూ అలారం మ్రోగిన శబ్దం రావటంతో ఆనంద్ లేచి కూర్చున్నాడు. హాల్లో లైట్లు వెలుగుతున్నాయి. కాఫీకప్పుతో ప్రత్యక్షమైంది రాణి.

"బాగా నిద్రపట్టిందా?" అడిగింది రాణి కప్పు అందిస్తూ.

"ఆఁ!" కప్పు అందుకున్నాడు.

"నీకోసం త్వరగా నిద్రలేచాను." అంది రాణి.

"థాంక్స్!"

"ఏమాలోచించావ్?"

"నీ భర్తను ఇక్కడ ఎవరికన్నా తెలుసా?"

"తెలీదు!"

"అయితే ఒకపని చేద్దాం. నేను నీ భర్తగా నటిస్తాను. ఈ దినమే నేను ఇండియాకు వచ్చానని అందరికీ చెప్పు" అన్నాడు ఆనంద్.

"దానివల్ల ప్రయోజనం వుంటుందా?" అనుమానంగా అడిగింది రాణి.

"నువ్వు వాళ్ళడిగిన సమాచారం దొరకలేదని చెప్పు. వెంటనే వాళ్ళు నన్ను కలుసుకునేందుకు ప్రయత్నిస్తారు. దాంతో వాళ్ళకూ, నాకూ ప్రత్యక్ష సంబంధం ఏర్పడుతుంది. అప్పుడు సులభంగా వాళ్ళను పట్టుకోగలుగుతాను. ఏమంటావ్?" అడిగాడు ఆనంద్.

"పథకం బాగానేవుంది" అంది రాణి.

"అయితే నేను వెళ్తాను" అన్నాడు ఆనంద్ కప్పు క్రింద పెట్టి.

"మనం ఎక్కడ కలుసుకుందాం?"

"సాయంత్రం ఐదుగంటలకు సెంట్రల్ స్టేషన్ కురా. నేను బొంబాయినుండి వచ్చిన ఎక్స్ప్రెస్‌లో వస్తున్నట్లు మీ ఫ్రెండ్సుకూ, డైరెక్టరుకూ చెప్పు. అక్కణ్నించి ఇద్దరం ఇల్లుచేరుదాం. కాపురం ప్రారంభిద్దాం" అన్నాడు ఆనంద్.

"ఇల్లు చేరటంవరకే! కాపురం సంగతి అలావుంచేయ్" అంది రాణి సీరియస్‌గా.

## 4

చీకటి దట్టంగా వుంది.

ఆనంద్ తనకు కావలసిన నెంబరు ఇల్లు వెతుక్కుంటూ వెళ్లాడు. వీధిచివర్న పాడుబడ్డ పెద్ద ఇల్లది. ఇంటిముందు పెద్ద వేపచెట్టు కనిపించింది.

మెల్లిగా కాంపౌండ్‌లోకి ప్రవేశించాడు. ఎక్కడా దీపాలు వెలుగుతున్నట్లు కనిపించ లేదు.

బిల్డింగ్ నానుకొని, పక్క మంచం వేసుకొని పడుకున్న వ్యక్తి కదలకుండానే "ఎవరది?" అన్నాడు గద్దిస్తున్నట్లు.

"టాక్సీ డ్రైవర్ అలాడిన్ ఇక్కడేనా వుండేది?" అడిగాడు ఆనంద్.

"పేరు తెలీదు. ఆ వెనక వేపు ఎవరో వుంటున్నారు. వెళ్ళి అడగండి" అన్నాడు మంచం పైన పొర్లి పడుకుంటూ.

ఆనంద్ ఇంటి ప్రక్కగా వెనక వేపుకి నడచి వెళ్ళాడు. సన్నగా వెలుగుతున్న లాంతరు మధ్య పెట్టుకుని చుట్టూ చేరి పేకాట ఆడుతున్న నలుగురు మనుషులు కనుపించారు.

"అలాడిన్!" పిలిచాడు ఆనంద్ ఆ నలుగురిలో అతను కూడా వున్నాడేమోననుకుంటూ.

పేకలు వున్నపళాన పారేసి నలుగురూ లేచి నిలుచున్నారు. క్షణంలో ఆనంద్‌ని చుట్టుముట్టారు.

"అలాడిన్ కోసం వచ్చావా?"

"వాడితో ఏం పని?"

"వాడ్ని ముందే తెలుసా?"

"వాడ్ని చూపించమంటావా?"

నలుగురూ నవ్వుతూ నాలుగు ప్రశ్నలు వేశారు. ఆనంద్‌కు అక్కడి వాతావరణం అర్థమైంది.

"నీ అంతు చూసేందుకు మేము రాత్రినుండి ఇక్కడే కాపలా కాస్తున్నాం. ఇంక రావేమోననుకున్నాం. వచ్చావ్. మా పని సులభం చేశావ్!" అన్నాడు అందులో ఒకతను.

"నువ్వెవరు? ఈ వూగెందుకొచ్చావ్?" గద్దిస్తూ అడిగాడు ఒకతను. రెండోతను వెనుకనుండి చొక్కా కాలరు పట్టుకున్నాడు.

ముందున్న ఇద్దర్నీ రెండు కాళ్ళతో ఎగనిశన్ని, వెనుక నున్నవాళ్ళ మెడలు పట్టుకున్నాడు ఆనంద్.

మెరుపు దాడిలాటి అతని తాకిడికి తట్టుకోలేక పోయారు. నలుగుర్నీ కలేసి, కాళ్ళతో, చేతుల్తో చావ గొట్టాడు.

ముగ్గురు పలాయనం చిత్తగించారు. నాలుగోవాడు ప్రయత్నించాడు. కానీ వెళ్ళలేకపోయాడు.

అతన్ని ఇంట్లోకి తోసుకెళ్ళి, రివాల్వరు గుండెల కెదురుగా పెట్టి పట్టుకుని, "నన్ను చంపమని నిన్ను పురమాయించిందెవరు? చెప్పు!" గద్దించాడు ఆనంద్.

"నాకు తెలీదు!" అన్నాడతను.

"నీకు తెలీకుండానే ఇక్కడికెందు కొచ్చావ్? నా కోసం ఎందుకు కాపలా కాస్తున్నావ్? మీ నాయకు డెవరో చెప్తే నిన్ను ప్రాణాలతో వదుల్తాను. చెప్పు. పది అంకెలు లెఖ్ఖపెడతాను. ఆలోగా చెప్పాలి. లేకుంటే ఇందులోని ఆరుగుండ్లు, సరసరమని దూసుకొచ్చి నీ గుండెల్ని కాల్చివేస్తాయి" అన్నాడు ఆనంద్.

"నిజంగా నాకు తెలీదు. ఎమరాల్డ్ హోటల్ మేనేజరు ఇక్కడికి అలాడిన్ కోసం వెతుక్కుంటూ వచ్చే మనిషిని చంపితే పదివేలిస్తానన్నాడు. అందులో ఐదువేలు అడ్వాన్స్‌గా ఇచ్చాడు. అందుకే వచ్చాను" అన్నాడతను.

"అయితే వెళ్ళిపో! నా కెప్పుడూ ఎదురు రాకు!" అంటూ అక్కడ్నించి బయలుదేరి వచ్చేశాడు ఆనంద్.

## 5

మద్రాసు సెంట్రల్ స్టేషన్ హడావిడిగా వుంది.

ఒక స్టాల్ వద్ద నిలుచుని రాణి కోసం చూడ సాగాడు ఆనంద్. బొంబాయి ఎక్స్‌ప్రెస్ వచ్చి అప్పటికి పదినిముషాలయింది. ఇంత ఆలస్యం కావటానికి కారణ మేమిటని ఆలోచించసాగాడు.

"హలో!" అంటూ వెనకనుండి ఎవరో పలకరించి నట్టయి వెనక్కి తిరిగి చూశాడు. రాణి కనుపించింది.

ఎర్రటి షిఫాను చీర, అదే రంగు జాకెట్ వేసుకుంది. టొమేటో రెడ్ లిప్‌స్టిక్ పెదాలకు పులుముకుంది. కాళ్ళ కున్న చెప్పులూ; చేతిలో వున్న బ్యాగ్ కూడా ఎర్ర రంగులో వున్నాయి.

"హల్లో! వెళ్దామా?" అన్నాడు ఆనంద్.

"ఆఁ!" అంది రాణి.

"చాలా రోజుల తర్వాత భర్తను కలుసుకున్న భార్య అందులోనూ మోడర్న్ వైఫ్ ఇలానే స్వాగతం చెబు తుందా?" అడిగాడు ఆనంద్.

"ఇంకెలా చెపుతుంది?"

"ఆత్రుతగా కౌగలించుకుని, భర్త శరీరానికి అల్లుకు పోయి, మొహాన్ని మొత్తం ముద్దులతో ముంచెత్తుతుంది" అన్నాడు ఆనంద్.

"అది నాకూ తెలుసు. కానీ మనిద్దరం ఎడ మొహాం, పెడ మొహాంగా వున్నాము. నువ్వు నానుండి విడాకులు

తీసుకోవాలనుకుంటున్నావ్. అందువల్లనే నువ్విలా కాస్త దూరంగా వుండటం సహజంగా వుంటుంది'' అంది రాణి.

''అదికూడా పాయింటే, మరచిపోయాను.''

ఇద్దరూ జనాన్ని తప్పించుకుంటూ ముందుకు నడిచారు. గేటుదాటి బయటికొచ్చి టాక్సీ ఎక్కారు.

''సింపుల్ అపార్ట్‌మెంట్స్.'' అంది రాణి.

''మనం విడాకులు తీసుకోవడం గురించి ఏం నిర్ణయించావ్?'' అడిగాడు ఆనంద్ ప్రక్కనే కూర్చున్న రాణి కాలు తొక్కుతూ.

''నీకిష్వదలచుకోలేదు.''

''నీ ప్రవర్తన బావుండడంలేదని, నాకు చాలామంది ఉత్తరాలు రాశారు'' అన్నాడు ఆనంద్.

''గిట్టనివాళ్ళు ఏమయినా రాస్తారు. ఎన్నయినా అంటారు. రుజువులున్నాయా? ఉంటే కోర్టుకెళ్ళు'' అంది రాణి.

''నేను వెళ్ళేలోగా నాకా ఋజువులు దొరుకుతాయని నమ్మకం వుంది. ఈమారు నీనుండి విడాకులు తీసుకుని మరీ వెళ్తాను'' అన్నాడు ఆనంద్.

''అదీ చూద్దాం!'' అంది రాణి.

టాక్సీ సింపుల్ అపార్ట్‌మెంట్స్ ముందాగింది. ఇద్దరూ దిగి బిల్డింగువైపు నడిచారు.

''టాక్సీలో ఎందుకలా మాట్లాడావ్?'' అడిగింది రాణి మెల్లెక్కుతూ.

"ఆ డ్రైవరు అద్దంలో మనల్ని అదేపనిగా చూస్తున్నాడు. ఎందుకయినా మంచిదని అలా అన్నాను. కోపం వచ్చిందా?"

"లేదు. నేను నీ భార్యను కానుగా!" అంది రాణి నవ్వుతూ.

ఇద్దరూ తమ ఫ్లాటులోకి చేరారు.

"నిన్ను వేధించే ఆ మనిషిని గురించి నీకు తెలిసిన వివరాలు చెప్పు వింటాను" అన్నాడు ఆనంద్.

"చెప్తాను!" అంటూండగా బెల్ మ్రోగింది. రాణి లేచివెళ్ళి తలుపు తీసింది. అవతల మనుషుల్ని చూసి లోనికి రమ్మని పిలిచింది. ఆమె వెంట ఒక మగమనిషి, మరో ఆడమనిషి వచ్చారు.

"ఏమండీ!" అంది ఆనంద్ను.

ఆనంద్ లేచి నిలుచున్నాడు.

"వీరు మనయింటిపైనుంటారు. ఈయన పేరు డేవిడ్. ఆమె పేరు మేరీ. చాలా మంచివాళ్ళు," అంటూ ఆనంద్ను చూపించి, "వీరు నాభర్త. ఇవాళే వచ్చారు" అంటూ పరిచయం చేసింది.

"అల్లుడన్నమాట. ఏమండోయ్! అమ్మాయితో కాపురం చెయ్యకుండా ఎక్కడో దూరంగా వుండడం గాక, విడాకులు కావాలని అవాకులూ చెవాకులూ ప్రేలుతున్నారట. అవన్నీ నేను ఒప్పుకోను. ఇంక ఇండియాలోనే వుండిపోయి హాయిగా కాపురం చేసుకో! ఏమంటావ్?" అడిగాడు డేవిడ్.

"మీరంతగా చెప్పాలటండీ! అబ్బాయిని చూస్తేనే తెలుస్తుంది బుద్ధిమంతుడని. అలాగే కాపురం చేస్తాడు లెండి" అంది అతని భార్య.

ఆనంద్ అవాక్కయి నిల్చున్నాడు. క్షేమ సమాచారాలు మాట్లాడి ఐదు నిముషాల తర్వాత వెళ్ళిపోయారు వాళ్ళు.

రాణి తలుపులు మూసి లోనుండి తాళం వేసుకొచ్చింది.

"ఇందాక నేనడిగిన ప్రశ్నకు జవాబు చెప్పబోతుండగా వచ్చారు వాళ్ళు పానకంలో పుడకల్లా" అన్నాడు ఆనంద్.

"అలాగనకు. అంతవయస్సులోగూడా వాళ్ళు ఒకర్ని విడచి ఒకరు వుండరు. అతను త్రాగుబోతని తెలిసినా ఆమె ఎంతో ఆప్యాయంగా చూసుకుంటుంది" అంది రాణి.

ఆనంద్ ఏం మాట్లాడలేదు.

"నాకు రెస్టు కావాలి. నా బెడ్ రూంలోకి వెళ్దాంరా. నేను మంచం మీద పడుకొంటాను. నువ్వు అక్కడే కూర్చోవచ్చు. మనం మాట్లాడుకునేదేదో అక్కడే చేద్దాం!" అంది రాణి.

"థాంక్స్. ఈ కొత్త భర్తకు ప్రమోషన్ ఇచ్చినందుకు సంతోషం!"

"ప్రమోషనా?" అర్థం కానట్లు చూసింది రాణి.

"కాదా? రాత్రి హాలు, ఇవాళ బెడ్ రూంలో బెడ్ ప్రక్కన కుర్చీ. అన్నీ బాగుంటే రేపు..."

"మళ్ళా హాల్లోకి డిమోషన్ ఇస్తాను" అంది నవ్వుతూ రాణి.

ఇద్దరూ లేచి బెడ్ రూంలోకి వెళ్ళారు.

రాణి రెండు దిండ్లు తలకింద పెట్టుకుని పడుకుంది. ఆనంద్ ప్రక్కనున్న సోఫాలో కూర్చున్నాడు.

"అతన్ని నువ్వు ఎక్కడెక్కడ చూశావో చెప్ప గలవా?"

"శనివారం ఆ క్లబ్ లో తప్ప మరెక్కడా చూడ లేదు."

"అతని వేషం, భాష, నడక మొదలైనవన్నీ సహ జంగా వున్నాయా? లేక కృత్రిమంగా కనుపించాయా?" అడిగాడు ఆనంద్.

"నాకేం కృత్రిమంగా కనుపించలేదు."

"అతనిని ఆ క్లబ్ లో పలకరించే స్నేహితులెవరన్నా వున్నారా?"

"లేరు! అతను ఎవరితోనూ మాట్లాడుతూండగా నేను చూడలేదు."

"గుడ్! మీరిద్దరు మళ్ళీ కలుసుకోవలసిం దెప్పుడు?"

"రేపు శనివారం. రాత్రికి కలుసుకోవాలి. అతనడిగిన సమాచారం అందజెయ్యాలి!"

"ఆ క్లబ్ లో నేనా కలుసుకోవడం?" అడిగాడు ఆనంద్.

"కాదు! ఈమారు సెంట్రల్ స్టేషను ముందున్న సబ్ వేలో వెయిట్ చేస్తానన్నాడు" అంది రాణి.

"గుడ్! అయితే రేపు నీకు నేనో బ్రాసరీ కిసెల్స్తానుఅందులోనున్న పాడింగ్ లో రెండుచిన్న బ్యాటరీలుఇస్తాను. వుంటాయి. మరో నెక్లెస్ ఇస్తాను. ఆ నెక్లెస్ ట్రాన్స్మిటర్లా డేటా లాగా పనిచేస్తుంది. దాని రిసీవరు నాదగ్గర వుంటుంది. అతను నువ్వూ మాట్లాడుకున్నవన్నీ నాకు వినిపిస్తాయి. అతని మాటల్ని బట్టి' అతను నీతో వ్యవహరించే ధోరణి తెలుస్తుంది.

నువ్వు చెయ్యవలసిందల్లా అతనడిగిన సమాచారం తెచ్చాననీ, ఏదయినా సురక్షితమైన స్థానానికి, అవసరమైతే అతనింటికి తీసుకెళ్లమని నువ్వు కోరటం. అందుకు అతన్ని ఒప్పించటం. ఆ తర్వాత మిగిలిన గొడవ నేను చూసుకొంటాను." అన్నాడు ఆనంద్.

"అక్కడికి తీసుకెళ్ళి నన్ను చంపేస్తే?"

"పాలిచ్చే ఆవు పొదుగు కోసుకునే పాపిష్టి వాడెవ్వడూ వుండడు!"

"అని ఏమిటి గ్యారంటీ?" అడిగింది రాణి.

"అతనికింకా నీనుంచి ఎంతో సమాచారం కావలసి వుంది" అన్నాడు ఆనంద్.

"నువ్వు చెప్పినట్లే చేస్తాను. వెళ్ళి విశ్రాంతి తీసుకో" అంది రాణి.

ఆనంద్ అయిష్టంగా లేచి గదిలోంచి వెలుపలకు వచ్చాడు.

## 6

రాణి డ్రస్ చేసుకొంది.

ఆనంద్ ఆమెకేసిచూసి "నెక్లెసు చాలాబాగుంది." అన్నాడు.

"నాకు నగలు ధరించే అలవాటు లేదు. ఇవాళ కొత్తగా నెక్లెను వేసుకున్నాను. అతను అనుమానిస్తాడేమోనని భయంగావుంది" అంది.

"ఆడవాళ్ళు రకరకాలుగా ముస్తాబుకావడం విచిత్రం కాదు. నువ్వు దీని విషయం మరచిపో! నేను నీ వెను కనే వుంటాను" అన్నాడు ఆనంద్.

ఇద్దరూ దిగి క్రిందికి వచ్చారు.

రాణికి వందగజాల దూరంలో వుండసాగాడు ఆనంద్. ఆమె దగ్గరున్న ట్రాన్స్‌మీటరులోంచి సంకేతాలు సన్నగా వినవస్తూన్నాయి. రాణి సబ్ వేలో దిగింది. ఆనంద్ పైమెట్టు పైన నిలుచున్నాడు. సంకేతాలు వస్తూనే వున్నాయి.

"హల్లో! రాణీ! వచ్చావా?" అన్నమాటలు విని పించాయి ముందు ఆనందుకు.

"రావుండా యెలావుంటాను?" రాణిగొంతు పలికింది.

"నెక్లెస్ కొన్నావా? చాలా బాగుంది. ఎంత ఖరీ దయింది" అతని మాటలు వినవచ్చాయి.

"మామూలుదే! పాతికరూపాయలయింది."

"నేను నమ్మను. డాలరు చాలా బావుంది! ఇలా ఇవ్వు చూద్దాం!"

"వద్దులెండి!"

"ఇవ్వు!"

ఆ తర్వాత మాటలు వినరాలేదు.

ఆనంద్ ఆత్రుతగా సబ్ వేలోకి మెట్లపైనుండి దూకి నట్లు పరుగుతో దిగాడు. లోపల రాణి కనిపించలేదు.

ట్రాన్స్మిటర్‌లో శబ్దాలు రాలేదు. ఆత్రంగా అవతల వేపునుండి మెల్లెక్కి పైకి వచ్చాడు. అక్కడా ఆమె కనిపించలేదు.

సెంట్రల్ స్టేషన్ ముందు టాక్సీ స్టాండులోకి వెళ్ళాడు. చకచక టాక్సీలన్నీ వెతికాడు. వాళ్ళ జాడ లేదు.

అతని బుర్ర గిర్రున తిరిగిపోయింది.

ఆ వచ్చిన మనిషి రెండో మాట లేకుండా ముందు నెక్లెస్ గురించి ఎందుకలా అడిగాడు. ఎలా దాన్ని అనుమానించగలిగాడో అర్థంగాలేదు. ఆమెను అతను ఎక్కడికి తీసుకుపోయి వుంటాడోనన్న కంగారు పుట్టింది. అయినా ఆమెకు ఇప్పుడప్పుడే ఏ విధమైన ప్రమాదం సంభవించదనిపించింది. అతనికి కర్తవ్యం బోధపడలేదు. టాక్సీ ఎక్కి తిన్నగా ఎమరాల్డ్ హోటల్‌కు పోనిమ్మన్నాడు.

టాక్సీలో కూర్చున్నాడు తప్ప మెదడు మాత్రం రకరకాల ఆలోచనలతో నిండిపోయింది. ఆ హోటల్‌కు, రాణి వెంటబడిన గ్యాంగ్‌కు ఏదో సంబంధముందనిపించింది. ఆమెను అతనా హోటల్‌కే తీసుకెళ్ళి వుండా అనిపించింది.

టాక్సీ హోటల్ ఆవరణలో ఆగింది. దిగి డబ్బిచ్చి లోనికి వెళ్ళాడు.

రెస్టారెంటు, బారు వెనుక వేపునున్న డ్యాన్సుహాలు, అన్నీ చకచక కలియ తిరిగాడు ఆనంద్. అక్కడ్నించి క్రింద అంతస్తులో వున్న గదుల ముందునుండి, పరిశీలనగా చూసుకుంటూ నడిచాడు.

ఆ తర్వాత రెండు, మూడు అంతస్తులు తిరిగేశాడు. అంతకు ముందురోజు తనున్న అంతస్తుచేరి, గదిలోకి తాళం తీసుకుని వెళ్ళాడు. అక్కడ యెవ్వరూ లేరు. లైటువేసి అంతా గాలించాడు ఏకయినా గుర్తులు దొరుకు తాయేమోనని. ఏమీ కనిపించలేదు. నిరాశగా వెలుపలి కొచ్చి తలుపులుమూసి, ఎలివేటరు యెక్కి క్రిందకు దిగి రిసెప్షన్‌లోకి వెళ్ళాడు.

"గుడ్ ఈవెనింగ్ సార్! ఏం కావాలి?"

"ఇదిగోనండి నాగది తాళం. బహుశా రాత్రికిరాను" అన్నాడు.

తాళం అందుకుంటూ "నిన్న మీతో అలాడిన్ కలి శాడా?" అడిగాడు అతను.

"ఓ! మరచేపోయాను మీకు థాంక్స్ చెప్పేందుకు. కలిశాడు. అతను చూసుకోలేదు. నాముందే టాక్సీ వెతి కాడు. పర్సు దొరికింది" అన్నాడు ఆనంద్ నవ్వుతూ.

"థాంక్స్!" అన్నాడతను.

"ఆమాట నేను చెప్పాలి!" అన్నాడు ఆనంద్.

"ఫరవాలేదు."

"నాకోసం యెవరయినా వస్తే అలాడిన్‌కోసం వెళ్ళా నని చెప్పండి."

"మళ్ళీ ఎందుకు సార్?"

"రాత్రి అతనికి బహుమానం ఇవ్వాలనుకున్నాను. అన్నీ ట్రావెలర్సు చెక్కులు వున్నాయి. ఇవాళ కాష్‌చేశాను- వెళ్ళి అతనికో వెయ్యి రూపాయలిచ్చి వస్తాను" అన్నాడు ఆనంద్.

"అంతడబ్బా?"

"అదెంత, ఆ పర్సు పోయివుంటే నాకో లక్షరూపా యలు నష్టం వచ్చేది." అన్నాడు ఆనంద్.

"అలాగా! అయితే ఎన్ని గంటలకు వెళతారుసార్" అడిగాడు అతను ఆనంద్‌ను.

"కొద్దిగా పనులున్నాయి. ఎలాగయినా రాత్రి పన్నెండు లోగా చేరుకుంటాను" అన్నాడు ఆనంద్.

"అలాడిన్ ఇక్కడికొస్తే మీరు అతనికోసం వెళుతు న్నారని చెప్తామనడిగాను" అన్నాడతను.

"అలాగే చెప్పు! వస్తాను" అంటూ వెలుపలికి వచ్చే శాడు. ఇంకెటుపోయి వెతికేందుకూ అతనికి తోచలేదు. తిన్నగా టాక్సీయెక్కి సింపుల్ అపార్ట్‌మెంట్స్ పోని మ్మన్నాడు.

గేటుదాటి లోనికిపోతుండగా డేవిడ్ ఎదురయినాడు. ఆనంద్‌ను చూడగానే "ఒక్కడివే వస్తున్నావ్? అమ్మా యేది?" అడిగాడు.

"వేరే పనిమీద వెళ్ళింది!"

"నువ్వుండేది నాలుగు రోజులు. కనీసం ఉన్నన్ని నాళ్ళు ఆమెను అంటిపెట్టుకొనుండు."

"అలాగేనండీ!" అంటూ బిల్డింగ్ వేపు వెళ్ళాడు ఆనంద్.

మెట్లెక్కి పైకివెళ్ళాడు. తలుపు మూసివుంది. అంతకు ముందే రాణి వచ్చివుందేమోనని కాలింగ్ బెల్ నొక్కాడు. తలుపు తీసేందుకు ఎవ్వరూ రాకపోవడంతో బాల్కనీ లోనే నిలుచున్నాడు.

అంతలో అందమైన పాడవుపాటి ఇంపాలా కారు కాంపౌండులోకి వచ్చింది.

అందులోంచి రాణీ దిగింది. ఆమె వెంట మరో పొడ వాటి వ్యక్తి దిగాడు. ఇద్దరూ బిల్డింగ్ వైపు వచ్చారు. ఆనంద్ అక్కడ్నించి ముందుకు వెళ్ళి మూలగా నిలుచున్నాడు.

ఇద్దరూ పైకి వచ్చారు. అపార్ట్ ముందున్న లైటు వెలుగులో గమనించాడు. మద్రాసులో సి. బి. ఐ. డైరెక్టరుగా పనిచేస్తున్న వ్యక్తి అతను.

రాణి అతని కారులో రావటం వింతగా తోచక పోయినా, విచిత్రంగా అనిపించింది.

వాళ్ళు గదిలోకి వెళ్ళగానే ఆనంద్ వెలుపలకు వెళ్ళి పోయేందుకు చకచక మెట్లవైపు వెళ్ళాడు. అప్పుడేవచ్చి ఆగిన లిఫ్టులోంచి వెలుపలికొచ్చిన డేవిడ్ ఆనంద్ని చూసి "అమ్మాయి ఇంకా రాలేదా?" అడిగాడు.

లేదన్నట్లు తలడ్డంగా ఊపాడు ఆనంద్.

"అయితే నాతోరా! కాస్త మందిస్తాను. వేసుకుంటూ కబుర్లు చెప్పుకుందాం!" అన్నాడు డేవిడ్.

"లేదండీ! ఈలోగా సిగరెట్లు తెచ్చుకుంటాను" అన్నాడు ఆనంద్ మెట్ల వైపు ముందుకుపోతూ.

## 7

సిగరెట్లు కొనుక్కుని గంటతర్వాత తిరిగి వచ్చాడు ఆనంద్. తలుపు తట్టగానే తెరుచుకుంది.

"ఏమయిపోయావ్?" అడిగింది రాణి తలుపు బార్లా తీసి.

"అసలేం జరిగింది?" అడిగాడు లోనికొచ్చి తలుపు మూసి గడియపెడుతూ.

"నా నెక్లెస్ చూస్తానంటూ బలవంతంగా లాగేశాడతను. ఆ తర్వాత నన్ను చెయ్యిపట్టుకుని వేగంగా లాక్కెళ్ళి కారెక్కించాడు. కారులోంచి నెక్లెస్ విసిరి పారేశాడు" అంది రాణి.

"ఎందుకని?"

"అది బాగాలేదన్నాడు. మంచి ఖరీదయినది తను కొనిస్తానన్నాడు."

"ఆ తర్వాత!"

"తనడిగిన సమాచారం సేకరించావాని అడిగాడు. ఫైల్సు దొరక లేదని చెప్పాను. ఈసారి శనివారం తెచ్చి ఇవ్వకుంటే, మనిషిగా ఎందుకు పుట్టానా అని అనుకొనేట్లు చేస్తానని బెదిరించాడు."

"ఏం చేస్తాడట?"

"ఒక బాటిల్ సల్ఫ్యూరిక్ ఆసిడ్ నా మొహాన పోయిస్తానన్నాడు" అంది ఏడుస్తూ.

"ఇంతకూ నిన్నెక్కడకు తీసుకెళ్ళాడు. నేను అంతా కలికి మరీవచ్చాను."

"కార్లోనే త్రిప్పాడు. మౌంట్ రోడ్డు దగ్గర దించి వేశాడు" అంది రాణి ఏడుస్తూ.

"ఏడవకు? నేనున్నాగా?"

"ఉండి ఏంచేస్తావ్? ఆసిడ్ పోస్తూంటే చూస్తూంటావ్? అంతేగా?" అడిగింది కోపంగా.

రాణికి ధైర్యం చెప్పేసరికి అతని తలప్రాణం తోక కొచ్చింది. గదంతా కలయజూసాడు. అంతా చిందర వందరగా ఉంది.

"ఏమిటిదంతా?"

"ఎవరో మనం లేనప్పుడు ఇల్లంతా సోదాచేశారు?"

"ఏవయినా వస్తువులు దొంగిలించారా?"

"లేదు?" అంది రాణి.

"ఇక్కడేముంటుందని వచ్చివుంటారు?" తనలోతనే అనుకున్నాడు పెకి.

"నా శవం!" అంది రాణి.

"అలా బెంబేలు పడకు. నువ్వు నిజంగానే ఆపదలో వున్నావ్. నాకు ఇప్పటికయినా నిజం చెప్పాలి. నన్ను మోసం చేసినందువల్ల నీకు జరిగే ఉపకారం వుండదు. పై పెచ్చు అపకారం జరుగుతుంది" అన్నాడు ఆనంద్.

"నేనేం అబద్ధాలు చెప్పలేదు."

"ఐతే నాప్రశ్నలకు సరయిన సమాధానాలు చెప్పు."

"ఇక్కడంతా చీకాకుగా వుంది. బెడ్రూంలోకి పోదాంపద!" అంది రాణి దారితీస్తూ.

ఆనంద్ కూడా ఆమె ననుసరించాడు.

"మీ బాస్‌తో నీకు అక్రమసంబంధం వుందా?" సూటిగా రాణి కళ్ళలోకిచూస్తూ అడిగాడు ఆనంద్.

"వుంది" అంది.

"అతనికి నువ్వు ఆఫీసు రహస్యాలు యెవరికో అమ్ముతున్నట్లు తెలుసా?"

"నేను అమ్మటం లేదు" అంది రాణి కోపంగా.

"ఆల్ రైట్. ఎవరికో చెప్తున్నట్లు తెలుసా?"

"తెలీదు!"

"అతనే ఇందులో ప్రధానపాత్ర వహిస్తూ, తనపైకి రాకుండా వుండేందుకు నిన్ను యెరగావుంచి నాటకమాడుతున్నట్లు నీకు యెప్పుడయినా అనుమానం కలిగిందా?" అడిగాడు ఆనంద్.

"లేదు!"

"బాగా ఆలోచించు. నువ్వతనికి సెక్రటరీగా పని చేస్తున్నావ్. నువ్వు మామూలుగా చూడటానికి అవసరం, అవకాశం, లేని కాగితాల నీ కళ్ళబడేట్లుగా అతను నీకు అవకాశాలు కల్పిస్తున్నాడేమో ఆలోచించు" అన్నాడు ఆనంద్.

రాణి కొంతసేపు మౌనంగా వుండిపోయింది.

"అలా అనిపించడంలేదు" అంది రాణి.

"రైటో! నిన్ను ఆ ముఠా వాళ్లు అడిగే ప్రశ్నలకు సమాధానాలు, నీకు ఆఫీసులో సులభంగా దొరుకుతూ ఉన్నాయా? లేక వాటికోసం యేదయినా రిస్కుతో కూడుకున్న ప్రయత్నాలు చెయ్యవలసి వస్తున్నదా" అడిగాడు ఆనంద్ ఎటో చూస్తూ.

"అన్ని రకాల రహస్యాలు నాకందుబాటులోనే వున్నాయి. మా బాస్ పర్సనల్ కస్టడీలో వుండవలసిన కాగితాలన్నీ నా ఆధీనంలోనే వున్నాయి. ఎప్పుడు ఏది కావాలంటే దాన్ని నేను చూడగలను" అంది రాణి.

"నీభర్త ఫోటో ఏదయినా నీ దగ్గరుందా?"

"ఉంది."

"ఎక్కడ?"

"నా బీరువాలో."

"ఓమారు తీస్తావా? చూస్తాను."

రాణి లేచివెళ్ళింది. బీరువా మొత్తం వెతికి అది కను పించక తిరిగివచ్చి "కనుపించలేదు!" అంది.

"ఇందాక నిన్ను కలిసిన వ్యక్తికి నీభర్త ఇండియాకు వచ్చినట్లు, ప్రస్తుతం నీతోనే వున్నట్లు చెప్పావా?"

"చెప్పాను" అంది రాణి.

"గుడ్! నువ్వు నిశ్చింతగా పడుకో!" అన్నాడు ఆనంద్.

"నిశ్చింతగా పడుకోవటం కుదరదు. ఇక్కడకి దగ్గరలోవున్న ఆటమిక్ రియాక్టర్ చూసేందుకు పాస్ తెచ్చి పెట్టమన్నాడతను" అంది రాణి.

"ఎంతమంది?"

"నలుగురు!"

"పేర్లు చెప్పాడా?"

"మిస్టర్ నవీన్ అండ్ పార్టీ అనిరాయించమన్నాడు"

"ఆపాస్ యెవరు ఇవ్వాలి?"

"మా బాస్ ఇవ్వాలి.అది లేకుంటే నా అంతుచూస్తామన్నారు. ఆ పాస్ సంపాదించటమంత సులభంకాదు. అక్కడికి ఎవర్నీ పోనివ్వరు" అంది రాణి.

"అమాట చెప్పలేదా నువ్వు."

"చెప్పాను. నేను తలచుకుంటే మా బాస్‌చేత యేదయినా చేయించగలనన్నాడు. అతను సంతకం చెయ్యడన్న అనుమానముంటే అన్ని ముద్రలువేసి ఫోర్జరీ చేయించి పట్టుకురమ్మన్నారు."

"ఇది చాలా సీరియస్ విషయమే!"అన్నాడు ఆనంద్.

"అందుకే భయంగావుంది. నన్ను చంపినా భయ పటను. కాని ఆసిడ్ పోసి, అందవిహీనురాల్ని చేస్తే, చూస్తూ ఎలా బ్రతకటం" ఏడుస్తూ అడిగింది రాణి.

"నువ్వేం భయపడకు. వాళ్ళ ఆట కట్టిస్తాను. నేచెప్పి నట్లు చెయ్యిచాలు" అన్నాడు ఆనంద్.

రాణి మాట్లాడలేదు.

"ఇంక పడుకొని నిద్రపో!" అంటూ గదిలోంచి వెలు పలకు వచ్చాడు ఆనంద్.

# 8

ఆనంద్ రేడియం డయల్ చూశాడు.

గంట పదకొండయింది.

టాక్సీ చేసుకొని గోపాలపురం పోనిమ్మన్నాడు. పెద్ద బంగళా ముందాగింది టాక్సీ. వెలుపల ఇద్దరు సెంట్రీలు నిలుచునివున్నారు. వాళ్ళకు తన ఐడెంటిఫికేషన్ కార్డు చూపించి లోని వెళ్ళాడు.

పోర్టికో దాటగానే చిన్న డ్రాయింగ్ రూం కనుపిం చింది. కాలింగ్ బెల్ నొక్కి, అందులోకెళ్ళి కూర్చు న్నాడు.

నైట్ డ్రస్సులోవున్న సి.బి.ఐ. డైరక్టరు మెట్లుదిగి క్రిందికొచ్చాడు. ఆనంద్ అలానే కూర్చున్నాడు. అతను కూడావచ్చి కూర్చొని "ఎవరుకావాలి?" అడిగాడు.

"మీరే!" అన్నాడు ఆనంద్ తన ఐడెంటిఫికేషన్ కార్డు అందిస్తూ.

దాన్నందుకుని చూశాడు డైరెక్టరు. వింతగాచూస్తూ, "ఇండియాలోకూడా మీకు పనులుంటున్నాయా?" అడి గాడు.

“ఆ! అప్పుడప్పుడూ” అంటూ కూర్చుండుకున్నాడు.

“మీ ప్రయాణం గురించి నాకు తెలీదు!”

“నేనొచ్చి మూడు దినాలయింది” అన్నాడు ఆనంద్.

“ఏమిటి విషయం?”

“అప్పుడే వివరాలు చెప్పలేను. నాకు కొద్దిగా సాయం కావాలి. కొంతమంది రౌడీలు నన్ను పట్టుకుని చంపాలని చూస్తున్నారు. వాళ్ళ భరతం పట్టాలనుకుంటున్నాను. అందుకు మెరికల్లాంటి ఇద్దరుమనుషులు మరో అరగంటలో కావాలి!” అన్నాడు ఆనంద్.

“ఓ.కే. ఏర్పాటు చేస్తాను” అన్నాడు డైరెక్టరు.

“రెండోది మీ సెక్రటరీ రాణిగురించి మీఅభిప్రాయ మేమిటి?” అడిగాడు ఆనంద్ అతన్ని పరిశీలనగా చూస్తూ.

“నాకు తెలిసినంతవరకూ ఆమె చాలా మంచిది. నమ్మకంతోపాటు నిజాయితీకూడా వుంది.”

“ఆమె ఆఫీసునుండి ఏవయినా రహస్యాలు బయటకు చేరవేస్తూవుండవచ్చునన్న అనుమానం మాకు కలగలేదా యెప్పుడూ?”

“లేదు!”

“ఎందుకయినా మంచిది. ఆమెనోకంట కనిపెట్టి వుండండి. నాకు పన్నెండు గంటలకల్ల అపాయింట్ మెంట్ వుంది. మీ మనుషులిద్దర్నీ ఆళ్వారుపేటలో, పోయస్ రోడ్ టర్నింగ్ దగ్గర నన్ను కలుసుకోమని చెప్పండి” అంటూ లేచాడు ఆనంద్.

“అసలు విషయం చెప్పలేదు!” గుర్తుచేశాడు డైరెక్టర్.

"చెప్తాను. అంతా ముగిశాక చెప్తాను" అంటూ కర చాలనము చేసి వెలుపలకు నడిచాడు ఆనంద్.

# 9

ఆనంద్ బయలుదేరి ఆళ్వార్ పేట వేపు కదిలాడు.

పదకొండూ నలభయ్యైదుకల్లా, పోయస్ రోడు సెంటర్ చేరాడు.

అక్కడ ఇద్దరు లావుపాటి మనుషులు కనుపించారు. ఆనంద్ వాళ్ళను పలకరించి, వాళ్ళ ఐడెంటిఫికేషన్ కార్డులు చెక్ చేసి, తిరిగి ఇచ్చాడు. వాళ్ళకు సూచనలిచ్చి, తను ముందుకు నడిచాడు.

నలభై ఆరో నెంబరు ఇంటి వెనుక వేపుకు చేరుకున్నాడు. అక్కడెవ్వరూ కనిపించలేదు.

రివాల్వరు వెలుపలికి తీసి, సేఫ్టీ కేచ్ రిలీజ్ చేసుకుని, చేతిలో పట్టుకొని, వరండా మెట్లెక్కి, ముందుగదిలోకి వెళ్ళాడు. అక్కడా యెవ్వరూ లేరు. అతనికి అర్థం కాలేదు.

అతని అంచనా ప్రకారం, తన్ను పట్టుకునేందుకు, ప్రత్యర్థులు గట్టిప్రయత్నంలో వుండాలి. కాని అలాంటి సూచనలేవీ కనుపించలేదు.

మరో గదిలోకి అడుగుబెట్టాడు.

"సింహంనోట్లో కడుగుబెట్టావ్. అది కబళించడం తథ్యం!"

గిరున చుట్టూ తిరిగి చూశాడు. ఎవ్వరూ కనిపించలేదు.

"నాకోసం చూస్తున్నావా? నాకు అదృశ్య శక్తులు ఉన్నాయి. నేను కనుపించను. కానీ నాకు నువ్వు కనుపిస్తున్నావ్" అన్నాడు అవ్యక్తి.

పైకి చూశాడు ఆనంద్ - కప్పతప్ప మరేంలేదు. సౌండు యెటునుంచి వస్తోందోనని చూశాడు. అర్థం కాలేదు.

"నువ్వున్న గదిలోంచి పడివేపుగావున్న ద్వారందాటి రా! కనుపిస్తాను" అందో కంఠం.

వెనక్కి చూశాడు ఆనంద్. తలుపులు మూసి వున్నాయి.

ఆ కంఠం చెప్పినట్లు గదిదాటి వెళ్ళాడు. అది విశాల మయిన హాలు. అందులో బాగా వెలుతురువుంది. దాదాపు పాతికమంది పైగా మెరికల్లాంటి వాళ్ళున్నారు. అందరి దగ్గర భయంకరమైన ఆయుధాలున్నాయి. అందరికీ మధ్యగానిల్చున్న వ్యక్తి మొహానికి ముసుగువుంది.

"నీ ధైర్యానికి మెచ్చుకొంటున్నాను. నీ పేరు ఆనంద్ గదూ!" అడిగాడతను.

"ఔను."

"రాణి మాకు రహస్యాలు అందజెయ్యకుండా ఆపేం దుకు వచ్చావ్? అవునా?"

"కాదు."

"కాదా? మరి దేనికివచ్చావ్?"

"నీ ఆట కట్టించేందుకు. నిన్ను యమపురికి పంపేం దుకు" అన్నాడు ఆనంద్ కోపంగా.

"అది అప్పటి ఆదర్శం! ఇప్పటి నిజం కనుపించిందా?"

"నీ మనుషుల్ని, ఆయుధాల్ని చూసి భయపడిపోయేం దుకు నేనేం పిరికి పందను గాను. నన్ను నువ్వేంచెయ్య లేవు" అన్నాడు ఆనంద్.

"ఆ రాణి అవసరం తీరాక ఆమెనూ, నిన్ను కలిపి

కట్టగట్టి, తుపాకీ గుండ్లతో మీ వళ్ళంతా తూట్లుపొడిచి ఆ తర్వాత సముద్రంలో పడేస్తాను. అంతదాకా ఇక్కడే పడివుండు!'' అన్నాడు ముసుగుమనిషి.

అతని మనుషులు చుట్టుముట్టి ఆనంద్ చేతిలోవున్న రివాల్వరును తీసుకున్నారు. కాళ్ళూ చేతులు కట్టిపడేశారు. ముక్కు దగ్గరేదో వాసన చూపించారు. ఆనంద్‌కు స్పృహపోయింది. అతని శరీరం చైతన్యంలేనట్లు కుప్పలా నేలపైన కూలిపోయింది.

''మీరిద్దరూ ఇక్కడేవుండి ఇతన్ని జాగ్రత్తగా కాపలా కాయండి!'' అన్నాడు ముసుగు మనిషి.

''అలాగే బాస్'' చెప్పారిద్దరూ.

ఆ ఇద్దరుతప్ప మిగిలిన మనుషులంతా వెలుపలకు వెళ్ళిపోయారు. అగది తలుపులుమూసి, ముందున్న వరండాలో కొచ్చి కూర్చున్నారిద్దరూ.

ఇద్దరూ బీడీలు వెలిగించుకున్నారు. పిచ్చాపాటీ మాట్లాడుకోవడం మొదలెట్టారు.

''ఆ వాసనదెబ్బకు నాలుగయిదు రోజులు స్పృహ రాదనుకుంటాను'' అన్నాడు ఒకడు.

''అవును. అంతకుముందుకూడా చూశాను'' అన్నాడు రెండోవాడు.

పదినిమిషాలతర్వాత సి.బి.ఐ. మనుషులిద్దరూ వచ్చేరు. వాళ్ళను చూడగానే కాపలాకు నియమించబడ్డ ఇద్దరూ తక్కున లేచి నిల్చున్నారు.

''ఎవరుమీరు?'' అడిగారు వాళ్ళు వచ్చిన ఇద్దర్నీ.

"బాస్‌ను చూడటానికి వచ్చాం. వున్నారా?" అడిగారు.

"ఎవరు మీరు?"

"హత్యలు చెయ్యటంలో ఆరితేరిన దాదాలం."

"బాస్ ఇక్కడకు రమ్మన్నాడా? ఇంతకు ముందే వెళ్ళిపోయాడు" అన్నారిద్దరూ తమతమ ఆయుధాలను క్రిందకు దించుతూ.

అదే అదనుగా ఇద్దరూ, లంఘించి వాళ్ళపైకి దూకి చావ చితకబాదారు. స్పృహ లేకుండా పోయేదాకా కొట్టిపడేసి, లోనికి వెళ్ళారు. ఆనంద్ దగ్గరున్న ట్రాన్స్‌మీటరుద్వారా జరిగిన సంభాషణంతా ముందుగా వాళ్ళు వినివుండడంతో సులభంగా నాటకం ఆడగలిగారు.

స్పృహ లేకుండా పడివున్న ఆనంద్‌ను తీసుకొని వెలుపలకొచ్చి, వీధి మూలలోవుంచిన కారులోకి చేర్చి, తిన్నగా హాస్పిటల్‌కు తీసుకెళ్ళారు. అతన్ని అడ్మిట్ చేసి వాళ్ళ డైరెక్టరుకు ఫోన్ చేశారు.

# 10

రాణి ఆఫీసుకు బయలుదేరేందుకు సిద్ధమయింది. ఆనంద్ రాత్రి వెళ్ళి, అంతదాకా తిరిగి రాకపోవడం ఆమెకు కొంత కలవరంగా వుంది.

ఇంతలో సూట్‌లోవున్న ఒక మనిషి వచ్చి, "ఆఫీసుకా?" అడిగాడు ఆమెను.

"ఎవరునువ్వు?" అడిగింది కోపంగా.

"నన్ను మరచిపోయావా? రాణీ, బాగా చూడు. నేను నీ భర్తను." అన్నాడతను.

"నాన్సెన్స్! నువ్వెవరో నాకు తెలీదు. నా భర్తవు కాదు" అంది రాణి అసహ్యించుకుంటూ.

"బాస్ నన్ను నీ భర్తగా కొన్నాళ్లు వుండమని పంపించాడు. నువ్వు ఇలా అంటావని అతనికి ముందే తెలుసులావుంది. ఎందుకయినా ఉపయోగం వుంటుందని చిన్న ఆసిడ్ బాటిలుకూడా ఇచ్చాడు. అది మొహాన చల్లితే రెండేరెండు సెకండ్లలో, బొబ్బలెక్కి, కాయలు కాచి, నల్లగా మాడిపోయి చూడటానికి జడుసుకొనే విధంగా తయారవుతుందని కూడా చెప్పాడు. జేబులో వుంది. చూపించనా?" అడిగాడతను.

భయంతో కంపించిపోయింది రాణి. శరీరం జావగారి పోయింది. "వద్దు" అంది.

"అయితే నన్ను నీ భర్తగా వప్పుకున్నట్లేనా?" అడిడతను.

"ఆఁ! ఇంతకూ ఏంకావాలి? బాస్ అడిగిన పాసు తెచ్చిస్తానని చెప్పానా?" అంది రాణి.

"చెప్పావ్? అది యెలాగయినా నీవెంటవుండి తీసుకు రమ్మన్నాడు. అందుకే పంపించాడు. అది మాకు చేరాక నీకూ మాకూ ఏవిధమైన సంబంధం వుండదని చెప్పాడు" అన్నాడతను.

"నా అసలు భర్త రెండుదినాల క్రితం వచ్చాడు. అతను ఇక్కడ నాతోనే వుంటున్నాడు. అతను వచ్చి చూస్తే అనవసరమైన అల్లరవుతుంది. అదీగాక, ఇక్కడ అందరూ అతన్ని చూశారు. ఇప్పుడు నువ్వు నా భర్తవని చెప్పితే యెవరూ నమ్మరు?" అంది రాణి.

'నీకాభయం అవసరంలేదు. నీ భర్తలా నటిస్తున్న

ఏజెంటు ఆనంద్ మాకు చిక్కిపోయాడు. మరో వారం దాకా అతడికి స్పృహరాకుండావుండే ఏర్పాట్లు ఎప్పుడో చేసి వుంచాము. ఆలోగా మా పని పూర్తి చేసుకొని వెళ్ళిపోతాం'' అన్నాడతను.

ఆ వార్త వినగానే ఆమెకు మతిపోయింది.

''నా భర్త ఏజెంటా?'' తెలీనట్లుగా అడిగింది.

''నీ నాటకాలు కట్టిపెట్టు. నీ అసలుభర్త ఫొటో మాదగ్గరవుంది. అతను నీ భర్త కాదన్న విషయం నీకూ తెలుసు.''

రాణి మరేం మాట్లాడలేదు.

''పద పోదాం!'' అన్నాడతను.

''ఎక్కడికి?''

''మీ ఆఫీసుకు.''

''నువ్వెందుకు? నేను ఎలాగో తంటాలుపడి పాను తీసుకొస్తాను'' అంది రాణి.

''అతంతేమిటో నీ వెంటవుండి చూడమన్నాడు బాస్'' అన్నాడు ఆ వ్యక్తి.

# 11

ఆఫీసులో డైరక్టరుకు తన నకిలీ భర్తను పరిచయం చేసింది రాణి.

అరగంటలో పాను తయారుచేసి సిద్ధంగా వుంచింది. సమయంచూసి డైరక్టరు దగ్గర సంతకం చేయించుకోవా లనుకొంది. దాంతోపాటు మరో పది అర్జెంటు లెటర్సు కూడా సంతకానికి సిద్ధంచేసింది.

మామూలుగా నాలుగుగంటలకు కాగితాలన్నీ తీసుకుని

అతని గదికి వెళ్ళింది. ఒక అరగంట ప్రేమకలాపాలు జరుగుతాయి. ఆ తర్వాత సంతకాలు చేస్తాడు. మామూలుగా రాణి తెచ్చిన కాగితాలు వివరంగా చూడటమతని కలవాటులేదు.

ఎప్పటిలాగే గదిలోకి వెళ్ళింది.

"ఏమిటి రాణీ?" అడిగాడు ఫైల్ కాలుస్తున్న డైరెక్టరు.

"ఏమీ లేదు." అంది.

"నీభర్త తిరిగి వచ్చినా, వుండవలసిన హుషారు లేదేం?"

"అతనంటే నా కసహ్యం. అతనిపీడ విరగడయితే బావుండు ననుకుంటున్నాను."

"అతనే విడాకులిమ్మన్నాడుగా?"

"ఆఁ!"

"మరి ఇప్పుడు ఇవ్వరాదా?"

"ఇంతదాకా అతని ఆస్తిలో వాటా వస్తుందని ఆశ పడ్డాను. ఇప్పుడు అదిలేకున్నా ఫరవాలేదనిపిస్తోంది, ఇచ్చేస్తాను. విడాకులిచ్చి పీడ విరగడ చేసుకుంటాను" అంది రాణి.

"సంతకాల కోసమా?" అడిగాడు కాగితాలు చూపిస్తూ.

"ఔను సార్!"

"ఇవాళ నాకు వేరే పనులున్నాయ్, అక్కడపెట్టు. రేపు చూస్తాను" అన్నాడు డైరెక్టరు.

"కాదుసార్! మొత్తం పదీ పన్నెండు మించిలేవు.

ఐదు నిముషాలకన్నా ఎక్కువ టైం పట్టదు." అంది రాణి.

"ఇవాళ కాగితాలు చూసే ఓపిక లేదు. రేపు చూస్తాను. అక్కడ పడేసిపో!" అన్నాడు డైరెక్టరు.

"వద్దులెండి! మళ్ళీ రేపు తెస్తాను. అక్కడా ఇక్కడా పడిపోయి" అంది రాణి.

"అయితే తీసుకెళ్ళు!" అన్నాడు డైరెక్టరు.

అతని ప్రవర్తనలోని మార్పుకు కారణం తన భర్త తనవెంట ఆఫీసుకొచ్చి, తన గదిలోనే కూర్చునివుండడం అయివుంటాలనుకొంది.

"తెచ్చావా?" అడిగాడు ఆమె నకిలీభర్త.

"ఆఁ, కానీ సంతకాలు కాలేదు" అంది రాణి.

"ఏం?"

"ఇవాళ బిజీగా వున్నాడట. రేపు చేస్తానన్నాడు."

"నిన్ననుభవించే మనిషి, నీవు తీసుకెళ్ళిన కాగితాలు సంతకం చెయ్యకుండా, రేపటికి వాయిదా వెయ్యడం విచిత్రంగా లేదూ!"

"లేదు! నా భర్తనంటూ నువ్వు ఇక్కడ వుండగా, అతను నాతో చనువుగా ఎలా ప్రవర్తిస్తాడు?" అడిగింది రాణి.

"ఓ.కే. రేపే చెయ్యమను. అంతదాకా వుంటాను" అన్నాడతను.

"సరే నాకు వేరే పనులున్నాయి. నువ్వు వెళ్ళిపో, రేపురా" అంది రాణి.

"లాభంలేదు! నిన్ను క్షణంకూడా వదలిపెట్టి వుండ వద్దన్నాడు బాస్" అన్నాడతను.

రాణి ఏం మాట్లాడకుండా, టేబుల్ సర్ది తాళం వేసి బయలుదేరింది.

# 12

ఆనంద్ కళ్లు తెరిచాడు. ఎదురుగా సి.బి.ఐ. డైరెక్టరు కనుపించాడు. లేచి కూర్చున్నాడు.

"ఎలావుంది?" అడిగాడు డైరెక్టరు.

"బాగానేవుంది. మీ మనుషుల సాయం లేకుంటే నేను వాళ్ళ చేతుల్లో హతమైపోయేవాణ్ని." అన్నాడు ఆనంద్.

"కాంట్ వర్రీ! రాణి భర్తవు నువ్వేగా?" అడిగాడు.

"ఆఁ, అలా నటిస్తున్నది నేనే!"

"ఇవాళ ఆమె అసలు భర్త వచ్చాడు. నాకు పరిచయం చేసింది. కానీ వాళ్ళ నడవడిచూస్తే ఏదో కృత్రిమంగా వుంది" అన్నాడు డైరెక్టరు.

"అసలు విషయం చెప్పమంటారా? రాణికసలు పెళ్ళే కాలేదు. ఆమె చూపించే ఫోటో ఆమె తమ్ముడిది. అతనామెకు డబ్బు పంపుతుంటాడు" అన్నాడు ఆనంద్.

"అయితే ఆమె అబద్ధాలెందుకు చెపుతున్నట్లు?"

"కనబడ్డ ప్రతివాడూ పెళ్ళిచేసుకోమనకుండావుండేందుకు. ఇష్టమైన మగాడితో ఇష్టం వున్నంతవరకే సంబంధము వుంచుకునేందుకు" అన్నాడు ఆనంద్.

"అలాగా? అయితే రాణి ఆపదలో వున్నట్లుంది" అన్నాడు డైరెక్టరు.

"ఔను! ఆమెను రక్షించాలి. ఆమె భర్త జేబులో

ఆసిడ్ బాటిల్ వుంది. ఆమె బాస్ కూడా నాకు తెలుసు. వెళ్దాం పదండి'' అన్నాడు ఆనంద్.

''ఎక్కడికి?''

''అందర్నీ కట్టగట్టి కలిపి పట్టుకునేందుకు.''

''ఐతే ఐ. జి. కి ఫోన్ చెయ్యనా!''

''చెయ్యండి. మఫ్టీలో వున్న పోలీసుల్ని సింపుల్ అపార్ట్‌మెంట్స్ చుట్టూ వుంచమని చెప్పండి'' అంటూ లేచాడు.

ఆనంద్, డైరెక్టరు ఇద్దరూ అడయారు చేరుకున్నారు.

రాణి అపార్ట్‌మెంట్ తలుపు తట్టారు. రెండు నిముషాల తర్వాత రాణి తలుపు తెరిచింది.

ఆనంద్‌ను చూడగానే ఆమె కళ్ళు మెరిశాయి.

వెలుపలకొచ్చెయ్యమన్నాడామెను. ఆమె తప్పక వెలికి రాగానే తలుపులుమూసి వెలుపలనుండి తాళం వేశాడు.

''రాణి మొగుడు లోపలుంటాడు కాసేపు. ఈలోగా వాడి బాస్‌ని అరెస్టు చేద్దాం రండి'' అంటూ మెట్లవేపు దారితీశాడు. మెట్లెక్కేటప్పుడు రాణి చెవిలో యేదో చెప్పాడు ఆనంద్. ముందామె ఒక్కతే వెళ్ళింది పైకి. మిగిలిన వాళ్ళంతా దూరంగా నిలుచున్నారు.

రాణివెళ్ళి డేవిడ్ అపార్ట్‌మెంట్ తలుపు తట్టింది. డేవిడ్ వెలుపలకు వచ్చాడు. రాగానే అతనిపైకి పది మంది దూకారు. అతన్ని పట్టుకున్నారు.

ఆనంద్ వెళ్ళి, తలపైనున్న విగ్ లాగి పారేశాడు. మీసాలు పీకాడు.

''ఇతనే నన్ను పాసు తీసుకురమ్మంది'' అంది రాణి.

"నాకు తెలుసు. అతని ఇంటికీ నీ ఇంటికి మధ్య ట్రాన్స్మిటరు పెట్టాడు. దాని మైకు నీ బెడ్రూంలో వుంది. మనం మాట్లాడుకు నేవన్నీ అతను వినగలుగుతూ వున్నాడు. అలాగే నీ రహస్యాలుకూడా తెలుసు కున్నాడు. నీ ఇల్లు సోదాచేసి నీ భర్త ఫోటోకూడా దొంగిలించింది అతనే.

ఇతను మన పొరుగుదేశపు ఏజంటు. మనకున్న ఆట మిక్ రియాక్టర్సును పేల్చి, స్మగ్లింగ్ అగకుండా వుండేందుకు అనువయినట్లు, బోట్లకు, రక్షకదళాల్ని నిర్మూలించి, నిర్వీర్యం చెయ్యడానికొచ్చాడు" అన్నాడు ఆనంద్.

"అంతదూరం ఆలోచించలేక పోయాను" అంది రాణి విస్మయంగా.

"ఇక నీ మూడో నకిలీ భర్త సంగతి చూద్దాంపద!" అన్నాడు ఆనంద్.

"మూడో భర్తా? నా కసలు పెళ్ళే కాలేదు" ఆశ్చర్యంగా చూసింది రాణి.

"ఆ సంగతి నాకు తెలుసు — నీవు అసలు భర్త అని చెప్పాకనే ఫోటోకూడా నకిలీ భర్తదేనని!"

అందరూ నవ్వుకున్నారు.

రాణి ఫ్లాట్ తలుపు తెరిచారు. లోపల ఆమె భర్తగా నటించిన వ్యక్తి తన్ను తనే రివాల్వరుతో కాల్చుకుని, చచ్చి పడివున్నాడు.

—: అయిపోయింది :—

<u>సీరియల్</u>

# అంగారక

శ్యాంబాబు



(నాలుగవ భాగము)

"నేను వుపయోగిస్తున్నది టెలిస్కోపిక్ రైఫిల్. మిషన్‌గన్ కాదు. మూవింగ్ బేస్‌మీద నుండి మూవింగ్ టార్గెట్‌ను షూట్ చెయ్యడం కష్టం. అయినా నేనా పని చెయ్యగలను. నాకా నమ్మకం వుంది. అయితే హెలికాప్టర్ నడిపే పైలట్ నా ఇన్‌స్ట్రక్షన్ ప్రకారం నేను కోరిన కోణంగిలులో జాగ్రత్తగా నడపగలిగిన వాడయి వుండాలి. ఇటీజ్ ఎ క్వశ్చన్ ఆఫ్ టీమ్ వర్క్—"

"యూ ఆల్ రైట్! మొదటి బుల్లెట్‌తోనే పని జరిగి పోవాలి. మీరు టార్గెట్ మీదకు రావడానికి, గురిచెయ్య

డానికీ, బుల్లెట్ ప్రేల్చడానికి రెండు నిముషాలకన్నా వ్యవధి వుండదు. ఆ ప్రదేశంలో రెండునిముషాలకన్నా ఎక్కువసేపు వుంటే ప్రాణాలలో బయటపడే అవకాశం పూర్తిగా శూన్యం.''

''ఇన్ దట్ కేస్... హెలికాఫ్టర్ పైలట్, నేను కలిసి తప్పకుండా ఓ రెండుమూడు రోజులు టార్గెట్ ప్రాక్టీస్ చెయ్యాలి.''

''ష్యూర్! ఐవిల్ మేక్ అరేంజ్ మెంట్స్.''

''అంతే కాదు. వీలయితే మేము ఏ ప్రదేశంలో షూట్ చెయ్యాలో—ఆ ప్లేస్ మాప్, లేఅవుటు, నేను చంపవలసిన మనిషి ఫోటోలు మొదలయిన వివరాలు కూడా తెలియజేస్తే మంచిది—'' అన్నాడు జయ పాండ్యన్.

''ష్యూర్! తప్పకుండా ఆ ఏర్పాట్లన్నీ చేస్తాను. మన కింకా వారంరోజుల వ్యవధే వున్నది—''

''వన్ మోర్ థింగ్...నా ఇన్ష్యూరెన్స్ యేం చేశారు?—''

కపూర్ ముఖంలో ఆశ్చర్యం కనిపించింది... ''వాట్ ఇన్ష్యూరెన్స్?—''

నవ్వాడు జయపాండ్యన్...''నో ట్రిక్స్ మై ఫ్రెండ్. యాక్చ్యుయల్ ఆపరేషన్ కు వెళ్ళేముందే నా పాస్ పోర్ట్, ఫారిన్ బాంక్ లో నా పేర డబ్బు జమకట్టబడినట్లు తెలిపే పాస్ బుక్ ఎయిర్ లైన్ టికెట్లు...''

''ఓ...అవా...? దె ఆర్ ఆల్ రెడీ...డోన్ట్ వర్రి...'' అన్నారు కపూర్ లేచినిలబడి చనువుగా పాండ్యన్ భుజం తట్టి.

"కల్నల్ కపూర్! మరో విషయం చెప్పలేదు నాకు..."

"ఏమిటది?"

"నేను హత్య చెయ్యవలసింది ఎవరిని?—"

నిముషంపాటు రెప్పవాల్చకుండా పాండ్యన్ని చూశాడు కపూర్..."డు యూ కేర్? నువ్వు హత్య చెయ్యవలసింది ఎవరో తెలుసుకోవడంవలన ఉపయోగం ఏమిటి?—"

"నథింగ్! జస్ట్ క్యూరియాసిటీ...అంతే!—" అన్నాడు జయపాండ్యన్ చిత్రంగా భుజాలు ఎగరేసి.

"ఓకే...ఐ హేవ్ నథింగ్ టు లూజ్!—"

"ఎవరు?—"

కల్నల్ కపూర్ చెప్పాడు...

జయపాండ్యన్కు కడుపులో పేగులు మెలిపడి నట్లయింది...

అవును! అతను చంపవలసిన వ్యక్తి సామాన్యుడు కాదు...భారతదేశానికి ప్రధాన మంత్రి. ఎందుకో ఒక్క సారి ఒళ్ళు జలదరించింది పాండ్యన్కు.

* * *

"దిసీజ్ ది మోడల్—!" అన్నాడు కపూర్! టేబుల్ మీద ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌లోనూ, కార్డ్‌బోర్డ్‌తోనూ చేసిన మోడల్ సైట్ చూపిస్తూ.

కల్నల్ కపూర్, జయపాండ్యన్, గామా—ముగ్గురే వున్నారు ఆ గదిలో....

జయపాండ్యన్ సిగరెట్ వెలిగించి దీర్ఘంగా చూశాడు

మోడల్ వైపు.

పచ్చటి చెట్లలోవున్న దట్టమైన కొండలు...చిన్న లోయ...లోయ మధ్య చిన్న బంగళా...బంగళాకు ఓ ప్రక్కన స్విమ్మింగ్ పూల్...

"ఇవేమిటి? సెంట్రీలా?—" అడిగాడు జయపాండ్యన్ బంగళా చుట్టూ కొండలమీద ఎర్ర రంగుతో మార్క్ చేసిన చిన్న చిన్న గుడిసెల్లాంటివి చూపెడుతూ.

"సెక్యూరిటీ అవుట్ పోస్ట్లు...అన్ని పోస్ట్లలోనూ ఆర్మ్డ్ సెంట్రీ కాపలావుంటారు ..పడమటి వైపువున్న పోస్ట్లో ఒక యాంటీ ఎయిర్ క్రాఫ్ట్ గన్ కూడావుంది-"

"ఐసీ!—" అన్నాడు జయపాండ్యన్ తలపంకించి.

"అంచేత మనం లోయలోనికి పడమటి వైపునుండి రావడమే సేఫ్ అనుకొంటాను. అప్పుడు సెంట్రీలకు మనల్ని దూరంనుండి గుర్తించి యాంటీ ఎయిర్ క్రాఫ్ట్ గన్ సిధ్దం చేసుకొనే అవకాశం వుండదు-" అన్నాడు గామా.

జయపాండ్యన్ తలెత్తి గామావైపు చూశాడు... గామా హెలీకాప్టర్ పైలట్...ముప్పై యేళ్ళుంటాయేమో...బలంగా బళ్ళులాగే మనిషిలా వుంటారు... దట్టమైన రింగుల తల. బలమైన శరీరం...మామూలుగా చూస్తే అతన్ని హెలికాప్టర్ పైలట్ అని ఎవరూ అనుకోరు.

"యస్—యు ఆర్ రైట్...అంతేకాక మనకు మరో అదనపు ఎడ్వాంటేజికూడా వుంది-"'—అన్నాడు జయపాండ్యన్ మోడల్ను తీక్షణంగా పరిశీలిస్తూ—

"ఏమిటది?—"

"బంగళాకన్న చాలా ఎత్తులో వున్నాయి—ఈ సెంట్రీ పోస్ట్‌లు చుట్టూవున్న కొండ గుట్టలమీద... అంచేత మనం ఆ సెంట్రీ పోస్ట్‌ల కన్నా క్రింద ఎత్తులో వస్తే మనమీద ఫైర్ చేసే ధైర్యం వుండదు వాళ్ళకు... ఎందుకంటే మనం వాళ్ళున్న ప్రదేశం కన్నా తక్కువ ఎత్తులో ఎగురుతూ బంగళావైపు వస్తున్నప్పుడు ఫైర్ చేస్తే అవి గురితప్పి తిన్నగా బంగళాకు తగిలే అవకాశం వుంది. వెయిర్ ట్రెజెక్టరీ ఆఫ్ ఫైర్ వోన్ట్ బి గుడ్!"—అన్నాడు జయపాండ్యన్.

జయపాండ్యన్ ఆర్మీలో శిక్షణపొంది అనుభవంవున్న ఆఫీసరు. భూ భాగపు లక్షణాన్నిబట్టి శత్రువులపై ఏ దిశగా, ఏ వ్యూహంలో దాడిచేయాలో ఆకళింపు చేసుకొని అమలు చేయడంలో సిద్ధహస్తుడు. అంచేతే మోడల్‌ను చూడగానే అతని మెదడు కంప్యూటర్లా పని చెయ్యడం ప్రారంభించింది.

"డిసీజ్ నో ప్రాబ్లమ్. ఆ బంగళాకు సెక్యూరిటీ అరేంజ్ చేసిన వాడు వుత్త ఫూల్! సెక్యూరిటీ ప్రికాషన్స్‌లో అనుసరించవలసిన ప్రాథమికసూత్రాలు ఖాతరు చెయ్యలేదు. ఐ థింక్ వుయ్ కెన్ డు ఇట్ ఇన్ టు మినిట్స్ ఈజిలీ!"—అన్నాడు జయపాండ్యన్.

కల్నల్ కపూర్ చిత్రంగా భుజాలు ఎగరేశాడు. "దటీజ్ హిజ్ ప్యూనరల్!—"

"ఆఫ్ కోర్స్! నా టెల్ మి ది ఎంటైర్ ప్లాన్!—" అన్నాడు జయపాండ్యన్ జబ్బలు చరుచుకొంటూ.

గామా తలాడించాడు.

"ది ప్లాన్ ఈజ్ వెరీ సింపుల్. ఈ మోడల్‌లో కని పిస్తున్న బంగళా ప్రధాన మంత్రి విశ్రాంతి గృహం. అంటే, ఏ మాత్రం వీలు దొరికినప్పుడయినా ఇక్కడకు వచ్చి రెండు మూడు రోజులు విశ్రాంతి తీసుకొంటుం టారు. వచ్చే ఆదివారం రోజుకి ప్రధాన తప్పకుండా ఈ రెస్ట్ హౌస్‌కు రావడం ఖాయమని ప్రధాన నివాసం లోని నమ్మకమైన మన మనుషులనుండి సమాచారం వచ్చింది.

ఎనీహౌ! ప్రధానమంత్రి రెస్ట్‌హౌస్‌కి వచ్చాడా లేదా అనే సమాచారం కూడా ఆదివారం ఉదయమే మనకు రెస్ట్‌హౌస్‌లోవున్న మన మనిషిద్వారా తెలు స్తుంది.

ప్రధానికి ఈత కొట్టటం పెద్ద హాబీ అని మీరు తెలిసే వుంటుంది. రెస్ట్‌హౌస్‌లోవున్న సమయంలో దాదాపు సగం స్విమ్మింగ్‌పూల్ దగ్గరే గడుపుతారు. అంచేత ప్రధాని స్విమ్మింగ్‌పూల్ దగ్గర రాగానే మీరు బయలు దేరతారు.

రెస్ట్‌హౌస్‌వున్న కొండలకు దగ్గరగావున్న అడవుల్లో కొంత భాగం క్లియర్ చేసి హెలీపాడ్ తయారుచేశాము. ఆ రోజు వుదయానికే హెలికాప్టర్‌తో మీ రిద్దరూ అక్కడ సిద్ధంగా వుంటారు.

ప్రధాని స్విమ్మింగ్‌పూల్ దగ్గరకు వచ్చినట్లు తెలియ గానే మీరు బయల్దేరుతారు. రెస్ట్‌హౌస్ కొండల మధ్య వుంది కాబట్టి కొండదాటి లోయలో ప్రవేశించే వరకూ

మిమ్మల్ని ఎవరూ గుర్తించరు. మీకున్న ప్రమాదమల్లా అతన్ని షూట్ చేసి తిరిగి కొండ దాటడానికి పైకెగిరే ప్పుడే.'' అన్నాడు కపూర్.

''డోన్ట్ వర్రి, ఐ విల్ టేక్ కేరాఫ్ ఇట్'' అన్నాడు గామా ఉత్సాహంగా.

''దటీజ్ ఓన్లీ ఫస్ట్ పార్ట్ ఆఫ్ ది ప్లాన్!_'' అన్నాడు జయపాండ్యన్, కపూర్ కళ్ళలోకి సూటిగా చూస్తూ.

''యస్! దటీస్ ది ఫస్ట్ పార్ట్!'' అన్నాడు కపూర్ చిన్నగా నవ్వుతూ.

''టెల్ మి ది సెకండ్ పార్ట్. దటీజ్ మోర్ ఇంపార్టెంట్!'' అన్నాడు జయపాండ్యన్ మరో సిగరెట్ వెలిగిస్తూ.

''ఆల్ రైట్! షూటింగ్ అయిపోయిన తరువాత తిరిగి బేస్‌కు తిరిగి రావలసి అవుసరంలేదు మీకు. రెస్ట్ హౌస్ వున్న కొండలకు తూర్పుగా నలభై మైళ్ళదూరంలో నేషనల్ హైవే ఫార్టీసెవన్ వుంది. ఆ రోడ్డుకు వంద గజాల దూరంలో సెంట్ పర్సెంట్ రన్నింగ్ కండిషన్లో వున్న రెండు కార్లు పార్క్ చేసి సిద్ధంగా వుంటాయి.

హెలికాప్టర్ని అక్కడ వదిలేసి మీరిద్దరూ చెరో కారు తీసుకోండి. కారు రోడ్డు ఎక్కేచోట ఏవైపు వెళితే ఏఊరు వస్తుందో తెలిపే మైలురాయి వుంది. దాన్ని బట్టి మీరిద్దరూ చెరో వైపు వెళతారు. మీరు తీసుకొనే కార్లోనే మీ పాస్‌పోర్ట్, డబ్బు ఇతరపత్రాలు వుంటాయి. అక్కడనుండి మీరు గమ్యస్థానం చేరుకొనే ప్పటికి మీ విమానాలు ఎయిర్‌పోర్ట్‌లో సిద్ధంగా

వుంటాయి."

"థాంక్స్! కల్నల్! కార్లు రన్నింగ్ కండిషన్లో వున్నదీ లేనిదీ డబుల్ చెక్ చేస్తే మరింత సంతోషిస్తాను!" అన్నాడు జయపాండ్యన్.

"ఓ. కె. ఐ విత్ డు ఇట్!" అన్నాడు కపూర్.

"దెన్ వి విల్ స్టార్ట్ ప్రాక్టిస్. ఫ్రం టుడే!—" అన్నాడు గామా.

"కరెక్ట్. వ్యవధి తక్కువ. చేయవలసిన పని ఎక్కువ. రైఫుల్, అమ్యూనేషన్ సిద్ధంగా వున్నాయా?—" అడిగాడు జయపాండ్యన్.

"ఆల్ రెడీ-"

"దెన్ లెట్స్ గో అండ్ కిల్ ది డమ్మీస్!—" అన్నాడు జయపాండ్యన్ ఉత్సాహంగా.

* * *

సరిగ్గా పదకొండు గంటల పదిహేను నిముషాలకు వైర్ లెస్ బజరు మ్రోగింది.

గామా బజర్ అన్సరు చేశాడు.

జయపాండ్యన్ త్రాగుతున్న కాఫీకప్పు క్రిందపెట్టి అలర్టుగా వినసాగాడు.

"ఆపరేషన్ ఫైవ్ స్టార్ వన్...దిసీజ్ ఫైవ్ స్టార్ టు కాలింగ్" అవతలి వ్యక్తి పిలుస్తున్నాడు.

"ఆపరేషన్ ఫైవ్ స్టార్ వన్ హియర్...ప్రొసీడ్" గామా సమాధానం.

"ది టార్గెట్ ఈజ్ రెడీ...రోజర్!" అవతలినుండి ట్రాన్స్మిషన్ ఆగిపోయింది.

''హియర్ వుయ్ గో!''—అన్నాడు గామా హెలి కాప్టర్ వేపు నడుస్తూ.

తెలియని ఎక్సయిట్ మెంట్ ఏదో జయపాండ్యన్ నరనరాల వ్యాపిస్తోంది. టెలిస్కోపిక్ రైఫిల్ వున్న పెట్టెను తీసుకొని గామా వెనుకే హెలికాప్టరులో ప్రవేశించాడు.

హెలికాప్టర్ నేల మీదనుండిలేచి, ఒక్క క్షణం గాలిలో ఊగిసలాడి రివ్వున ఆకాశంలోకి లేచింది.

జయపాండ్యన్ కేసు వూడదీసి రైఫిల్ను బయటకు తీశాడు. టెలిస్కోపిక్ లెన్స్ను ఓసారి డస్ట్ క్లాత్ తో తుడిచాడు. అమ్యూనిషన్ క్లిప్ ఒకటి లోడ్ చేశాడు... ఛాంబరులోకి బుల్లెట్ను నెట్టి బోల్టుమూసి సేఫ్టీకాచ్ ఆన్ చేశాడు.

ప్రధానమంత్రి రెస్టుహౌసు ప్రాంతానికి చేరడానికి పదినిముషాలకన్నా ఎక్కువ పట్టదు.

హెలికాప్టరు కొండపైకి వచ్చింది. స్లైడింగ్ డోర్ ప్రక్కకు నెట్టాడు జయపాండ్యన్. రివ్వున గాలి హెలికాప్టరు కాబిన్ లోకి తోసుకువచ్చింది.

క్రింద లోయలో రెస్టుహౌసు కనిపిస్తోంది. స్విమ్మింగ్ పూల్ పూర్తిగా కనిపించడం లేదు. కొద్దిగా చెట్లు అడ్డంగా వున్నాయి.

కొండవాలుతో పాటు అదే యాంగిల్ లో క్రిందకు దిగసాగాడు గామా. హెలికాప్టరు యాంటి ఎయిర్ క్రాఫ్ట్ గన్స్ వుండే గార్డుహౌసుమీదుగా ఎగురుతోంది. తెరిచిన తలుపులోనుండి క్రిందకు చూశాడు జయపాండ్యన్.

క్రింద నలుగురు యూనిఫాంలోవున్న గార్డ్సు కనిపిం స్తున్నారు. ఒకడు బయినాక్యులరుతో పైకి చూస్తు న్నాడు. గార్డుహౌసుమీద ఇరవయి అడుగుల ఎత్తులో నుండి ఎగిరి ముందుకు పోతోంది హెలికాప్టరు.

మోకాలిమీద ఓ చెయ్యి ఆనించి, దాన్ని బారెల్ రెస్టుగా చేసుకొని, సేఫ్టీకాచ్ ఆపుచేసి రైఫిల్ బటను భుజానికి ఆనించుకున్నాడు.

హెలికాప్టరు గాలిని చీల్చుకుంటూ ముందుకు కదులు తోంది.

"అప్రోచింగ్ టార్గెట్!" అన్నాడు గామా.

హెలికాప్టర్ టెయిల్ మీద 'దబ్' మని ఏదో తగి లిన శబ్దమయింది.

"ఫూల్స్...ది డేమ్‌ఫూల్స్..." అరిచాడు గామా కోపంగా.

హెలికాప్టర్ మీద యాంటి ఎయిర్ క్రాఫ్టు గన్‌తో ట్రేసర్ రౌండ్సు కాలుస్తున్నారు గార్డ్సు. అసలు అమ్యు నిషన్ పేల్చేముందు ..గురి సరిచేసుకోవడానికి ఉప యోగిస్తారు ట్రేసర్స్...అంత ప్రమాదకరమైనవికావు.

రెస్టుహౌసు స్పష్టంగా కనిపిస్తోంది ఇప్పుడు... స్విమ్మింగ్ పూల్ ఓ అంచు మాత్రమే కనిపిస్తోంది.

స్విమ్మింగ్ పూలు, దాని చుట్టుప్రక్కల పరిసరాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి జయపాండ్యన్‌కు. స్విమ్మింగ్ పూల్ మధ్యలో ఇన్‌ఫ్లేటెడ్ రబ్బర్ మేట్ మీద పడు కొని విశ్రాంతి తీసుకొంటున్నారు ప్రధాని. ఎర్రటి శరీ రము...సన్నని ఎముకలగూడులా వుంది... మొలచుట్టు

చారల టర్కిష్ తువ్వాలు చుట్టుకొని వున్నాడు.

టెలిస్కోపిక్ లెన్సులోనుండి గురిచూశాడు జయ పాండ్యన్. ప్రధాని శరీరం మీదకు దూకినంత దగ్గరగా కనిపిస్తోంది.

"స్టిల్...నా!" అర్చాడు జయపాండ్యన్ ట్రిగరు మీద వేలు పెడుతూ.

హెలికాప్టరు గాలిలోనే ఒక్క క్షణం అటూయిటూ వూగి కదలకుండా నిలబడిపోయింది.

టెలిస్కోపులోని నిలువు అడ్డగీతల కేంద్రం ప్రధాని కనుబొమల మధ్యకువచ్చేలా గురిచూసి ట్రిగ్గరునొక్కాడు జయపాండ్యన్.

"ఢాం..."

హెలికాప్టరు తోకమీద 'ట్వయ్ ట్వయ్' మని బుల్లెట్లు తగులుతున్న చప్పుడు.

జయపాండ్యన్ పేల్చిన బుల్లెట్ తాకిడికి ప్రధాని శరీరం ఒక్క క్షణం అదుగెత్తు గాలిలోకి లేచి నీళ్ళలో పడింది.

"కమాన్ గెట్ వే...క్విక్!" అరిచాడు జయపాండ్యన్.

ఏంటీఏర్ క్రాఫ్టు బుల్లెట్ ఒకటి డోరు అవుటర్ హాండిలుకు తగిలి హాండిలు ముక్కలు ముక్కలయింది.

"దబ టబ" హెలికాప్టరు తలుపులమీద బుల్లెట్ల వర్షం కురుస్తోంది.

హెలికాప్టరును రివ్వున గాలిలోకిలేపి త్రోటిల్సు ముందుకు సెట్టాడు గామా. అదే సమయంలో తలుపు

మూసెయ్యడానికి వెనక్కి తిరిగాడు జయపాండ్యన్... బుల్లెట్ ఒకటి 'టిల్లు'న తలుపు అద్దాలు బద్దలు చేసింది. అసంకల్పితంగా చటుక్కున తల క్రిందికి వంచాడు పాండ్యన్.

అప్పుడే పట్టుజారి వుండాలి. అతని చేతిలోని టెలిస్కోపిక్ రైఫిల్ తెరచివున్న తలుపులోంచి క్రిందకు పడింది.

మతిపోయిన వాడికిమల్లే చూశాడు జయపాండ్యన్.

“డామిట్...క్లోస్ ది డోర్!” అరిచాడు గామా.

నాలుగువైపులనుంచి రైఫుళ్ళు పేలుస్తున్నారు... రివ్వున లోయ ఎగబ్రాకి కొండను దాటింది హెలికాప్టర్.

అప్పుడు చూశాడు జయపాండ్యన్, గామా పాంటు తొడ ప్రాంతంలో ఎర్రగా రక్తంతో తడిసిపోయి వుండటం...

కార్లువుండే స్థలం చేరడానికి ఇంకా అయిదు నిముషాలు పడుతుంది.

“ఆర్ యు ఆల్ రైట్...కెన్ యు హోల్డ్” ఆతృతగా అడిగాడు పాండ్యన్.

“ఎస్ ఐథింక్ సో” అన్నాడు గామా హీనస్వరంతో.

“హియర్ ద ఆర్!” అన్నాడు జయపాండ్యన్ దిగువన హెలికాప్టర్ దిగడానికి అనువుగా క్లియర్ చేసిన ప్రదేశము, ప్రక్కనే కనిపిస్తోన్న రెండుకార్లు చూసి.

గామా హెలికాప్టర్ను మెల్లిగా హెవీసౌండుమీద దింపాడు. ఈలోగా జయపాండ్యన్ చకచక ఫస్టెయిడ్ కిట్ వూడతీసి కాటన్ పాడ్సు, యాంటీసెప్టిక్ లోషను

పెయిన్ క్లియర్ ఇంజక్షను యాంపిల్సు, సిరంజి బయటకు తీశాడు.

మరో రెండు గంటల్లో సింగపూర్ వెళ్లే విమానం ఎక్కాలతను.

* * *

ప్రధానమంత్రి రెస్ట్ హౌస్ దగ్గర హడావుడి వర్ణించ శక్యంకాదు.

హెలికాప్టర్ లోంచి రైఫుల్ బుల్లెట్ ప్రధానికి తగిలే సమయంలో ఆయన పర్సనల్ సెక్యూరిటీ గార్డు ముఖర్జీ స్విమ్మింగ్ పూల్ ప్రక్కనే చెట్టుక్రింద విశ్రాంతి తీసుకొంటున్నాడు.

హెలికాప్టర్ దూరం నుండి వినబడుతున్న యాంటీ ఎయిర్ క్రాఫ్ట్ గన్ శబ్దాన్నిబట్టి ముఖర్జీకి పరిస్థితి క్షణంలో అర్థమయింది.

"సార్... డేంజర్... డేంజర్... గెట్ ఇన్ టు ది పూల్...నీళ్ళలోకి మునగండి" అరుస్తూ స్విమ్మింగ్ పూల్ వైపుకు పరిగెత్తాడు ముఖర్జీ.

ముఖర్జీ అరుపు వినేలోపునే జయపాండ్యన్ పేల్చిన బుల్లెట్ ప్రధాని మెదడులోకి దూసుకుపోయింది. ప్రధాని శరీరం క్షణం గాల్లోకి లేచి స్విమ్మింగ్ పూల్ లోకి పడిపోయింది.

సంకోచించలేదు ముఖర్జీ...ఎగిరి స్విమ్మింగ్ పూల్ లోకి దూకి ప్రధాని మునిగిన వైపు సత్వరన ఈదుకెళ్ళాడు. అప్పటికే ప్రధాని శరీరం ఒక మునుగు మునిగి పైకి వస్తోంది. స్విమ్మింగ్ పూల్ లోని ఆ ప్రదేశంలోని

నీరంతా ఎర్రగా మారింది.

జుట్టు పట్టుకొని ప్రధాని శరీరాన్ని స్విమ్మింగ్ పూల్ గట్టు దగ్గరికి లాక్కొచ్చి పైకిలాగాడు. అప్పటికి రెస్ట్ హౌస్‌లోని సిబ్బంది అందరూ బయటికి పరుగెత్తుకొచ్చారు.

"కీప్ ఎవే"—అరిచాడు ముఖర్జీ...శవం నుదుటిమీద సెంటీమీటరు వెడల్పున ఏర్పడిన రంధ్రం వైపు చూస్తూ.

దగ్గరగా రాబోతున్న సిబ్బంది అంతా కాళ్ళకు బ్రేకులు పడినట్లు ఆగిపోయాయి.

ముఖర్జీ వాళ్ళను పరికించి చూసాడు. మొత్తం నలుగురు వున్నారు. ప్రధాని బట్లరు, కారు డ్రైవరు, స్టెనో, మరో పనివాడు.

చకచక ఆర్డరు జారీ చేశాడు ముఖర్జీ, స్టెనోని సెక్యూరటీవాళ్ళను ఎవరినీ లోపలకు రానివ్వద్దని హెచ్చరించడానికి బట్లరు వెంటనే ఢిల్లీని కాంట్రాక్టు చెయ్యమని కారు డ్రైవర్ని వెంటనే మద్రాసు పోలీసుల్ని, బెంగళూరు పోలీసుల్ని హెచ్చరించమని చెప్పాడు.

"బి కేర్‌ఫుల్...దిగువ అధికారులలో ఎవరితోనూ మాట్లాడకండి. స్పీక్ టు ది టాప్ ఆఫీసర్స్...ముందు అవతల మాట్లాడుతున్న దెవరో తెలుసుకొని చెప్పండి" అన్నాడు ముఖర్జీ.

"ప్రధాని కేమయిందని అడిగితే?" బట్లరు ప్రశ్న.

"డోన్ట్ వర్రీ! హియీజ్ ఆల్ రైట్...జస్ట్ షాక్!" అన్నాడు ముఖర్జీ తన కాళ్ళ దగ్గరి ప్రధాని నిర్జీవ శరీరం వైపు చూస్తూ.

చలనం లేకుండా పడివున్న ప్రధాని శరీరం వైపు అనుమానంగా చూశాడు కారు డ్రైవరు.

"మీరు చెప్పేది నిజమేనా? డాక్టర్‌ని పిలవనవసరం లేదా?"

"నాట్ నెససరీ...నా గో ఇన్ టు ది కమ్యూనికేషన్స్ రూమ్" అరిచాడు ముఖర్జీ. వాళ్ళు ముగ్గురూ చకచక రెస్ట్‌హౌస్ వెనక వైపువున్న కమ్యూనికేషన్స్ రూమ్ వైపు పరిగెత్తారు.

ముఖర్జీ, పనివాడులా వున్నతనిని దగ్గరికి రమ్మని సైగ చేశాడు. అతను పనివాడు కాదనీ, ప్రధాని తన సిబ్బంది జలో ప్రత్యేకంగా ఆట్టిపెట్టుకొన్న ఇంటలిజెన్స్ డిపార్టుమెంట్ మనిషనీ ముఖర్జీకు తెలుసు.

"ఈజ్ హి డెడ్!" అడిగాడు ఇంటలిజెన్స్ డిపార్టుమెంట్ మనిషి.

"యస్...నో క్వశ్చన్" అన్నాడు ముఖర్జీ.

"అయితే నేను వెంటనే మా డైరెక్టర్‌కి ఇంటిమేట్ చెయ్యాలి."

"ముందు...ఈ రహస్యం బయిటికి పోకుండా చూడాలి బ్రదర్.. ఆ బాధ్యత మనిద్దరిదీ. ఆ తర్వాత మీ డైరెక్టర్‌కి చెపుదువుగాని...మరో నిముషం ఆలశ్యం చేస్తే సెంట్రీల్లో కొందరు పరిగెత్తుకు రావచ్చు...ఆ లోగా ఈ శవాన్ని గదిలోకి చేర్చాలి."

ఇద్దరూ చకచక ప్రధాని శవాన్ని లోపలకు మోసుకెళ్ళి ఆయన ఎయిర్ కండిషన్ గదిలో పడుకోబెట్టారు.

"వాట్ నెక్స్ట్?" అన్నాడు ఇంటలిజెన్స్ మనిషి.

"నువ్వెళ్ళి మీ డైరెక్టర్‌కు ఇంటిమేట్ చెయ్యి... వెంటనే కంట్రీని సీల్ చెయ్యాలి...మరో పదినిముషాల్లో సెక్యూరిటీవాళ్ళతో నిండిపోతుంది ఈ ప్రదేశమంతా. నే నిక్కడే వుండి ఎవర్నీ లోపలకు రానివ్వకుండా చూస్తాను. ఎవరన్నా అడిగితే ప్రధానికి స్పృహ వచ్చిందనీ, విశ్రాంతి తీసుకొంటున్నారనీ చెప్పు"—

"ఓ. కే..." అన్నాడు ఇంటలిజెన్స్ మనిషి బయటికి వెళ్ళిపోతూ.

వెంటనే తలుపు మూసి గడియ పెట్టాడు ముఖర్జీ.

జేబులోంచి తాళాలగుత్తితీసి గోడ అలమారా ఒకటి తెరిచాడు. లోపల మామూలు ఆంప్లిఫయర్‌కన్నా కొద్దిగా పెద్దగా వున్న రేడియో ట్రాన్స్‌మీటర్ ఒకటుంది. చకచక స్విచ్ ఆన్‌చేసి సిగ్నల్ ఇవ్వడం మొదలుపెట్టాడు.

"దిసీజ్ కింగ్స్ రెసిడెన్స్...కాలింగ్ ప్రిన్స్‌రెసిడెన్స్...కింగ్స్ రెసిడెన్స్ కాలింగ్ ప్రిన్స్‌రెసిడెన్స్."

రెండు నిముషాల్లో రెస్పాన్స్ వచ్చింది.

"ప్రిన్స్ రెసిడెన్స్ రిసీవింగ్ గో ఎ హెడ్."

"కింగ్స్ బాడీగార్డును మాట్లాడుతున్నాను. ప్రిన్స్‌తో పర్సనల్‌గా మాట్లాడాలి...ఎమర్జన్సీ..."

"వెయిటె మినిట్."

రెండు నిముషాలు నిశ్శబ్దం...

"హాలో ముఖర్జీ...వాట్ డు యూ వాన్ట్?"

"గుడ్ ఆఫ్టర్‌నూన్ సర్...అయిదు నిముషాల క్రితం మీరు హత్య చెయ్యబడ్డారు."

"వాట్?..." అరనిముషంపాటు నిశ్శబ్దం. "ఓ..కే.

మరో పావుగంటలో నీకు ఇన్‌స్ట్రక్షన్స్ వస్తాయి... వెయిట్ ఫర్ దెమ్..."

ముఖర్జీ ట్రాన్స్‌మిటర్ ఆఫ్ చేసి సన్నగా ఈల వేస్తూ సిగరెట్టు వెలిగించాడు.

* * *

అలారం బెల్ సన్నగా చేస్తున్న చప్పుడుకు మెలకువ వచ్చింది విన్నర్‌కు. పథకాలు అనుకొన్న ప్రకారం సాగితే బహుశా ఈ రాత్రంతా తనకు నిద్ర వుండక పోవచ్చు. అంచేతే ఉదయం ఎనిమిదింటికి బ్రేక్‌ఫాస్టు తీసుకొన్న తర్వాత మళ్ళీ బలవంతాన నిద్ర కుపక్రమించాడు.

బద్ధకంగా ఆవులించి టైము చూసుకొన్నాడు. ఒంటిగంటన్నర అయింది. స్టవ్ వెలిగించి కాఫీ కోసం నీళ్ళు కెటిల్‌లో పోసి పెట్టాడు.

'అంగారక' కాబిన్‌లోకి వెళ్ళి ట్రాన్స్‌మిటర్ ఆన్ చేశాడు. సరిగ్గా ఒంటిగంట అయిదు నిముషాలకు సిగ్నల్ వచ్చింది.

"సక్సెస్ వన్ కాలింగ్...సక్సెస్ టు ఆన్సర్..."

మైక్ ఆన్ చేసి, "సక్సెస్ టు రిసీవింగ్...గో ఎహెడ్" అన్నాడు.

"అంతా రడీగా వుంది...కారీఆన్ విత్ ది ప్లాన్."

"ఓకే...విష్ బోతాఫ్ అజ్ సక్సెస్...రోజర్."

ట్రాన్స్‌మిటర్ ఆఫ్ చేసి స్టవ్ దగ్గిరికి వచ్చేప్పటికి కాఫీ మరుగుతోంది. కొంత కాఫీ మగ్గులో పోసుకొని మిగిలింది ఫ్లాస్క్‌నిండా పోశాడు.

కాఫీ తాగి స్టవ్ ఆర్పేసి స్టవ్‌ని, కెటిల్‌ని, తను పడుకొన్న కేంప్ కాటుని 'పాడో'లో లోడ్ చేశాడు. అంతకు ముందురోజే హైటైడ్ రావడంవలన బీచ్ నిండుగా నీరువస్తే 'పాడో'ను తిరిగి జలప్రవేశం చేయించి లంగరు వేశాడు.

ఫ్లాస్కులను, సాండ్‌విచెస్, బిస్కట్లు వున్న పాకెట్లను, ఒక ఇన్‌ఫ్లేటబుల్ రబ్బరు డింగీ, చిన్న సింగిల్ హార్స్ పవర్ మోటరు ఇంజన్‌ను విమానం కాబిన్‌లో సర్దాడు.

వించ్ ఆపరేటు చేసి 'పాడో' సెలూన్ మూత తీసేసి విమానంలోకి ఎక్కి కూర్చున్నాడు. మెల్లిగా ఇంజన్ను ఆన్ చేసి 'అంగారక'ను గాలిలోకి ఎగిరించి బీచ్‌మీద దింపాడు. తిరిగి ఈదుకొంటూ మోటార్‌బోటు చేరుకొన్నాడు.

'పాడో'ను స్టార్టు చేసి సముద్రంలో దాదాపు రెండు వందల గజాలు తీసుకెళ్ళి ఇంజన్ ఆఫ్ చేశాడు. ఇంజన్ రెక్కలోంచి చిన్న టైంబాంబ్ తీసి కాబిన్ క్రింది హోల్డులో బిగించాడు. సరిగ్గా పదినిముషాలకు ప్రేలేట్లు అరేంజ్ చేశాడు.

నిజానికి ఆ టైంబాంబ్ పెద్ద శక్తివంతమయింది కాదా...కాని నౌక హోల్డ్ అడుగున మనిషి పట్టేంతకంత చెయ్యడానికి ఆ మాత్రం ప్రేలుడు పదార్థం చాలు. మిగిలిన పని ఓడలోకి ప్రవేశించే సముద్ర జలాలు చూసుకొంటాయి.

వంద గజాలు ఈది వెనక్కి తిరిగి చూశాడు. నీళ్ళలో

భళ్ళున ఏదో మునిగిన చప్పుడయింది. ఓడ కొద్దిగా కదులుతున్నట్లనిపించింది విన్నర్‌కు. చకచకా గట్టువైపు ఈదాడు.

ఒడ్డు చేరి వెనక్కి తిరిగి చూసేటప్పటికి 'షాడో ఆఫ్ లుముంబా' సగానికి పైగా సముద్రంలోకి మునిగిపోయింది. లాంగ్ అయిలండ్ సముద్ర గర్భంలో 'షాడో' గుర్తింపబడని ఓడగా చిరకాలం నరమానవుల కంట బడకుండా వుండిపోతుందని విన్నర్‌కు తెలుసు.

ఒడ్డుకు చేరగానే తడిసిన అండర్‌వేర్ తీసేసి ఇసుకలో పూడ్చిపెట్టాడు. అంతకు ముందే సిద్ధంగా వుంచుకొన్న ఫ్లయింగ్ సూటు చకచకా వేసుకొన్నాడు. జిప్పర్ లాగి, హెల్‌మెట్ పెట్టుకొన్నాడు. ఒక్కసారి అంగారక రెక్కల క్రింద, బెల్లీక్రింద రాక్సులో వున్న మిస్సైల్స్‌ని, బాంబ్సను, రాకెట్లను పరీక్షగా చూశాడు.

కాబిన్‌లోకి ఎక్కి 'అంగారక' ఇంజన్ స్టార్టు చేశాడు.

సరిగ్గా పావు తక్కువ రెండయింది. అంగారక రయ్యిన రాకెట్లా ఆకాశంలోకి లేచింది. 'షాడో'ను పొట్టన పెట్టుకున్న సముద్రం ప్రశాంతంగా వుంది.

నేరుగా మద్రాసు తీరంవైపుకు దూసుకుపోయాడు విన్నర్.

* * *

ఫుల్‌సూటు, కళ్ళకు బంగారు ఫ్రేము అద్దాలు, సీర్‌సక్కర్ బూట్సులు, బ్రీఫ్‌కేసు... చకచక మద్రాసు విమానాశ్రయ కస్టమ్స్ బారియల్లోకి అడుగుపెట్టాడు జయపాండ్యన్.

"యువర్ నేమ్ ప్లీజ్..."

"ధావన్...పి. కె. ధావన్!" అన్నాడు జయ పాండ్యన్.

పబ్లిక్ అడ్రెస్ సిస్టమ్‌లో ఫ్లయిట్ నెంబర్ టు జీరో వన్, మద్రాస్ టు టోక్యో వయా కౌలాలంపూర్ అండ్ జకార్తాకు ఫైనల్ కాల్ ఇస్తోంది అనౌన్సర్.

కస్టమ్స్ ఫార్మాలిటీస్ చకచక జరిగిపోతున్నాయి...

ఓరకంటితో కస్టమ్స్ కౌంటర్ చివరన నిలబడి తన వైపే చూస్తోన్న వ్యక్తిని గమనించాడు జయపాండ్యన్.

గుండె జల్లుమంది!

ఆ వ్యక్తి పోలీసు డిపార్టుమెంట్ వాడని అతనిముఖం చాలు చెప్పడానికి.

అతన్ని గమనించనట్టు కస్టమ్స్ వాళ్ళ వేపు చూశాడు.

"ఫైనల్ కాల్ టు ఫ్లయిట్ టు జీరో వన్... ఫైనల్ కాల్" ఎనౌన్సర్ గొంతులో అర్జెన్సీ.

"ఆఫీసర్, ప్లీజ్ హారియప్"

"జస్ట్ మూమెంట్" అన్నాడు కౌంటర్ చివరికి వ్యక్తి దగ్గరగా వస్తూ.

జయపాండ్యన్ గుండె ఒక్క క్షణం ఆగి కొట్టుకోడం మొదలుపెట్టింది.

"యస్" అన్నాడు బింకంగా. కౌంటరుమీద టెలిఫోన్ మ్రోగింది.

పాస్‌పోర్టులోని ఫోటో వేపు, జయపాండ్యన్ వేపు మార్చిమార్చి చూశాడు అతను.

"వాటీజ్ రాంగ్...?" అన్నాడు జయపాండ్యన్

కోపంగా.

అతను సమాధానం చెప్పడానికి నోరు తెరిచాడు.

"ఫర్‌యు" అంటూ కస్టమ్స్ అధికారి పోలీసువ్యక్తికి ఫోనిచ్చాడు.

అతను ఫోన్లో అరనిమిషం విని "ఓకే. ష్యూర్" అని ఫోను పెట్టేసి మాట్లాడకుండా పాసుపోర్టును కస్టమ్స్ అధికారికిచ్చాడు.

పాసుపోర్టుపై కస్టమ్స్ ముద్ర పడీ పడగానే జయ పాండ్యన్ తూరీగలా టర్మాక్ పైకి పరిగెత్తాడు.

ఎయిరిండియా బోయింగ్ 747 తలుపులు మూసుకో బోతున్నాయి.

పరిగెత్తుకొస్తూన్న జయపాండ్యన్‌ను చూసి వేగంగా రమ్మని చేతులు వూపింది ఎయిర్ హోస్టస్.

విమానంలో అడుగుపెట్టిన మరుక్షణం తలుపులుమూసు కున్నాయి. విమానం కదలడం ప్రారంభించింది.

* * *

విన్నర్ 'అంగారక'ను మద్రాను విమానాశ్రయానికి తిన్నగా పారెలల్ గావుండే మార్గంలో తీసుకెళ్ళాడు.

సరిగా మధ్యాన్నం రెండుగంటలకు అతను మద్రాసు తీరానికి ఇరవైమైళ్ళ దూరంలో సముద్రమట్టానికి కేవలం నలభై అడుగుల ఎత్తున ఎగురుతూ వున్నాడు.

రేడియో ట్రాన్స్మిటరుమీద అతనికికావలసినవిషయం వినిపించడంలేదు. ట్రాన్స్మిటరు సరిగ్గా మద్రాసు ఎయిర్ పోర్టు కంట్రోలుటవర్ వుపయోగించే ఫ్రీక్వెన్సీకి ట్యూన్ చేయబడివుంది.

ట్రాన్స్మిటరులో టవర్ కంట్రోలరుకు, విమానాల పైలట్లకు మధ్య సంభాషణలు స్పష్టంగా వినబడుతూ వున్నాయి.

రెండు అయిదయింది.

తనకు కావలసిన విమానం జాడ లేదు.

క్షణక్షణానికీ విన్నర్‌లో టెన్షన్ పెరిగిపోతోంది. కారణం కేవలం తన పథకం ప్రకారం సంఘటనలు జరగక పోవడమే కాదు, ఎగురుతూవున్న ప్రతిక్షణం అమూల్యమైన ఇంధనం ఖర్చయి పోతూవుంటుంది.

రెండుగంటల ఏడు నిమిషాలు.

విన్నర్ ముఖం వికసించింది.

"ఎయిరిండియా టూజీరోవన్ యూ ఆర్ క్లియర్డ్ ఫర్ ఇమ్మీడియెట్ టేకాఫ్ హావ్ ఎ గుడ్ వన్" కంట్రోలరు కంఠం.

"మద్రాసు టవర్. ఐరీడ్ యు క్లియర్ అండు లౌడ్. హియర్ వుయ్‌గో రోజర్" ఆ విమాన కెప్టెన్ విజయరాం జవాబు.

విన్నర్ ఊపిరి బిగబట్టి మద్రాసు తీరం వేపు ఆకాశం వేపు చూశాడు.

మరికొన్ని నిముషాల్లో బోయింగ్ 747 తిన్నగా పైనుండి బ్రహ్మాండమైన పక్షిలా ఆకాశంలోకి యెగురుతూ వెళ్ళింది.

విన్నర్ 'అంగారక'ను పూర్తిగా నూట ఎనభైడిగ్రీలు వెనక్కి తిప్పి బోయింగ్ వెళ్ళిన ఫ్లయిట్ పాత్‌నే అనుసరించాడు.

బోయింగ్ సరిగ్గా పది వేల అడుగుల ఎత్తున ఎగ్రబాకు తున్నప్పుడు దాని తోకకు తిన్నగా వెనకకు, ఓ రెండు వందల మీటర్ల దూరానికి చేరుకున్నాడు.

విన్నర్ ఓసారి గట్టిగా ఊపిరిపీల్చి వదలి మైకును చేతిలోకి తీసుకున్నాడు.

బటన్ ప్రెస్ చేశాడు. ట్రాన్స్మిటరు కంట్రోలుటవరు ఫ్రీకన్సీలో వుండటంవలన విన్నర్ అటు టవరుతోగాని ఇటు ఎయిరిండియా జట్ పైలట్ విజయరాంతోగాని తేలిగ్గా మాట్లాడవచ్చు.

చిన్నగా నవ్వి, "ఎయిరిండియా టూశేరో వన్, యు ఆర్ హైజాక్డు, జాగ్రత్తగా విను. మీ విమానం హైజాక్ చేయబడింది" అన్నాడు మైకులోకి తాపీగా.

* * *

కెప్టెన్ విజయరాంకు ఒళ్ళు జల్లుమంది.

తనకు ట్రాన్స్మిటరులో వినిపించిన మాటలు నమ్మ లేనట్లు కోపైలట్ మిశ్రావేపు చూశాడు. మిశ్రాకూడా హెడ్ సెట్ తగిలించుకొని వుండటంవల్ల అంగారకలో నుండి విన్నర్ చెప్పినమాటలు అతనికీ వినిపించాయి. మిశ్రాకూడా తను విన్న విషయం నమ్మలేనట్లు తలడ్డంగా వూపాడు.

విజయరాం తలత్రిప్పి హెడ్ సెట్ తగిలించుకోమని ఫ్లయిట్ ఇంజనీరుకు సైగ చేశాడు. ఎందుకో తెలియక పోయినా వెనువెంటనే హెడ్ సెట్ తగిలించుకున్నాడు.

విజయరాం మైకుబటన్ నొక్కాడు. "ఎవరున్నువ్వు?" అన్నాడు మైకులోకి.

"డోంట్ వర్రీ, కీప్ క్లయింబింగ్, అనవసరప్రశ్నలు వెయ్యకుండా ప్రస్తుతం యెగురుతోన్న మార్గంలోనే ప్రయాణ సాగించు" ఇయర్‌ఫోన్సులో విజయరాంకు విని పించిన సమాధానం అది.

విజయరాం కొద్దిగా కంగారు పడ్డాడని వొప్పుకోక తప్పదు. ఎయిరిండియా పైలెట్లందరికీ అనుభవమున్న వాడతను. అయినా ఇలాంటిది అతనికి క్రొత్త. బహుశా ప్రపంచంలో ఈ రకమైన హైజాకింగ్స్‌లో ఇదే మొద టిదేమో.

మామూలుగా అయితే, విమానంలో బాంబువుందనో లేదా ఏ ఉగ్రవాదో తుపాకి పట్టుకొని ఎయిర్‌హోస్టస్‌ని బెదిరిస్తూ కాబిన్‌లోకి రావడమో, జరుగుతూ వుండేది. కాని ఇప్పుడు తనకు వినిపిస్తోన్నది ఓ గొంతుమాత్రమే. రేడియోలో వినిపిస్తున్న ఆ గొంతు తప్ప హైజాకర్ వునికి తెలుసుకునే అవకాశమే లేదు.

హైజాకర్ భూమిమీద వున్నాడో, క్రింద సము ద్రంలో వున్నాడో, లేదా తనతోపాటు విమానంలోనే వున్నాడో తెలుసుకొనే అవకాశం లేదు. ఎందుకంటే మద్రాస్ ఎయిర్‌ట్రాఫిక్ కంట్రోలు టవరు ఉపయోగించే ఫ్రీక్వెన్సీ తెలిస్తే వి హెచ్ ఎఫ్ అంటే వాకీటాకీ సెట్ వున్న ఎవరయినా ఈజీగా పైలెట్‌తో మాట్లాడవచ్చు.

మద్రాసు ఎయిరుకంట్రోలు రాడారు ఏరియా దాటే వరకూ, కంట్రోలరు విమానంతో రేడియో కాంటాక్టు ఓపెనుగా వుంచుతాడని విజయరాంకి తెలుసు. అంటే

తన విమానం హైజాక్ చెయ్యబడినట్లు రేడియోలో చెప్పినమాటలు కంట్రోలరుకూడా వినివుండాలి.

"మద్రాసు టవర్ — ఐ. ఎ. టుజీరోవన్."

"ఐ. ఎ. 201 — గో ఎహెడ్."

కంట్రోలరు కంఠం విజయరాంకు కాస్త కంగారు తగ్గించింది.

"ఇంతకుముందు ట్రాన్స్మిట్ అయిన మెసేజ్ విన్నారా?"

"యస్ విన్నాను" అన్నాడు కంట్రోలరు నిశ్చలంగా. "వాటీజ్ ది స్టోరీ?"

"ఐ. ఎ. 201, మా ఎసెస్‌మెంటు ప్రకారం ఆ మెసేజ్ వచ్చింది మీ విమానం ప్రాంతంలోనుండే... బహుశా మీ విమానంలో పాసింజర్లు యెవరయినా వి. హెచ్. ఎఫ్. గాని వాకీటాకీగాని ఈ ఫ్రీక్వెన్సీకి ట్యూన్ చేసిమాట్లాడుతూవుండాలి. వెంటనేఎవర్నయినా"

విన్నర్ కంఠస్వరం కంట్రోలర్ మాటల్ని ఆపేసింది.

"మద్రాసు టవర్. దిసీజ్ ఎ హైజాక్. నేను చెప్పేది జాగ్రత్తగా వినండి. నేను ఇవ్వబోయే ఇన్‌స్ట్రిక్షన్స్ జాగ్రత్తగా వింటూ వ్రాసుకోవడం మంచిది. పూర్తిగా వినకపోయినా మరిచిపోయినా మీకేనష్టం.

ఐ. ఎ. 201 కెప్టెన్! జాగ్రత్తగా విను. ఇప్పుడు ఎగురుతున్న మార్గంలోనే ముప్ఫయ్యారువేల అడుగుల ఎత్తుకు నీ విమానాన్ని పోనివ్వు. టువన్‌జీరో డిగ్రీలలో వుంచు ఫ్లైట్ కోర్స్."

మద్రాసు టవరులోనూ, జంబో 747 కాక్‌పిట్‌లోను వింటున్నవారికి విన్నర్ స్వరం స్పష్టంగా వినిపిస్తోంది... మనిషి గొంతులా కాకుండా, ఏదో వాయిస్ జంబ్లరు ఉపయోగించి మాట్లాడుతున్నట్లు, మెటాలిక్‌గా విని పిస్తోంది.

"రైట్, మీ రాడారు స్క్రీన్సుమీద ఈ సరికే మీరు గమనించేవుంటారు. జంబో 747కి వందమీటర్ల పైన, అయిదువందల మీటర్ల వెనక వున్నాను నేను... ఆశ్చర్యపోకండి. గాలిలో ఎగరడంలేదు. ఒక జెట్ ఫైటర్లో మీ వెనకే వస్తూన్నాను. నా జెట్ ఫైటరు వింగ్స్‌లో ఎయిర్ టు ఎయిర్ మిసైల్స్, రాకెట్సు వున్నాయి. ఫుల్‌గా లోడ్ చేసిన. ఆర్మ్‌డ్ గన్ ట్రిగ్గర్ నా చేతికి అందే దూరంలోవుంది. నేను తలచుకొంటే జంబో 747ను నిముషంలో కూల్చిపారేయగలను.అర్థమయిందా"

"మద్రాసు టవరు...వుయ్ అండర్ స్టాండ్—" అన్నాడు మద్రాసు కంట్రోలరు.

"వాటెబవుట్ యు... కెప్టెన్ ఐ. ఎ. 201" అసహనంగా అడిగాడు విన్నర్.

"వుయ్ రీడ్ యు—ఐ. ఏ. 201" అన్నాడు విజయరాం హీన స్వరంతో.

"గుడ్, నా నెక్‌ది మెయిన్ ఇన్‌స్ట్రక్షన్" విన్నర్ గొంతులో టెన్షన్ స్పష్టంగా కనిపిస్తోంది.

మద్రాసు టవరులో కంట్రోలరు హైజాకర్ ఆజ్ఞలు వు.చ. తప్పకుండా కాపీయింగ్ పాడ్ మీద వ్రాసుకో

సాగాడు.

హైజాకర్ కంఠస్వరం స్పష్టంగా వినిపిస్తోంది. "రైట్ డౌన్ కేర్‌ఫుల్లీ... మద్రాసు కేంద్రస్థానంగా నాలుగువందల మైళ్ళ రేడియస్‌లో తిరుగుతోన్న అన్ని విమానాలు, ఓడలు వెంటనే ఈ ప్రాంతంలోనుండి క్లియర్ అయిపోవాలి.

నా విమానంలో అల్ట్రామోడరన్ లాంగ్ రేంజ్ రాడారువుంది. నేను చెప్పిన పరిధిలో ఏ రకమైన విమానంగాని, ఓడలుగాని నా దిశలో కదులుతున్నట్లు కనిపిస్తే మరి ప్రశ్నలు అడిగే ప్రశక్తిలేదు. వెంటనే ఎయిర్ టు ఎయిర్ మిస్సెయిల్సుతో జంబో జెట్‌ను క్షణంలో కూల్చివేస్తాను. ఆ విషయం గుర్తుంచుకోండి.

సరిగ్గా పదినిముషాల్లో నేను చెప్పిన పరిధిలోని అన్ని విమానాలకు, ఓడలకు ఈ ఇన్ఫర్మేషను తెలియజేసి ఈ ఏరియా క్లియర్ చేయండి. అండర్‌లైన్ మై వర్డ్స్. ఈ షరతు సివిలియన్, మిలిటరీ, ప్రయివేట్ అన్నిరకాల వాహనాలకూ వర్తిస్తుంది. నోటిఫై విదిన్ టెన్ మినిట్స్ అండ్ క్లియర్ ది ఏరియా ఇన్ థర్టీ మినిట్స్. అరగంట తర్వాత నా రాడార్ మీద ఏవిధమైన సంజ్ఞ కనిపించినా సో గెటాన్ విత్ ఇట్ నా."

"మద్రాసు టవరు... వుయ్ కాపీ ... రోజర్"—అని మైక్ ఆపుచేశాడు స్వామినాథన్.

వెంటనే చకచక అసిస్టెంటు కంట్రోలరుకు, మిగిలిన కంట్రోలర్లకు, ఆర్డర్లు జారీ చేయుడం మొదలుపెట్టారు.

* * *

జంబో 747 వెనకే 'అంగారక'లో ఫాలో అవుతున్న విన్నర్ ఒక్కసారి ఇన్స్ట్రుమెంటు పేనల్ చెక్ చేసు కుని టైము చూసుకొన్నాడు. తను హైజాకింగ్ మొదలు పెట్టి అప్పాటికే ఇరవై అయిదు నిముషాలు దాటింది.

"ఐ. ఎ. టు. జీరో వన్... మే ఐ నో ది కెప్టెన్స్ నేమ్?" అడిగాడు.

"కెప్టెన్ విజయరాం!"

"వెరీగుడ్ కెప్టెన్ విజయరాం...ఇకనుండి నన్ను హాడో ఆఫ్ జంబో అని పిలవండి. అయామ్ వెరీ సారీ అబౌట్ దిస్ పొజిషన్...కాని తప్పదు. ఎవరూ కంగారు పడకుండా చెయ్యవలసిన పనులు సక్రమంగా చేస్తే ఎవరికీ ఏ ప్రమాదమూ వుండదు" అన్నాడు విన్నర్.

"ఐ హోప్ సో!" అన్నాడు విజయరాం మాటరాఫ్ హాట్‌గా.

"గుడ్! విజయరాం...నీకో ప్రశ్న! నీ ఫ్యూయల్ పొజిషన్ ఎలా వుంది? ఇప్పుడున్న లెక్కల ప్రకారం ఇంకా నీ విమానం ఎంత సేపు ఎగురుతూ వుండగలదు?"

జంబోలో విజయరాం గుండె ఒక్కక్షణం ఆగి కొట్టు కోవడం మొదలు పెట్టింది.

"హాడో! వెయిటెమినిట్...గేజెస్ చెక్ చేసి చెప్తాను" అని మైక్ ఆఫ్ చేసి మిగిలిన ఇద్దరు ఆఫీసర్లవైపు తిరిగాడు విజయరాం.

మిశ్రా కళ్ళు అప్పటికే చకచకా ఫ్యూయిల్ గేజ్ రీడింగ్స్ నోట్ చేసుకొని, మెదడులో లెక్క కట్టటం

కూడా అయిపోయింది.

"ఎనిమిది...మాక్సిమమ్ ఎనిమిదిన్నర గంటలకు సరి పడా వుంది" అన్నాడు మిశ్రా.

"అయితే ఆరుగంటలని చెపుతాను. టోక్యాట్రిప్ ఆయిదు గంటలు పడుతుంది. పైన సేఫ్టీ ఫాక్టర్‌గా ఓ గంట ఎక్స్ట్రా ఫ్యూయిల్ వుందంటే బిలీవబుల్‌గా వుంటుంది."

"మనం అబద్ధం చెప్పినా వాడు నమ్ముతాడని నేననుకోను...నమ్మినా నష్టం లేదు...ఎందుకంటే ఆరు గంట గంటలకు మించి షాడో విమానం కూడా ఆకాశంలో వుండలేదనుకుంటాను. నాకు తెలిసినంతవరకూ అంత సేపు గాలిలో ఎగరగల జట్ విమానం ఇంతవరకూ తయారు చెయ్యబడలేదు" అన్నాడు మిశ్రా.

అవునన్నట్లు తలవూపాడు వేణు. "ఎందుకంటే ఆరు గంటలకన్నా వాణ్ణి ఎక్కువసేపు మనతోపాటే ఎగురుతూ వుంచి, వాడి పెట్రోల్ అయిపోగానే తప్పించుకోవాలని మనం ఆలోచించితే అది అవివేకం అవుతుంది. వాడి జెట్ ఫైటర్ ఆరుగంటలకన్నా ఎక్కువసేపు ఎగరలేకపోతే తనకు కావలసిందేదో ఆ లోగానే సాధించుకొని పోతాడు."

విజయరాం తల వూపి మైకు ఆన్ చేశాడు..."షాడో వుయ్ గాట్ సిక్స్ హావర్స్ ఫ్యూయల్...మహా అయితే మరో పావుగంటో, అరగంటో..."

హేళనగా నవ్వాడు విన్నర్. డబ్బాలో మిఠాయి వుండలు తీస్తుండగా పట్టుబడిపోయిన కుర్రాడి అవస్థ

చూసి నవ్వే నవ్వు... "ఇట్ డజంట్ మేటర్... నువ్వు చెప్పినదానికి మరో రెండు గంటలు కలుపుకో వాలని నాకు తెలుసు" అన్నాడు.

విజయరాం పళ్ళు పట పట కొరుక్కున్నాడు. మిశ్రా నమ్మలేనట్లు తల అటూ ఇటూ ఆడించాడు. తొందరపడ వద్దన్నట్లు విజయరాం భుజం నొక్కాడు.

విన్సర్ తన ముందున్న రాడార్ తెరలన్నీ చకచక పరీక్ష చేశాడు. సూపర్ సెన్సిటివ్ రాడార్ అంటెన్నాని మూడువందల అరవై డిగ్రీలు త్రిప్పి పరీక్షించాడు. తెరల మీద ఏవిధమైన చుక్కలూ కనిపించడం లేదు... తృప్తిగా తలాడించాడు.

"మద్రాస్ టవర్...ఆర్ యూ దేర్?"

"యస్...పాడో!" స్వామినాథన్ కంఠం.

(సశేషం)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్ట చివరిబొమ్మ) పరిశీలించండి. రెండు ముఖ చిత్రాలకు సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి ఈ నెల 10వ తేదీ లోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబరుకూడా వ్రాయాలి. సభ్యులు కాని వారు తమ వ్యాఖ్యలతో 30 పై.లు స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో చూడండి.

## "హోం డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యత్వము తీసుకుంటే, మీకు కాపీలు గ్యారంటీగా చేరుతాయి. పైగా పత్రిక ఖరీదులో కొంత తగ్గింపు లభిస్తుంది.

సభ్యత్వం కోసం మీరు రు. 5/-లు పంపండి. మీకు ప్రతి నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 5/-లకే వి.పి. ద్వారా పంపబడతాయి.



# క్రైమ్‌లో తమాషాలు

## సాటి గాడిద!!

సుబ్బారావ్ ఓ హోటల్లో టిఫిన్ తెప్పించుకుని తింటు న్నాడు. అంతలోకే ఒక ముష్టివాడు అక్కడికి వచ్చి—

"బాబూ....ప్రొద్దుట్నుంచి అన్నంలేదు ... దరమప్రభువులు ఏదైనా ఇప్పిస్తే...." అంటూ దీనంగా చేతులు చాచి అడిగాడు సుబ్బారావ్ వైపు చూస్తూ.

సుబ్బారావ్ అది విని, యువరాజులా ఫోజుపెట్టి— "వోయ్....సర్వర్ ఇట్రావోయ్" అంటూ దగ్గరికి పిలిచి, "ఇదుగోనోయ్। ఆ గాడిదకు వో ప్లేట్ ఇడ్లీ తెచ్చిపడెయ్" అంటూ భుజాలు యెగురవేశాడు.

సర్వర్ అది విని "అబ్బ। సాటివారిని చూస్తే మీకెంత జాలిసార్।" అన్నాడు అభినందనంగా।

సుబ్బారావ్ మొఖం మాడిన పెసరట్టయింది.

—యం. వీరాస్వామి, మల్కాజిగిరి.

## "చూస్తూండండి!"

తొమ్మిదయ్యేసరికి రైల్వేస్టేషన్ చేరుకున్నాను.

స్టేషనంతా రద్దీగా వుంది.

వారానికి ఒకసారన్నా ఇలా స్టేషన్‌కు వస్తుంటాను. ఖరీదైన బట్టలు వేసుకుని వుండడంతో చూసేవాళ్ళకి పెద్ద మనిషిలా కనిపిస్తాను.

ఈ రైల్వేస్టేషన్ నాకింత అన్నం పెట్టి దర్జాగా బ్రతికేలా చూస్తున్నది. ఎవడో ఒకడు కంపార్ట్‌మెంట్‌లోగాని, బయటగాని వాళ్ళ సామాను చూస్తుండమని అడుగుతారు. పాపం! ఏ కాఫీకో, టిఫిన్‌కో వెళ్లాలిగదా. పక్కనున్న పెద్దమనిషికి వాళ్ళ సామాను అప్పచెప్పి వెళ్తారు.

అలా నన్ను చూడమని యెవడో ఒకడు అడుగుతుండే వాళ్ళు. పాపం జాగ్రత్తగా ఇంటికి పట్టుకెళ్ళి చూస్తూనే ఉన్నా.

దొరుకుతాననే భయంలేదు. ఎందుకంటే ఒకసారి వేసిన వేషం రెండోసారి వెయ్యను.

ఇంతకాలం నుంచి ఇదే సంపాదన. కాకుంటే ఒక సారి యెక్కువ ఒకసారి తక్కువ. అంతే తేడా.

మెల్లగా ఒక కంపార్ట్‌మెంట్‌లోకి యెక్కి తలుపు దగ్గర నుంచున్నాను.

పెట్టెలో ఇద్దరు ముగ్గురు మాత్రమే వున్నారు. ఏదో పుస్తకాలు చదువుకుంటున్నారు.

ఇంతలో యెవడో రెండవనంబర్ ప్లాటుఫాం దిగి పట్టాలుదాటి నేనున్న పెట్టెలోకి వచ్చాడు. చేతిలో బరువైన సూట్‌కేస్ వుంది.

దాన్ని నా పక్కన పెట్టి "సార్, కాస్త చూస్తుండండి. టికెట్ తెచ్చుకుంటాను" అని ఒకటవ నంబర్ ప్లాట్‌ఫాం

దిగి జనంలో కలిసిపోయాడు.

నా రొట్టె విరిగి నేతిలో పడిందనుకున్నాను. సూట్‌కేస్ పట్టుకుని వెనక తలుపుద్వారా నేను పట్టాల మీదకి దిగి, రెండో నంబర్ ప్లాట్‌ఫాం మీదికి చేరాను.

వాడు వచ్చేసరికి నేను కన్పించక వాడు పడే కంగారు తల్చుకుని గర్వంగా నవ్వుకున్నాను.

బయటకి చేరుకుందామని నాలుగు అడుగులు వేసేసరికి చటుక్కున నలుగురొచ్చి కదలకుండా పట్టుకున్నారు నన్ను.

బిత్తరపోయాను.

దభీ, దభీమని నాలుగు తగిలించారు వార్నింగ్ కూడా ఇవ్వకుండా. నా కేమీ అర్థంకాలేదు. అర్థమయ్యేసరికి పోలీసులు పట్టుకెళ్ళారు.

ఇంతకీ జరిగిందేమిటంటే, సూట్‌కేస్ నా దగ్గర పెట్టిన వాడు కూడా నాలాగే దొంగవెధవే! వాడు రెండోనంబర్ ప్లాట్‌ఫాం మీద కొట్టేసి, వాళ్ళు వెంటబడే సరికి దాన్ని నా దగ్గర వదిలి తప్పుకున్నాడు.

అది తెలీని నేను సూట్‌కేస్ దొంగిలించి తిన్నగా దాని సొంతదారుల దగ్గరకే పారిపోయి వచ్చాను.

—కె. మురళీమోహన్, నూజివీడు.

## అరువు పుస్తకం!

బస్‌ప్రయాణంలో సుబ్బారావుకో అలవాటుంది. ప్రయాణీకుల్లో యెవరి దగ్గిరెలాటి పత్రికున్నా, శుభ్రంగా అడిగి పుచ్చుకుని, తనివిదీరా చదవడం.

ఒకరోజు సుబ్బారావు పనిమీద నిజాంబాద్ వెళ్ళవలసి వచ్చింది. హైద్రాబాద్ నించి పుదయం ఆరుగంటలకి సూపర్ బస్ యెక్కి బైలుదేరాడు. ఏ పన్నెండింటికోగానీ, బస్సు నిజామాబాద్ చేరదు.

"ఏదైనా పత్రికుంటే బావుణ్ను!" అనుకుంటూ చుట్టూ చూశాడు.

ఏ ఒక్కరి దగ్గిరా కనీసం దినపత్రికైనా లేదు.

గంట తర్వాత ఓ స్టాపులో ఆగింది బస్సు.

"కాఫీలు తాగొచ్చు!" అంటూ కండక్టర్ దిగి, ఓ హోటల్లోకి దూరాడు.

అందరి వెనకే సుబ్బారావూ దిగి, కాఫీతాగి, కిళ్ళీ బిగించి, పక్కనున్న బుక్‌స్టాల్ దగ్గర నిల్చున్నాడు. రకరకాల సినిమా తారల ముఖచిత్రాలతో అందంగా వేళాడుతున్నాయి యెన్నో పుస్తకాలు. కొందామనిపించింది. కాని, మనసు పీచుపీచు మంటూ అంగీకరించడం లేదు.

అంతలో, అతని పక్కనే కూర్చున్న ప్రయాణీకుడు పరుగున వచ్చి, 'అపరాధ పరిశోధన' కొనేశాడు.

"హమ్మయ్య!" అనుకున్నాడు సుబ్బారావు.

బస్సు తిరిగి బయలుదేరింది.

అతను అరగంటలోనే పత్రిక చూసేసి, అతని వైపు ఆకలిగా చూస్తున్న సుబ్బారావు కందించాడు దాన్ని.

గంటలు గడిచిపోయాయి. డిటెక్టివ్ కథల్లోని థ్రిల్లును పూర్తిగా ఆస్వాదించాడు సుబ్బారావు. అంతలో అతను

దిగవలసిన స్టాపు రానే వచ్చింది.

పుస్తకం ఇచ్చేద్దామనుకుంటూ పక్కకి చూస్తే అతను లేడు!

'ఈ రోజు లేచినవేళ మంచిదే! మూడున్నర ఖరీదు జేసే పుస్తకం ఫ్రీగా చేజిక్కింది' అనుకుంటూ లేచి సూట్ కేస్ చూశాడు సుబ్బారావు.

అదెప్పుడో మాయమైంది!

—రాజారెడ్డి, తాండూరు.

## కనిపించని పెన్ను?

డిటెక్టివ్ దిగంబరాచారికి బయట తలుపు తట్టిన చప్పుడు విన్పించింది.

"కమిన్" వీలైనంత గంభీరంగా అని, ఏదో ఆలోచిస్తున్నట్లు తలపైకెత్తి చూడసాగాడు. అడుగుల చప్పుడు దగ్గరకు వచ్చింతర్వాత "కూర్చోండి" అన్నాడలాగే.

రెండు నిముషాల తర్వాత యెదురుగా వున్న కుర్చీలోకి చూసి అదిరిపోయాడు.

అక్కడ ఓ ఏడేళ్ళబ్బాయి దిగులుగా కూర్చొని వున్నాడు. ఏడ్చినట్లు అతని కళ్ళు ఉబ్బివున్నాయి.

"ఏయ్! యెవరు నువ్వు? యెందుకొచ్చావిక్కడికి" కంగారుగా అన్నాడు.

"మీరేకదండి తలుపుతట్టితే రమ్మన్నారు, లోపలికి రాగానే కూర్చోమన్నారు" అమాయకంగా అన్నాడాబ్బాయి.

వచ్చిన మొదటికేసు వదులుకోవటం ఇష్టంలేక, వస్తున్న కోపాన్ని దిగమింగుకొని అన్నాడు. "యెందుకొచ్చావిక్కడికి?"

"నా పెన్ను పోయిందండి."

"నీ పెన్ను పోతే నా దగ్గరకెందుకొచ్చావ్?"

"నాకు తెల్సండి. మీరు పరిశోధకులని, అందుకే నా పెన్ను వెతికిస్తారని వచ్చా."

"మరి ఫీజేం యిచ్చుకుంటావు?"

"నా దగ్గరున్న అర్థరూపాయిస్తానండి."

"యెక్కడినుంచి బయలుదేరావ్?"

"ఇంటినుంచి."

"యెక్కడికి పోతున్నావ్?"

"స్కూల్‌కి."

"ఇంటి దగ్గరనుంచి బయలుదేరేప్పుడు పెన్ను తీసుకున్నావా?"

"నాకు బాగా గుర్తండి. పెన్ను తీసుకున్నాను."

"పెన్ను పోయిందని యెప్పుడు తెల్సింది?"

"స్కూల్ గేటు దగ్గరండి."

"అక్కడెందుకు చూసుకున్నావ్?"

"ఏదైనా కొనుక్కుందామని అర్ధరూపాయికోసం చెయ్యిపెట్టానండి. జేబులో డబ్బులున్నాయి. కాని పెన్ను లేదు."

కాసేపాలోచించాడు దిగంబరాచారి.

"అయితే దారిలో యెక్కడో పెన్ను పోయిందన్న మాట."

"అంతేనండి."

"దార్లో నువ్వెవరింటికైనా వెళ్ళావా?"

"లేదండి."

"నీ స్నేహితులెవరైనా వచ్చి నీతో మాట్లాడారా?"

"లేదండి."

చాలా విసుగ్గా వుంది దిగంబరాచారికి.

"అయితే దార్లో యెక్కడైనా ఆగావా?"

"ఆఁ....అవును. గుర్తొచ్చిందండి. దార్లో పంపుదగ్గర మంచినీళ్ళు త్రాగుతూ అక్కడ గూట్లో పెట్టాను. చాల థాంక్సండి." తుర్రుమంటూ పరిగెత్తాడాబ్బాయి.

"ఏయ్ అబ్బాయి, అర్ధరూపాయి" అని అరుద్దామనుకునేంతలోనే కనుమరుగయ్యాడా పిడుగు.

—'ఇందు', గుంటూరు-2.

# ఎక్కడ కొట్టాలి?

"ఏమండి-మీ కుమారుడు నా తలపై కొట్టాడండి!"

"ఎందుకు కొట్టాడు బాబు?"

"నేను మీ వాని ముక్కుపై కొట్టాను. వాడేమో తలపై కొట్టాడండి!"

"బాధపడకు బాబూ! మా కుమారుడు రాని యీసారి నీ ముక్కుపైనే కొట్టమని చెప్తానులే!!"

—కె. నాగభూషణ, బత్తలపల్లి.

# కల్తీ కాలం?

సైన్సు లెక్చరర్ సదాశివం ఒకరోజు కోమటి కోటయ్య కిరాణాకొట్లో కొన్ని సరుకులు కొన్నాడు. వాటిని వాడు కుంటున్న కొద్దీ అందులో సగానికి పైగా ఇతర చవక బారు వస్తువులు కలపబడి వున్నట్టు పసిగట్టాడు.

కోమటిని నాలుగు గట్టిగా దులిపిపద్దామని, చిందులు తొక్కుతూ కొట్టుకెళ్ళాడు. "ఏమయ్యా, నీకు బుద్ధుందా? సరుకులు కల్తీచేసి జనాన్ని దోచుకుంటావా? కల్తీనేరం కింద నిన్ను జైల్లో పెట్టిస్తాను జాగ్రత్త!" అంటూ విరుచుకుపడ్డాడు కోమటి మీద.

ఈ గొడవతో అనేకమంది పోగయ్యారక్కడ.

"ఇదుగో పంతులుగోరూ! మాటలు జాగ్రత్తగా రానియ్యండి. కానేజనం ఎర్రిబాగులోళ్ళు కాదండీ, నేను కల్తీ సరుకులమ్మితే కొంటానికి. నా సరుకులు కల్తీవని ఋజువుజేస్తే, ఈ షాపే మూసేస్తాను జాగ్రత్త!" అన్నాడు కోమటి గుడ్లెర్రజేస్తూ.

"అతను చెప్పింది సబబుగానే వుంది. ఋజువుచేస్తారా మేష్టారూ!" అడిగాడో పెద్దమనిషి.

"చెయ్యకుండా ఊరుకుంటానా? ఇదుగో, ఈ పేపర్లో-ఏ పదార్థంలో ఏం కల్తీజేశారో యెలా తెలుసుకునేదీ వుంది చూడండి. ఉదాహరణకు బెల్లంలో కల్తీ కలిసిందీ, లేనిదీ తెలుసుకోవాలంటే-నీళ్ళలో కాస్త బెల్లాన్ని కరిగించి, దాంట్లో కొద్దిగా హైడ్రోక్లోరిక్ ఆమ్లం వెయ్యాలి.

బెల్లం నిజంగా కల్తీవుంటే, నీళ్లు యెర్రగా మారతాయి ఇదుగో, నా దగ్గర హైడ్రోక్లోరిక్ ఆమ్లం వుంది. నేను సైన్సు లెక్చరర్‌ను. మీ కళ్ళముందు ఈ పరీక్ష జేసి చూపిస్తాను" అంటూ పరీక్ష ప్రారంభించాడు సదాశివం.

దాంతో కోమటి గతుక్కుమన్నాడు.

పరీక్ష పూర్తయింది. బెల్లం రంగు ఎర్రగా మారలేదు. కానీ, సదాశివం మొహం మాత్రం తెల్లగా పాలిపోయింది.

దాంతో కోమటి మొహం చాటంతయింది. సదాశివాన్ని తెగుడ్తూ, తన సరుకుల్ని పొగుడ్తూ గంటసేపు జనాన్ని అదరగొట్టేడు. ఆ నాటినించీ అతని సరుకులకి గిరాకీ పెరిగిపోయింది.

పాపం! సదాశివానికి ఇంతవరకూ అర్థం కానిదల్లా ఒక్కటే. అతను కొన్న హైడ్రోక్లోరిక్ ఆమ్లమే కల్తీదని!

—విద్వాన్ షీలాదేవి.

